# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. సంచిక ౧౦.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౨

# విషయసూచిక

## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—ఏసుక్రీస్తు—ఆత్మత్యాగము; బావిచెంత; గుజరీ రాగిణి.

సాధారణ చిత్రములు:—విహారమునకు; ప్రకృతి చిత్రము; ప్రాచీనచిత్రములు ౪; ఇతర చిత్రములును.

ప్రపంచము ప్రకృతిమయము. ప్రకృతివిలాసము ప్రపంచవిలాసము. ప్రకృతివినా ప్రపంచము లేదు. ఈ ప్రకృతియందు స్త్రీత్వ మారోపితమయినది. అపుడు ప్రకృతి ఆదిశక్తి అయినది. అనంతరము స్త్రీరూపము కల్పితమయినది.౧ అంత నాదిశక్తికి ఆదిదేవి, మహాదేవి మొదలగు పేరులు గలిగినవి. క్రమముగా నాయాదిశక్తికి పెక్కురూపములు, పేరులు ఏర్పడినవి.౨ కీడు తొలగి మేలు కలుగుటకును, కోరికలు సమకూరుటకును జనసామాన్య మీకల్పితరూపముల నారాధింప దొడగెను.౩ ఆ యారాధనము తొలుత నమానుషము, నతిబీభత్సము నయి మానవుని కేవలపశుస్వభావమునకు నిదర్శనమయ్యెను. రానురాను సంస్కారము కారణముగా మానవుని హృదయమునుండి పశుస్వభావము తొలగిపోవుచు రాగా ఆరాధనమునను మార్పు గలుగజొచ్చినది.౪ కాని ఆయమానుషవిధాన మింకను పూర్తిగా రూపుమాయకున్నది.

అంబిక, హైమవతి, ఉమ, కాత్యాయని, సతి, దుర్గ, భద్రకాళి, కాళి, కాళరాత్రి, చండి మొదలయిన పేరులతో వెలయుచున్న సౌమ్యాసౌమ్యదేవీమూర్తులాయాద్యశక్తియనంతరూపములలో కొన్ని.౫ వీనిలో 'అంబికా' నామము శ్రుతులయందు ప్రస్తావింప బడినది. అంబీమె రుద్రునకు భగినిగా పేర్కొనబడినది ౬. ఉమా హైమవతీ దుర్గాదినామములు, వానికి సంబంధించిన గాథలు నుపనిషత్తులయందు గలవు. ప్రపంచమునందలి చరాచరవస్తుజాలమున నిండియున్న సకలశక్తులు నీయాదిశక్తియంశములే యనియు, ఈశక్తియే బ్రహ్మవిద్య యనియు, ఈమెయే పరమాత్మయనియు, త్రిమూర్తిస్వరూపిణి యనియు, ౭ సరస్వతీ లక్ష్మీ పార్వతీ నామముల త్రిమూర్తులకు భార్యలయినముగ్గురు త్రిధావిభక్తయగు నీశక్తియే యనియు నవి తెలుపుచున్నవి. తక్కినదేవీ నామముల కన్నింటికి ననురూపములగు గాథలు పురాణాదులయందు గలవు.

తొలుత ఆదిశక్తి మహిషాసురుని సంహరించుట కవతరించినది. మున్నొకమారు దేవతలకు, రాక్షసులకు యుద్ధము జరిగినది. అందు రాక్షసుల కపజయము కలిగినది. రాక్షసమాతయగు దితి తన కుమారుల యోటమికి వగచి యతికుపితయయి దేవతలనునిర్జింపగల సుతు నొక్కని బడయగోరి మహిషీ(గేదె) రూపమును దాల్చి బ్రహ్మదేవుని గూర్చి తీవ్రముగ తపము చేసినది. బ్రహ్మదేవు డామెకు దర్శన మొసగి యామె కోరిన వరము

---

౧. తొలుత ప్రకృతి శక్తిగా మారుటకు స్త్రీ సాధనమయినది. తరువాత స్త్రీయే శక్తిగా మారిపోయినది. కావుననే శాక్తేయులు పెక్కుశక్తులకు మారుగా స్త్రీని పూజింతురు.

౨. ఈదేవీభేదముల విచిత్రచరిత్రములు కల్పితములయి పురాణాదులయందు వివిధవిధముల వర్ణితము లయినవి. అవి యొకదాని నొకటి పోలియుండవు.

౩. ఈ యారాధనవిధానములే ఆగమములు, కల్పములు ననబరగినవి. ఇందునను వైవిధ్యము గలదు. కాలదేశములు, తత్త్వదర్శికాని మనుజునియొక్క మనఃపరిణామాదికములు నిందుకు కారణములు కావలయును.

౪. ఆరాధనము సాత్త్వికము, రాజసము, తామసము నని మూడువిధము లయినది. ఇందు తామసవిధానము అమానుషము. అది యింకను కొన్నిచోట్ల జరుగుచున్నది.

౫. గ్రామదేవత లనబడు శక్తులుగూడ నీ ఆద్యశక్తియొక్క క్షుద్రరూపములు. జాతర లను పేర నేటేట జరుగు నీగ్రామశక్తుల యుత్సవములయందు లెక్కలేని జీవజంతువులు 'బలి' యను నెపమున చంపబడుచున్నవి.

౬. "ఏష తే రుద్ర భాగః; సహ స్వస్రాంబికయా తం జుషస్వ."—తైత్తిరీయసంహిత.

౭. సరస్వతి=బ్రాహ్మీశక్తి; లక్ష్మి=వైష్ణవీశక్తి; పార్వతి=శాంభవీశక్తి. ఇట్లు తమతమ శక్తులను త్రిమూర్తులు తామే సృష్టించగలరు.

౮. ఈ మహిషాసురుని యుత్పత్తిని గురించిన గాథ లనేకవిధములుగా పురాణములయందు కనుపించుచున్నవి.

నిచ్చెను. ఆమె కంత మహిషాసురుడు[౧] జనియించెను. వాడు పరమశూరుడు, అతిమాయావి యై పెరిగి పెద్ద యయ్యెను. వాడును పరమశివుని గూర్చి యుగ్రమగు తపస్సు చేసి తనకు పురుషులచే చావు లేకుండ వరము బడసెను. అంత వాడు వరగర్వితుడై ఇంద్రుని నిర్జించి స్వర్గాధిపత్యమును బడసెను; దిక్పాలకుల నెల్ల జయించి తరిమివైచెను; ఋషులను బాధించెను. ఇట్లెల్ల లోకకంటకుడయిన మహిషాసురుని బారి కోరువజాలక యింద్రాదిదేవతలు బ్రహ్మదేవుని శరణుచొచ్చిరి. బ్రహ్మయు నాయసురుని మట్టుపెట్టు నుపాయము నాలోచించుటకయి, శివునికూడ దోడ్కొని, దేవతలందరు వెంటరా విష్ణుదేవునికడకు బోయెను. విష్ణువు వారందరిరాకకును కారణమును దెలిసికొనెను. అపు డందరు కలిసి యాలోచించుచుండ వారందరి యంగములనుండి తేజోరూపమున వారియంశములు వెలువడెను. ఆతేజఃపుంజమంతయు మహోజ్జ్వలరూపిణియు, సుందరాకారయు దివ్యాభరణభూషితయు, అష్టాదశ భుజయు[౨] నగు నొక యువతి రూపమును ధరియించెను. ఆయువతి మహాదేవీనామమున ప్రసిద్ధి కెక్కెను. ఆమెకు బ్రహ్మాదిదేవత లెల్లరు తమతమయాయుధముల నొసగిరి. సింహము వాహనమయ్యెను.[౩] దేవతలు ఆమెను మహిషాసురునిజంప నియోగించిరి.

ఇట్లవతరించిన దేవి తన్ను చంపి రక్తమును పానము చేయుచుండినట్లు మహిషాసురు డొకనాటిరాత్రి కలగనెను. వాడు మరునాడు మొదలుకొని దేవిని భక్తితో నుపాసించుచుండెను. కొంతకాలమున కామె వానికి (భద్రకాళీరూపమున) ప్రత్యక్షమయ్యెను. ఆమెకు వాడు తనస్వప్నవృత్తాంతమును విన్నవించెను. 'దేవీ, నీచేత నెట్లును నాకు చావు తప్పదు. నే నందు కించుకయు వగవు గొనను. నాతండ్రి శంభుదేవు నారాధించుటవలన నేను జన్మించితిని; ఎల్ల లోకములను జయించితిని; ఇంద్రపదమును గాంచితిని; సకలభోగముల ననుభవించితిని. నిరంతరము నీపాదముల నాశ్రయించియుండుటతప్ప నాకు నిక నేకోరికయు లేదు. దాని ననుగ్రహింప వేడుచున్నాను' అనెను. 'ఓయీ, నీవు నాచే మృతుడ వయ్యెదవు. నేను నిన్ను చంపుటకు మూడుమారులుమూడుమూర్తులను దాల్పవలెను. నీవు మృతుడ వయ్యును నీశరీరము నాపాదము నంటియే యుండును.[౪] నాకు కావింపబడు పూజ నీకును

౧. మఱియొక గాథ వీనిజననమునుగూర్చి—యిచట అనుసంధించుకొనదగినది — ఇట్లు కలదు: రంభుడను రాక్షసు డొకడు, అపుత్రకుడు శంభుదేవు నారాధించెను. వాని యారాధనమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయి వానిని 'వరము వేడుకొ'మ్మనెను. 'నీవే నాకు పుత్త్రుడవయి పుట్టవలెను' అని వాడు కోరెను. మహాదేవు డందు కంగీకరించెను. అంత రంభాసురుడు తన యింటికి మరలి వచ్చుచుండెను. త్రోవలో ఋతుమతి యైన మహిషి యొకటి వానికి గానుపించెను. వాడు కామోద్రేకమున దానితో గలసెను. అది గర్భవతి యయి మహిషాసురుని గనెను. ఈమహిషియే మహిషీరూపమును దాల్చిన దితి కావచ్చును. కాని యీమె యిట్లు మహిషీరూపమును దాల్చుటకు కారణము కానరాదు.

౨. ఈభుజములసంఖ్య నాలుగు, ఎనిమిది, పది, పదునారు, వేయి అని యిట్లు పెక్కుతెరగులుగా పురాణములయందు కానవచ్చుచున్నది.

౩. ఈసింహమును హిమవంతు డొసగెనని కొండొకచో గలదు.

౪. ఈమూడుమూర్తులు ఉగ్రచండ, భద్రకాళి, దుర్గ అనుపేరులు గలవి. ఈమూర్తుల పూజతోపాటు మహిషాసురునికి పూజ జరుగునని యొకట గలదు.

౫. దేవీవిగ్రహములయందు మహిషాసురుని శరీరమును వామపాదాంగుష్ఠమున దేవి నొక్కియుండుట కాననగును. ఇట్లుండుటకు మఱియొక కారణము చెప్పబడినది. దేవి ఖండించిన మహిషాసురుని శిరము నేలపయి బడినతోడనే వాని కళేబరమునుండి క్రూరుడగు రాక్షసు డొకడు పుట్టుచుండెను. అది కని దేవి మహిషుని కళేబరమునుండి రాక్షసుడు సంపూర్ణముగ వెలువడకుండ వానిభుజముపయి తన ఎడమకాలి బొటనవ్రేలుంచి నొక్కి పట్టినది.

జెందును' అని సెలవిచ్చెను. తరువాత నామె మూడు మూర్తులు దాల్చి వానిని రూపుమాపెను[౧]. ఇట్లు మహిషాసురుని వధియించి మహాదేవి (ఆదిశక్తి) 'మహిషాసురమర్దని' యయ్యెను.[౨]

పూర్వము రురుని కొడుకు దుర్గుడను అసురుడొకడుండెను. వాడు కడుమాయాశీలుడు; తపోబలమున మూడు లోకములను జయించెను; స్వర్గరాజ్యము నాక్రమించెను; దేవతలనందరిని మిగుల పీడించెను. దేవతలు భీతులయి శివుని మరుగుచొచ్చిరి. శివుడు దుర్గుని సంహరింప మహాదేవిని (శాంభవీశక్తి) నియోగించెను. ఆమె దేవతల కభయమిచ్చి దుర్గుని బట్టి తెమ్మని కాళరాత్రిని[౩] బంపెను. కాళరాత్రి యట్లు చేయబోయెను. వాడామెను కని తత్సౌందర్యమునకు ముగ్ధుడై యంతఃపురమునకు గొనిరండని తనయనుచరులను బంపెను. హుంకారాగ్నిచే కాళరాత్రి వారిని భస్మమొనరించెను. మరల గొందరు రాగా వారిని తననిశ్వాసవాయువుచే చెల్లచెదరుచేసెను. దుర్గుడంత తానే బయలుదేరెను. అది కని కాళరాత్రి వింధ్యాద్రినున్న మహాదేవియొద్దకు పోయి దుర్గాసురుని ఆగమనవార్తను తెలిపెను. దుర్గుడును తనసేనలతో కాళరాత్రిని వెంబడించిచని వింధ్యమును జేరి యచట మహాదేవిని చూచి యామె భువనమోహనసౌందర్యమునకు మోహితుడయి ఆమెను తనకు భార్యగా గోరెను. దేవివాని పయి క్రూరదృష్టిని బరపి తర్జించెను. వాడామెను బంధించి తీసికొనిరండని భటులను బంపెను. తన్ను పట్టవచ్చినవారినెల్ల మహాదేవి తనచెంతకు చేరనీయకుండెను. దుర్గుడు స్వయముగ నామెతో యుద్ధమునకు దలపడెను. అపుడామె శరీరమునుండి అనేకశక్తుల[౪]ుదయించి దుర్గునిసేనలను చక్కాడిరి. దుర్గుడపుడు గజరూపమును ధరించి దేవి[౫] నెదిరించెను.

దేవి ఆగజముతుండమును ఖండించివైచెను. రాక్షసుడాపయి మహిషమురూపమున దేవిపయి కురికెను.[౬] వానిని దేవి[౭] త్రిశూలముతో పొడిచెను. వాడు వెంటనే స్వస్వరూపమున సహస్రభుజములతో ప్రత్యక్షమయి దేవితో పోరదొడగెను.[౮] వానిని దేవి[౯] మహాస్త్రముతో చంపివైచెను. ఇట్లు దుర్గాసురుని జంపి మహాదేవి దుర్గానామమున వినుతికెక్కెను. ప్రకృతవ్యాస విషయముతో సంబంధముగల దేవీమూర్తులగాథ లివి.[౧౦]

పూర్వమీ దేవీపూజ వసంతకాలమున—చైత్రశుక్ల ప్రతిపత్తుమొదలు నవమివఱకు—తొమ్మిదిదినములు 'వాసంతీపూజ' యనుపేర జరుగుచుండెడిది.[౧౧] తరువాత శరత్కాలమునకు—ఆశ్వయుజశుక్ల ప్రతిపత్తుమొదలు నవమివరకు—మారినది. ఈతొమ్మిదిదినములు చేయుపూజకు[౧౨] 'శరన్నవరాత్రపూజ' యనుపేరు కలిగినది. ఈనాళులయందు ఆరాధింపబడునది, ప్రధానముగ, ఆదిశక్తి మూర్త్యంతరముగ ప్రసిద్ధిగన్న దుర్గాదేవి.[౧౩] ఐశ్వర్యప్రదయగు లక్ష్మియు,

౧. దీనినిబట్టి 'దుర్గ' యే మహిషాసురుని నిరవశేషముగ జంపినట్లు తేలుచున్నది.

౨. సకలదేవతల యంశముల వలన సముత్పన్నయయిన యీదేవిని పూజించుటచేత దేవతలెల్లరు సంతుష్టి చెందగలరు. కావున వారికి ప్రత్యేక పూజనక్కర లేదని యొకమతము.

౩. 'కాళరాత్రి'యు ఆద్యశక్తిమూర్తిభేదము.

౪. ఈశక్తులు ఆద్యశక్తి యనంత (సహస్ర) మూర్తులలోనివారే కావచ్చును.

౫. 'ఉగ్రచండ' మూర్తి.

౬. ఈ మహిషాకృతి దుర్గుడే మహిషాసురుడు కాదగును.

౭. 'భద్రకాళి' మూర్తి.

౮. మహిషాసురుని ఖండితశిరమునుండి వెలువడిన అసురుడు వీడే యగును.

౯. 'దుర్గా'మూర్తి.

౧౦. ఈరెండుగాథలకును ప్రకారాంతరములనేకములుగలవు. వానితో ప్రకృతమంతగా నుపయోగము లేదు.

౧౧. రావణాసురుడు దేవిని వసంతకాలమున పూజించెడివాడట. ఇపుడీపూజ వసంతకాలమున చాల విరళముగ జరుగును.

౧౨. శ్రీరాముడు దేవీపూజను శరత్కాలారంభమున కావించి రావణుని వధియించి విజయమును గాంచెనట. కొన్ని దేశముల ననువర్షము శరత్కాలముననే 'రామలీల' యను శ్రీరామోత్సవమును అతివైభవముతో జరుపుదురట.

౧౩. ఉత్తర హిందూస్థానమున మహాకాళిపూజ జరుగును. కాళియనుపేర భయంకరవిగ్రహమును, పదిపంద్రెండడుగుల పొడువుగలదానిని, తయారుచేయించి దానిని ప్రతిష్ఠించి యారాధింతురు.

జ్ఞానదాత్రియగు సరస్వతియు ఆనుషంగికముగా పూజింపబడుదురు. ఒక్కొక్కదేశమున నొక్కొక్కతీరున నీపూజ జరుగును.

పూజకు ఏడువిధముల కల్పములు గలవు: ౧. నవమ్యాదికల్పము; ౨. ప్రతిపదాదికల్పము; ౩. షష్ఠ్యాది కల్పము; ౪. సప్తమ్యాదికల్పము; ౫. అష్టమ్యాది కల్పము; ౬. అష్టమీకల్పము; ౭. నవమీకల్పము. సంపన్నులు ప్రతిపదాదికల్పము ననుసరింతురు; సామాన్యులు సప్తమ్యాదికల్పమును స్వీకరింతురు. తక్కినకల్పము లల్ప ప్రచారము గలవి.

ఇట్టికల్పముల ననుసరించి చేయబడుపూజ సాత్త్వికి, రాజసి, తామసి యని మరల మూడుతెరగు లయినది. నిరామిష నైవేద్యజపయజ్ఞ పారాయణాదులతో కూడిన పూజ సాత్త్వికి; బలిదానసామిష నైవేద్యాదులతో నాచరితమగుపూజ రాజసి; కేవలసురామాంసాదులచేతను, జంతుబలులచేతను నిర్వర్తింపబడుపూజ తామసి.[౧]

ప్రతిపదాదికల్పము ననుసరించి ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్తునాడు ప్రతిమా, కలశ స్థాపనాదులు కావించి కేశసంస్కారద్రవ్యములను, ద్వితీయను కేశబంధనసామగ్రిని, తృతీయను దర్పణ సిందూరాలక్తకాదులను, చతుర్థిని మధుపర్క తిలక నేత్రమండనాదులను, పంచమిని అంగరాగాదులను సమర్పింపవలెను. షష్ఠిని, సాయం సమయమున, బిల్వతరు శాఖయందు బోధనము[౨], ధ్యానము, సప్తమిని స్వగృహమున పూజనము (షోడశోపచారములతో), అష్టమిని ఉపవాసము, అష్టశక్తిపూజ, నవమిని

౧. ఉత్తరహిందూస్థానమున మహాకాళీపూజ సప్తమ్యాదికల్పము ననుసరించి తామసీవిధానమున అనుష్ఠింపబడును. వేలకొలది మేకపోతులు, పొట్టేళ్లు, నూరులకొలది దున్నపోతులు కాళీవిగ్రహముకెదుట బలి యీయబడును. బలికొసగ దెచ్చినజంతువులసమ్మర్దము, బలియిచ్చునపుడవి కావించు దీనభీషణారావములు, నరుకబడినజంతువులశీర్షములు, కళేబరములు, వానినుండి స్రవించురక్తప్రవాహము గలిసి యాదేవీపూజామందిరము కరుణబీభత్స భయానకరసములకు స్థానమయి పొడకట్టునట. కలకత్తా యందలి కాళీదేవాలయమున నిప్పటికి నిట్లే జరుగుచుండునట. ఒకానొక సంస్థానపు రాణీపూజాకాలమున ౬౫,౫౩౫ జంతువులను బలియిచ్చెనట. ఇక నక్కడ బండబూతు మాటలకు, చేష్టలకు, త్రాగుడుకు మితిమేర లుండవట. ఈపూజకొరకు ఏటేట లక్షలకొలది ధనము వ్యయమగుచుండునట. స్మరణమాత్రముననే యసహ్యముగొలుపుచున్న యీదారుణ పశుమారణకర్మము, దుర్నీతిచేష్టితములు గ్రామశక్తుల జాతరలయందును జరుగుచుండెను. ఈకాళీపూజలను, ఈజాతరలను తన కభ్యుదయమును కలిగించునను పిచ్చినమ్మకముతో మానవుడు చేయుచున్నాడు. వానియీపిచ్చినమ్మకమే తొలుత తన్నుబోలిన మానవుని సయితము బలిపశువునుగ జేసినది. ఇది పరకర్మముగాదు; స్వార్థపరుడగు మానవుని వంచనాయుతమగు ఘాతుకకర్మము. ఇది క్రమముగా నంతరించిపోయినది. పశుమారణకర్మముగూడ చాలవరకు తగ్గినను పూర్తిగా నశింపకున్నది. మానవుడు తానే దుర్గ, మహాకాళి, మున్నగుశక్తులు ఆదిశక్తిమూర్తు లన్నాడు; సర్వోత్కృష్టతను గల్పించినాడు. సామాన్యగ్రామదేవత లనబడు అంకాళమ్మ, పోలేరమ్మ మొదలగు శక్తులను క్షుద్రశక్తు లన్నాడు; నికృష్టతను గల్పించినాడు. స్వార్థపరుడయి మరి యాశక్తిమూర్తుల యుత్కృష్టతా నికృష్టతా విభేదమును కాల దన్నినయిచినాడు. అయ్యది తాను గల్పించినవ్యవస్థయే యని యెరిగియు, ఎఱుగనివానివలె ప్రవర్తించినాడు. స్వార్థపరత ఏలుబడిమహిమ యట్టిది!

౨. బోధనము=నిద్రించుచున్నవారిని మేలుకొలుపుట. దేవతలకు దక్షిణాయనము రాత్రి. నిద్రాకాలమగు రాత్రియందు కావించు బోధన 'మకాలబోధనము'; కావున శరత్కాలమునందలి దేవీబోధనము 'అకాల బోధనము' అనబడినది. రావణుని జంపి విజయమును బడయుటకయి శ్రీరామునిచేత పూజింపజేయ బ్రహ్మ దేవి నిట్లకాలమున మేలుకొలిపెనట. అది మొదలు దేవి కేటేట నిద్రాభంగము గలుగుచునే యున్నది.

ఉగ్రచండాదిదేవీపూజ, బలి[1] దానాదులు, కుమారీపూజ కావింపవలయును. దశమినాడు పూజ కావించి మధ్యాహ్నానంతరము ఉత్సవముతో దేవిని కొనిపోయి నదీజలమున విసర్జించవలెను. ఇది మహాపూజ యనబడును. ఈ తొమ్మిది దినములలో చివర మూడుదినములు ప్రశస్తములు.

సప్తమ్యాదికల్పము సప్తమినాడారంభమయి నవమితో నంతమొందును[2].

కల్ప మేదియయినను ఉత్తర హిందూస్థానమున పురాణాదులయందు వర్ణింపబడినవిధమున మృత్తికాదులచే దుర్గాదేవి[3] రూపమును నిర్మించి దానిని ప్రతిష్ఠించి పూజ కావింతురు. ఈవిగ్రహమునకు కుడిప్రక్క సరస్వతీ గణేశులయు, ఎడమ వైపున లక్ష్మీకార్తికేయులయు విగ్రహముల నిలిపి పూజోపహారాదులు సమర్పింతురు. దక్షిణహిందూస్థానమున కలశమును స్థాపించి దుర్గాదేవి నావాహనముచేసి తొమ్మిదిదినములు సాత్విక

---

౧. సాత్వికవిధానమున, గుమ్మడిపండ్లు, చెరకుగడలు, నిమ్మపండ్లు, బెంకాయలు మొదలగునుపహారములతో 'బలి' సమర్పణము నిర్వహింపబడును.

౨. పూర్వోక్త ప్రతిపదాదికల్పమునకును, ఈ సప్తమ్యాదికల్పమునకును మహదంతరము కలదు. ఇది ప్రశస్తముగా పరిగణింపబడినది. తామసపూజ కావించువారికిని ఈమూడురోజులే శ్రేష్ఠములు. అష్టమీ నవముల సంధికాలమున చేయుపూజ యుత్తమోత్తమము.

3. దుర్గాదేవివిగ్రహము మహిషాసురుని సంహరించుచున్నట్లు నిర్మింపబడును. దేవి వాహనమగు సింహమును దక్షిణపాదముతోడను, మహిషాసురుని శిరస్సును వామ (పాదాంగుష్ఠముతోడను మెట్టియుండును. పదిభుజములు నాలుగు, ఎనిమిది, పదునెనిమిదికూడ కొన్నిటికి), మూడు కన్నులు నుండును. త్రిశూలముతో మహిషాసురునివక్షము పొడచుచున్నట్లుండును. ఇట్టి విగ్రహము బంగారముతోను, వెండితోను, రాగితోను వారివారి సంపదకు దగినట్లు చేసికొందురు. జనసామాన్యము మృత్తికతో చేయబడిన విగ్రహములనే పూజింతురు.

ఈవిగ్రహములనుబట్టి వేదాంతార్థ మిట్లు సంభావింపబడినది. దుర్గాదేవి పరబ్రహ్మము. త్రిశూలము జ్ఞానము. సింహము, మహిషాసురాదులు కామక్రోధాదులు. త్రినేత్రములు త్రికాలములు. దశభుజములు దశదిశలు. లక్ష్మీసరస్వతులు, వినాయక కార్తికేయులు చతుర్విధ పురుషార్థములు. గణేశుడు వివేకమును కార్యసిద్ధిని ప్రసాదించును గావునను, లక్ష్మి యైశ్వర్యము నొసగును గావునను, కార్తికేయుడు శక్తిని సామర్థ్యమును సమకూర్చును గావునను, సరస్వతి జ్ఞానము ననుగ్రహించును గావునను ఆనలుగురు క్రమముగా ధర్మార్థ కామ మోక్ష చతుర్విధపురుషార్థము లనబడిరి.

సాధకుడు పురుషార్థసాధనము ద్వారమున జ్ఞానమును సంపాదించుకొని కామక్రోధాదులను ధ్వంసముచేసి త్రికాలవేదియయి సర్వవ్యాపియగు పరమాత్మను దెలిసి ఆత్మసిద్ధిని బడయునని దుర్గాపూజనము నంతరార్థము.

ప్రపంచము ఆదిశక్తి. ఆదిశక్తియే పరబ్రహ్మము. కావున ప్రపంచమంతయు పరబ్రహ్మస్వరూప మయినది. అందున సాధకుడు, సాధనము, సాధ్యము అన్నియు పరబ్రహ్మస్వరూపములే. ఈ సిద్ధాంతమును బట్టి, "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" అను గీతావచనమునకు సరిపోవునట్లు దుర్గాపూజనము బ్రహ్మయజ్ఞము నయ్యెను. పైసిద్ధాంతమును పురస్కరించుకొనియే తామస పూజనమునకు సయితము బ్రహ్మయజ్ఞ మను పరిపాటి కల్పింపబడినది. ఖడ్గము జ్ఞానము. బలి పశువులగు దున్నపోతు, మేకపోతు, పొట్టేలు మొదలగునవి క్రోధము, కామము, లోభము మొదలగునవి. కామక్రోధాదులకు దాసుడగు మానవుడు జ్ఞానమును సంపాదించుకొని వానిని రూపుమాపి మోక్షము నధిగమించు ననుట. ఇట్టి కల్పనములు నాటిమానవునికిని తరువాతి తరువాతి మానవులకును గల సంస్కారముయొక్క పరిణామమునకు నిదర్శనములు. మానవుడు తనయావశ్యకతనుబట్టి పందిని నందిని, నందిని పందిని చేయుచున్నాడు. అది వానికి సైజము.

విధిప్రకారము యథాశక్తి పూజానైవేద్యాదుల నర్పింతురు.౧ దుర్గ మొదలయిన శక్తులవిగ్రహములకు మారుగా బొమ్మలను కలశముచుట్టు నుంచెదరు.౨ సప్తమిని గాని అష్టమిని గాని, అథవా దశమినాడు మంటపమున నొకచో నలంకృతమగు వేదికపయి పుస్తకములను చేర్చి సరస్వతీదేవి నాపొత్తములయం దావాహనము చేసి షోడశోపచారపూజ కావింతురు. నవమినాడు రొక్కముగల పెట్టెలను వడ్లునింపిన కొట్లులను, వస్త్రాభరణాదులను పూజింతురు. ఇది లక్ష్మీపూజ. ఇట్లు దుర్గాలక్ష్మీసరస్వతీదేవులపూజ జరుగును. 'తొమ్మిదవనాటి రాత్రితో నీకొలువు తంతు తీరిపోవును. బంధుమిత్రులను, కూతుల నల్లండ్రను పిలువ బనిచి వారితో కూడి గృహస్థు లిష్టమృష్టాన్నభోజనములతో, ఇతరవినోదములతో నీరోజులను గడపుదురు. రాజగృహములయందు నవరాత్రపూజ కల్పోక్తప్రకారము జరుగును 'బొమ్మలకొలువు' మహావైభవముతో నుంచి నిత్యము ఉత్సవము కావింతురు. అనుదినము విద్యావినోదములతో, సంగీతసభలతో ప్రభువులు ప్రొద్దుపుచ్చుచుందురు. కంచరము, వ్యవసాయము మొదలగు వృత్తులే జీవనముగాగల ఆయా జాతులవారును తమతమ నిత్యజీవనమున కావశ్యకములగు నుపకరణముల నన్నింటిని నవమినాడు పూజించి౩ పండుగచేయుదురు.

మరునాడు విజయదశమి.౪ నాడు రాజులు [illegible]జాశ్వసింహాసనాదులయు, ఛత్రచామరాదులయు, గజాశ్వాదిసేనాంగములయు పూజను, 'లోహాభిసారకర్మ'ము

౧. 'శరన్నవరాత్రములు' అను నొకవ్యాసము, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచియించినది, రక్తాక్షి సంవత్సరపు టాశ్వయుజమాస భారతి సంచికయందు గలదు. అం దీపూజాప్రకారము విరివిగా వర్ణింపబడినది.

౨. దీనిని బొమ్మలకొలువు అనెదరు. ఇంట నను వయినచోట మేలుకట్టులు మొదలగువానితో మంటపమును నిర్మించి, యందు సోపానములవలె వరుసగా పలకల నమర్చి, వానిపయి శుభ్రవస్త్రముల బరచి, రామకృష్ణాది దేవతావిగ్రహములను, సుందరశిల్ప శిలావిగ్రహములను, వినోదములగు వాయువిమాన ధూమశకటాదుల ప్రతికృతులను, మృద్దారుదంతలోహ పుత్రికలను, రాజులయు, మంత్రులయు, సైనికులయు బొమ్మలను వరుసలు దీర్చి, వింతవింత తెరగుల కొలు వమరుతురు. చొక్కపుచిత్తరువుల మంటపము చుట్టుపట్టుల వ్రేలగట్టుదురు. ఆమంటపాలంకారము, ఆకొలువుచెలువు రాత్రులయందు దీపములవెలుగున చూడ సొంపుగ నుండును. ప్రతిదినము సాయంకాల మొకటిరెండు గడియలప్రొద్దుండగనే బాలికలు యువతులు కురులు దువ్వుకొని, పూవులు ముడుచుకొని, మోమున తిలకమును దిద్దుకొని, కన్నులకు కాటుక దీర్చుకొని, తమకుగల నగల నన్నింటిని పెట్టుకొని, మేలివలువలను గట్టుకొని, కుంకుమభరణులను కేల గొని యిరుగుపొరుగు ముత్తయిదువులను పేరంటమునకు పిలువ బోవుదురు. పూచిన గుబురు తంగేడుగున్నలవలె సాయంకాలపు మదురుటెండలో మిలమిలలాడుచు రాకపోకలు గావించు తలిరుబోడులతో నిండి గ్రామములు—విశేషించి నగరములు—వీథులు కలకలలాడుచుండును. మరల దీపములు పెట్టినది మొదలు వారు ఇరుగుపొరుగు వారల యిండ్లకు గుంపులుగట్టి పేరంటమునకు బోవుదురు. ప్రతి యింటను పేరటాండ్రెల్లరు 'కొలువు'న కెదుట గూరుచుండి పాటలు, పద్యములు పాడుకొందురు. ఆవల నా యాయియిండ్ల యిల్లాండ్రు పేరటాండ్రకు కుంకుమచందనాదుల నొసగి తమశక్తికి దగినట్లు ఫలములనో, భక్ష్యములనో తాంబూలములతో నిచ్చెదరు. ఇట్లీతొమ్మిదిదినములును సాయంకాలమునుండి రాత్రి జాము ప్రొద్దువరకు పేరటాండ్రసందడి మెండుకొనియుండును. పగటివేళకూడ రాత్రికి వలసినపనులను సవరించుకొనుటయం దిల్లాండ్రకు తీరుబడి యుండదు. అవి వారి రాజ్యపు దినములు. వారి నడ్డువా రెవ్వరు లేరు. వారి యానందమునకు మేర లేదు. వారియం దారోపితమయిన శక్తిత్వ మీదినములయందు మూర్తప్రసన్న సుందరస్వరూపమున మానవుడు కనుగొనగలడు.

౩. ఇదియు 'లక్ష్మీపూజ' యనదగినదియే.

౪. దేవి దుర్గాసురుని రూపుమాపి విజయమును గాంచిన దినమనియు, రాముడు రావణుని వధియించి గెలుపుగొనిన దినమనియు నైతిహ్యము.

ను,౧ ఆయుధాదిపూజను పరిపూర్తిచేసి ఆయుధములను కైకొని, సైనికులు వెంట రా, అశ్వముల నధిరోహించి మంగళవాద్యములతో తరలి నగరమున కీశాన-౨ దిశను పొలిమేర చేరువనున్న శమీవృక్షము (జమ్మిచెట్టు)౩ వొద్దకు జని యచట తొలుత 'నపరాజితా' పూజ౪ నొనరింతురు. తరువాత శమీపూజ౫ ను చేసి తత్పత్రములను గ్రహించి, సీమాంతమును గడచి ముందునకు మూడడుగులు వయిచి పరసీమ నుంచబడిన శత్రువులవిగ్రహములకు హృదయమున నమ్ముల నాట వేయుదురు. పదపడి గృహాభిముఖులయి మరల జమ్మిచెట్టునుండి ఆకులను దూసికొని శిరముల నుంచుకొని మహోత్సవముతో నగరు సొచ్చి౭ దర్బారు చేయుదురు; సామంతులు, పౌరులు, రాజ్యాంగమువారు సమర్పించు కానుకలను స్వీకరింతురు; కవి పండిత గాయకాదులను సన్మానింతురు; అనుచరుల కెల్లరకు వారివారికి తగిన పారితోషికముల నిచ్చి యానందింపజేయుదురు.౮

---

౧. రాజులు నవరాత్రపూజాదివసములందు నొక మంటపమున శస్త్రాదియుద్ధోపకరణములను, ఛత్రచామరాందోళికాదులను నిలిపి పూజించుచు అందొక కుండమున త్రివిధ తత్తదాయుధాదుల యధిదేవతల మంత్రములతో పాయసహోమము గావింతురు. దశమినాడును తత్పూజాహోమాదులను నిర్వర్తింపవలెను. ఇది 'లోహాభిసారకర్మము' అనగా 'శస్త్రప్రస్థాపనకర్మ'. పూర్వము 'లోహు' డను రాక్షసు డొక డుండెను. వా డతి మాత్రబలయుతుడు. వానిని దేవతలు యుద్ధమున జంపి తునుకలుగ త్రుంచివైచిరి. ఆతునుకలన్నియు లోహపు ముక్కలయినవి. ఇపు డాయుధములను జేయ నుపయోగించు లోహము వాని యవశేషమేనట. కావున తన్మయములగు నాయుధములు మొక్కపోకుండుటకు నేటికీ 'లోహాభిసారకర్మ' ను కావింతురు కాబోలు!

౨. తూర్పుదిశ యని గ్రంథాంతరము.

౩. జమ్మిచెట్టాదిక్కున లేనియెడల దాని కొమ్మనయిన దెచ్చి యచ్చట నాటి దానిని పూజింతురు.

౪. అష్టదళ పద్మమును రచియించి అందపరాజితను, దక్షిణవామభాగముల జయావిజయలను ఆవాహనముచేసి షోడశోపచార పూజ చేయుదురు. 'అపరాజిత' యనగా దుర్గాదేవిమూర్తి భేదము, శమీవృక్షవిశేషము కావున అపరాజితాపూజ యనగా శమీవృక్షాధిదేవతాపూజ యనదగును.

౫. జమ్మిచెట్టుమొదట నీరు పోసి మన్ను త్రవ్వి అందు దక్షతలను గలిపి తరువాత శమీపూజ కావింతురనియు, సీమోల్లంఘనమును గావించి గృహములకు మరలి వచ్చునపుడు ఆ యక్షతలు గలిపిన మృత్తికను గొనివత్తురని యు మతాంతరము.

౬. ఈ బొమ్మలను ముందే తయారుచేయించి యచట నుంచెదరు.

౭. సామాన్యజనులు చుట్టములు, నెచ్చెలులు పరిచారకులు మొదలగు వారలతో గలిసి తమ యింట నొక్కచో గూరుచుండి తాము వారి బహుమతుల నందుచు, వారికి దా మొసగి సత్కరింతురు.

౮. ఈ శమీపూజనము చేయుటకు మరియొక కారణ మిట్లు గలదు:

పాండవు లజ్ఞాతవాసము చేయబోవుటకు మున్ను తమ యాయుధముల నన్నిటిని కట్టగా గట్టి దానిని మత్స్యపుర ప్రేతభూమి పరిసరమున నున్న యొక జమ్మిచెట్టుపయి దాచిరి. ఆసమయము తీరగనే అర్జును డాకట్ట యందలి గాండీవమును గొని కౌరవులను పారద్రోలి విరటునావులను విడిపించెను. నాటనుండి పాండవులకు విజయపరంపర చేకూరుచుండెను. కావున విజయకాంక్షతో జనులు-తత్రాపి రాజులు-శమీపూజా సీమోల్లంఘనాదుల నాచరించు టాచారమయినది. పయి పాండవుల కథకును ఆచరణమునకును గల సంబంధ మీ క్రింద సూచింపబడుచున్నది.

రుద్రునకు శ్మశానభూమి విహారస్థానము. ఆయన యీశానదిశ కధిపతి; కైలాసవాసి. కావున శ్మశానము గ్రామమున నీశానదిశకు చేరువుగా—అనగా ఉత్తరము తూరుపు దిక్కుల గూడ చేరియుండునటు—పొలిమేర కడ నుండుట గాననగును. (గ్రామమున కుత్తరమున గాని

ఇట్టి నవరాత్రిదినములు మహోత్సవ దివసములయి చిరకాలమునుండి యాచరింపబడుచున్నవి.౧ అప్పటనప్పట అక్కడనక్కడ మానవుని అజ్ఞానమును, ఆవశ్యకతను, అభిరుచిని అనుసరించి ఈ పూజలు, ఈ పండుగలు, వీనికి చెందిన 'తంతు' వేరువేరు తెరగుల నేర్పడినవి.౨ వానిలో గొన్ని పరిశీల నార్హములు. తత్కార్య మవకాశాభావముచే స్థల కాలాంతరాపేక్ష మయినది.

---

తూర్పున గాని అందరకును, దక్షిణపుదిక్కున నుత్తమ వర్ణమువారికిని ఉండవలయునని కౌటిల్యుని మతము.) పాండవు లాయుధముల దాచిన జమ్మి శ్మశానముకడ నుండినది. కావున విజయదశమినాడు ఈశానదిశ (కొండొకచో మతమున ఉత్తరదిశ) నున్న జమ్మిని పూజించుట. పాండవు లాచెట్టుపయి నుండిన ఆయుధముల గొనిరి; కావున ఆయుధములకు మారుగా చెట్టునుండి జమ్మియాకులను గొనుట. అర్జునుడు కౌరవవీరులను మత్స్యదేశ సీమ దాట వెంబడించి తరిమి ఆవులను మరలించెను; కావున, జమ్మికడనుండి కొంతదూరము పోయి పొలిమేరదాటి యక్కడనున్న శత్రువుల బొమ్మలను బాణముతో గొట్టుట.

జమ్మిచెట్టు మొదటి మట్టిని గొనితెచ్చుట శత్రు రాజురాజ్యము నాక్రమించుటయనియు, జమ్మి ఆకులను దూసి తెచ్చుట ఆతని సంపదను కొల్లగొట్టుట యనియు సూచన.

౧. మైసూరు మొదలగు కొన్ని సంస్థానములయందీయుత్సవము లీనాడును చక్కగా జరుగుచున్నవి. దసరా పండుగలు అని యీ పూజాదినములకు ప్రసిద్ధి.

౨. గృహలక్ష్మి ప్రకృత (౧౯౩౭ అక్టోబరు) సంచికయందు 'దసరా ఉత్సవములు' అను పేరుగల వ్యాసము, డాక్టరు వి. వి. యస్. ఆరాధ్యగారు (యల్. ఐ. యం.) రచియించినది, ప్రకటితమయినది. అందు దుర్గా మహిషాసురాదుల చరిత్రాదులకును, ప్రాచీన భారతదేశ చరిత్రకును గల సంబంధమును, వాని పరస్పర సమన్వయమును గూర్చి కొంత తెలుపబడినది.




బావి చెంత

చిత్రకారుడు: శ్రీ యం. వి. సుబ్బరావుగారు, బ్రాహ్మణకోడూరు.




చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౩౨

సంపుటము ౯ ఆంగీరస సంవత్సరము, ఆశ్వయుజమాసము సంఖ్య ౧౦.

# ప్రాయోపవేశము

భువనమ్ముల్ కలగుండు పొందినవి బాపూజీ నిరాహారదీ
క్ష వహింపన్; సచరాచరమ్ము భరత క్ష్మాఖండమం దెల్ల నీ
రవమై స్తబ్ధమునైన యీప్రకృతి మూర్ఛల్ వోయె; స్వర్భూర్భువ
ర్భువభూభూతతియెల్ల డిల్లవడెఁ ద్వత్ప్రాయోపవేశమ్ములో!

ఈదాస్యమ్ము సహించి కల్పములుగా, నీరీతి నెట్లో యశః
శ్రీదారిద్ర్య మతర్కితక్షుధ మధఃకృత్తమ్ము నౌజన్మతో
నీదారిం బడి యొడ్డు జేరెదము గానీ, నీనిరాహారదీ
క్షౌదార్ఢ్యం బుపసంహరించుకొను మింకన్ విశ్వయోగీశ్వరా!

అంతర్ముఖుం డైన యర్ధేందుమౌళి నిటాలనేత్రాగ్ని భట్టారకుండు
అంతఃప్రతిష్ఠితం బంభోధిగర్భగర్భాంతర్దహద్బడబానలమ్ము
అంతస్సమావిష్ట మంభోదకుక్షిని క్షిప్తనిర్ఘాతనిర్ఘృణమహాగ్ని
అంతస్సమాధిసంయతమూర్తి త్ర్యంబక కంధరాధఃసుప్తకాలకూట
మఖిలభువనప్రదాహారంహఃప్రవృత్తి-నేకమై వ్రాలి మానవలోకములను
కాల్చివైచునో, లోకరక్షావిధాయి-విశ్వగృహమేధి కన్నీటివేడి దాకి!

* * * * * *

పాటిబండ మాధవశర్మ

వ్యాధిగ్రస్తకళేబరం బిది పరవ్యావృత్తదుర్వైద్యక
ద్వ్యాధాలబ్ధవిమూర్ఛ మిందు నిలువన్ భద్రంబులే దంచు దు
ష్టాధోలోకగమిష్యమాణులము మమ్మార్తిన్ బడంజేసియున్
వేధోలోకము నొక్కఁడే గదవటే విద్యామనోజ్ఞాకృతీ!

శ్రుతికందంబగు మూలవస్తు వది చిద్రూపంబు మాయోపబృం
హితవైరాట్పదవీపరిష్కరణ సాహిత్యంబు రూపించి, భా
రతసర్వంకషకిల్బిషౌఘధృతిమంత్రద్రష్టవై తత్త్వతః
స్థితి వైరాజ్య మలంకరింతువు విభూతిస్థానయోగాకృతీ!

హోతవు హవ్యమయ్యెద వహో! యిది యెక్కడివింతయజ్ఞ మ
ద్వైతము రూపుగొన్నయది, తావకసత్యవిభూత్యఖండతా
ధ్యేతలుగాక వస్తుగుణధీప్రవిలుప్తులు నిన్నుగూర్చి దుర్
జ్ఞాతవిభేదవిక్రియత సాగు నటంచు దలంతు రెమ్మెయిన్.

విశ్వస్థానవిధాత్మికంబులు మహావిశ్వంభరాప్రాణకృ
చ్ఛశ్వత్ స్పందనముల్ త్రయీజనకముల్ సాగించు మీబోటిస
త్త్వశ్రీప్రతిభాఢ్యులే ఋషులు త్వత్ప్రాయోపవేశక్రియన్
నిశ్వాసించె జగమ్ము చూడు మిది నీ నిర్ణేతృతాజ్ఞానమై.

కారణజన్ముడీ వికను కారణమృత్యుడ వౌదు వో దురా
చారవివృత్తమా భరత సంఘము నీదగునస్తకోటి నా
డీరమణీయమా నెడద కొంకియె దూరముగా తనూ
భారము తాను నిన్ బొదివి పాలనసేయునటయ్య, మోక్షముల్.

అంతేవాసిజనాంతరాత్ముడవు ప్రత్యక్షాత్మవిజ్ఞానవా
గంతర్నాదవిలాసభాసివి త్వదీయారంభదివ్యార్థసా
రాంతస్తత్వములన్ గ్రహింప వశమే యానందకిందానుభూ
త్యంతర్వాణికులాబ్ధిచంద్ర, కొనుమయ్యా, మానమోవాకముల్.

వ్యాధిగ్రస్తకళేబరము హిందూసంఘము.

స్థానమనగా స్థితి. విశ్వంభరాప్రాణస్పందనములే మహర్షులమహాత్తరకృత్యములు. అట్టిదే యీప్రాయోపవేశమనుట. త్రయీజనకము లనువో అన్నమునుండి ప్రాణము బహిర్గత మగు నప్పుడే శ్రుతిపుట్టుచున్నదని యూహ.

అంతేవాసియన చండాలుడు, శిష్యుడును; ఈపాదములో అస్పృశ్యులపరములో సామాన్యార్థము. గురువు (బ్రహ్మపదార్థము) అని విశేషార్థము.—విశ్వనాథ వేంకటేశ్వర్లు.

---

# ఆంధ్రకవితాపరిణామము

పాటిబండ మాధవశర్మగారు

పరిణామవాదము ననుసరించి యేవస్తువు గాని కాలక్రమమున నుచ్ఛస్థితిని బొందుచుండును. ఇది కలియుగ మనియు, ప్రపంచము క్షీణించి క్షీణించి యొక్కసారిగా సమసిపోవుననియుఁ బెద్దలు కొంద అందురు. కాని ప్రపంచము క్షీణించుచున్న దనుట నమ్మఁదగినది గాదనియు, మానవుఁడు క్రమక్రమముగా దేవత్వములోనికిని, ప్రపంచము స్వర్గత్వములోనికిని కాలానుసృతిని ప్రాఁకిపోవుననియు నేఁటివారివాదము. ప్రపంచమునకు నాశము లేదని దీనియర్థము కావచ్చును.

ఒకప్రాణి మరణించినచో నది మరల జన్మాంతరము నందునని యనాదినుండియు నొక నమ్మకము గలదు. అట్లు పునర్జన్మము నందునప్పుడు ఆజీవి గతజన్మముకంటె నుత్కృష్టమగు జన్మమునే పొందునని నేఁటివాదము. ప్రపంచము మంగళోన్ముఖము గాని నాశోన్ముఖము గాదని వీరినమ్మకము. ప్రపంచమున నుద్భవించిన యొకవస్తువు గాని ఒక యభిప్రాయము గాని కాలక్రమమున ఉత్కృష్టతను ప్రాపించునే గాని వినాశము నొందదని దీనిభావము.

ఏవస్తువు గాని యేశక్తి (గుణము) గాని తొలుత జన్మించినప్పుడు నగ్నముగాను నీచముగాను ఉండును. అదియే కాలక్రమమున నుత్కృష్టమై పరమోత్కృష్టమగు ఈశ్వరాంశలో చేరిపోవును.

ప్రపంచములో పదార్థము, దాని నాశ్రయించి శక్తి (గుణము) కలవు. పరిణామవాదులగు వాధునికులు సృష్టిలో తొలుత మానవుఁడు లేఁడనియు, జడములగు శిలాదులనుండి వృక్షములు, వానినుండి చేతనములగు జలజంతువులు, మృగములు, మనుష్యుఁడు, ఇట్లు పరిణామక్రమమున మానవుఁడు నేఁటి స్వరూపమును పొందినాఁడనియు చెప్పుదురు. పదార్థము వృద్ధి గాంచినకొలందిని దాని ననుసరించియున్న శక్తియును (గుణము) వృద్ధి గాంచుచున్నది.

మానవునియందనేకగుణములు గలవు. అవ్వి వికసించి పరిమళించుటకు కాలగతిని నిరీక్షించుచుండును. సమయము వచ్చినప్పుడు వానిలో నొక్కొక్కటి వికసించుచుండును. (Nature as she presides over organic evolution, that is, the unfolding of germinal powers may be conceived as a kindly but slow-going and cautions liberator. One by one new powers hitherto latent are set free as an appropriate field of exercise is afforded to them by environment. R. R. Marett.)

ఇట్లు మన మూహింపఁజాలని భవిష్యత్తులో మానవుఁడు సర్వగుణ (శక్తి) సంపూర్ణుఁడగు భగవంతునితో సమానుఁడై తుదకు భగవంతుఁడై పోవును. ఈ యంశము చరిత్రయందు దృశ్యమానమగుచునే యున్నది.

కవిత్వము మానవునిగుణము (శక్తి) లలో నొకటి. సమయము వేచియుండి యాశక్తి మానవునిలో ప్రస్ఫుటించినది. ఇది కాలవశమున వృద్ధికావలసినదే గాని నాశమగుటకు వీలులేదు. పూర్వకవితయే గొప్పదనియు, నేఁడది పతనోన్ముఖమగుచున్నదనియు విచారించుట కేవలము ఛాందసము, మౌఢ్యమును. ఏలన, ఏపదార్థము గాని ఏశక్తి గాని క్షీణించుటకు వీలులేదు.

తొలుత పురాణకవిత్వము, పిమ్మట ప్రబంధకవిత్వము, నేఁడు భావకవిత్వము, ఇవి యాంధ్రకవితాప్రపంచమున స్థూలవిభాగములు. పురాణకవిత విషయప్రధానమైనది. ప్రబంధకవిత్వము అలంకారప్రధానము (వర్ణనప్రధానము). భావకవిత్వము భావప్రధానమైనది. వీనిలో కవిత యాశయము లెట్లు వృద్ధిపొందినవో చూడనగును.

సృష్టిలో తొలుత మానవునిస్వరూపము ప్రత్యక్షమగుటకు కొంతకాలము పట్టినది. తరువాత నతనిమూర్తి

సౌకుమార్యము, సౌందర్యము నలవరచుకొనుటకు కొంత కాలము పట్టినది. నేడు మానవుఁడు తన మేధాశక్తిని వృద్ధిచేసికొనుటకే యత్నించుచున్నాఁడు. ఈక్రమమున మానవుని యభివృద్ధి యెట్లు పదార్థమునుండి శక్తికి ప్రాఁకినదో వ్యక్తమగుచున్నది. అట్లే కవితయందు సైతము విషయప్రధానత్వమునుండి భావప్రధానత్వము లోని కభివృద్ధి సుస్పష్టము.

మఱియుఁ బురాణకవిత్వమునందు కవిస్వరూపము మనకు గోచరించుట కష్టము. ఏలన, నవి విషయప్రధానములు. ప్రబంధకవితలో కవి దృశ్యాదృశ్యరూపమున గోచరించుచున్నాఁడు. భావకవితలో కవి స్పష్టముగ ప్రతిఫలించుచున్నాఁడు. ఇది కవిలో వృద్ధికాదా?

దీని కీలోకములో దృష్టాంతము చూతము. భగవంతుఁడు నిరాకారుఁడనియు, సకలగుణసనాథుఁడనియు, మంగళమయుఁడనియు, శక్తిస్వరూపమనియు నందఱొప్పుకొనినదే. భగవత్త్వమును బొందుటకు మానవుఁడు ఐహికమును, అనఁగా విషయసాంగత్యమును వదలించుకొనవలయును. మానవుఁడు పదార్థప్రధానుఁడు గాక శక్తిప్రధానుఁ డగుచున్నాఁ డనినచో నది మానవునిలో వృద్ధినే సూచించునుగదా!

తొల్లింటి మానవులు విపులదేహులని వింటిమి. పూర్వము కుంభకర్ణునివంటి మందులు గలరు. కాని నేడు మానవునిలో చురుకుఁదనము ఎక్కుడగుచున్నది. శరీరగౌరవమున మానవుఁడు క్షీణించుచున్నాఁడు కాని శక్తియందు పెరుఁగుచున్నాఁడు. ఇట్లే కొంతకాలమునకు మానవుఁ డదృశ్యమూర్తి కావచ్చును. అప్పు డతని లోని శక్తియే నిలుచును. అదియే భగవంతుఁడు.

ఇట్లే కవిత్వముగూడ. విషయప్రధానమగు తొల్లింటి కవిత నేడు భావప్రధానమైనది. అనఁగా కవిత క్రమక్రమముగా విషయావలంబనమును వదలించుకొనుచున్నది. కొంతకాలమునకు విషయము నాశ్రయింపకయే కవిత్వము బయలుదేఱవచ్చును. అదియే పరమ కవిత్వము (Absolute Poetry). అదియే పరమాత్మస్వరూపము.

పూర్వకవి కథాసంబంధి పాత్రలమఱుఁగున నిల్చి విషయప్రవాహమునఁ బడి కొట్టుకొనిపోయినాఁడు. అతఁడు కథాగమనమునందు ప్రకృతి నొకపాత్రగా స్వీకరించినట్లు లేదు. ప్రబంధకవి కేవలము కథాగమన వశుఁడు గాక మనుష్య మన్య తన్ను వేష్టించియున్న ప్రకృతిని పరిశీలించినాఁడు. ప్రకృతి పలుకు భాష వాని కర్థమైనది గాని తాను దానితో భాషింపఁజాలకపోయినాఁడు. నేటి కవి ప్రకృతితో మాట్లాడను గలఁడు. అతనిరచనలో ముఖ్యపాత్రలు తాను, ప్రకృతియు.

భగవంతుఁడు మానవునియందు ఎంత స్పష్టముగ ప్రతిఫలించిన మానవుఁ డంత యుత్కృష్టుఁడు. ఇదియే గదా అవతారముల భావము. ఇట్లే కవితయం దెంత స్పష్టముగ కవి ప్రతిఫలించిన కవిత యంత యుత్కృష్టము.

తొల్లిటికవి శంపాలతను గాంచి కేవలము ఆనందమునే యనుభవించినాఁడు. తరువాతికవి తన ప్రియురాలియందు శంపాలతను గాంచినాఁడు. నేటికవి శంపాలతయందే తన ప్రియురాలిని గాంచుచున్నాఁడు. అనఁగా, తొల్లిటికవి శంపాలతను గాంచి గుర్తుపట్టఁజాలకపోయినాఁడు. నడిమికవి యామెకుఁ దనకు నేదియో సంబంధ మున్న దనుకొనినాఁడు. నేటికవి యాసంబంధమును నిర్ణయించినాఁడు. ఆమె యాతని ప్రియురాలు. (అనఁగా కవి యేతాదృశవస్తువులయెడ నిష్టుఁడని గ్రహింపనది.) ఇది కవిలో వృద్ధి కాదని యెవ్వ రనఁగలరు? తొలికవికంటె నేటికవి తన్ను తాను బాగుగ తెలుసుకొనుచున్నాఁడు.

పూర్వకవి యనేకబంధములకుఁ గట్టువడినాఁడు. నేఁడు కవి స్వతంత్రతాప్రియుఁడు. ఈస్వాతంత్ర్యేచ్ఛ చరిత్రయందు మానవునియెడ స్పష్టము. కాని కవి దేశకాలపాత్రబంధమ్ముల త్రెంచుకొనఁగలిగినప్పుడు అతఁడు "పరమకవి" (Absolule Poet) కాఁగలఁడు. ఇదియే అతనికి పరిణతి.

పూర్వము కవి ప్రజాసమూహమునకై కవిత చెప్పినాఁడు. తరువాత రసజ్ఞుఁడగు నొకరసికునికొఱకై చెప్పి

నాఁడు. నేఁడు కవి తనకొఱకై తాను కవి యగుచున్నాఁడు. భిన్న భిన్న రుచులఁ దన్ను యత్నించిన కవి, నిర్దిష్టమగు నొక యభిరుచి నాశ్రయించినకవి, నేఁడు తనయానందమునకై తాను పాడుకొనుచున్నాఁడు. ఇది కవియొక్క వృద్ధియే కావలయును.

తొలుత కవి ప్రజలచే పూజింపఁ బడినాఁడు. నడిమికవి పోషింపఁబడినాఁడు. నేఁటికవి కేవల మానందింపఁబడుచున్నాఁడు. అనఁగా తొల్లిటికవి యొక అపూర్వపురుషుఁడు. మధ్యయుగమున కవిత కొందఱికే సొమ్మయినది. నేఁడు కవిత ప్రతిమానవునిసొమ్మగును. ప్రపంచమున కవులును కవిత్వమును పెరుఁగుచున్నది. దీనితోపాటు ప్రజలలో నభివృద్ధి యెట్లున్నదియుఁ దెలియఁగలదు. పూర్వము కథకొఱకె గ్రంథమును చదివిన పఠిత, నడిమికాలములో నలంకారములకోసము దేవులాడిన పఠిత, నేఁడు రసమునకై తహతహలాడుచున్నాఁడు. ఇది యభివృద్ధి కాకున్న మఱేమి?

పూర్వము కవిత మనస్సునుండి పుట్టినది. తరువాత మేధస్సునుండి పుట్టినది. నేఁడు కవితకు స్థానము హృదయము. అందుచేతనే నేఁటికి కవి తనహృదయము నాహరించు వస్తువు కనఁబడినప్పుడు కలిగినయావేశములో నాల్గుగీతములుపాడివైచును. అతనిహృదయభారము తగ్గును.

ఈక్రమమున ప్రజలయభిరుచియు మాఱినది. పూర్వమువలె సుదీర్ఘములగు రచనలను కంఠస్థముచేయుటకుఁ గాని, ఊరక పఠించుటకుఁ గాని నేఁటిప్రజలు సహింపరు. లౌకికయాతనావ్యగ్రమగు తనచిత్తమునకు విశ్రాంతిని, హృదయమునకు శాంతిని, ఆనందమును ప్రసాదింపఁగల రసమహితమగు నొక లఘురచనమును నేఁటిపఠిత వాంఛించును. కవులు వ్రాయునవియు నట్టిరచనలే. కనుక కవులరచనలఁబట్టి ప్రజలయభిరుచియో, ప్రజలయభిరుచిఁబట్టి కవులరచనలో, పరస్పరావలంబనమున నిట్లు ఏకముఖముగ వర్ధిల్లుచున్న మాట సత్యము.

కవిత యీశ్వరాంశ. అందుచేతనే అది యత్నసాధ్యముకాదు (A poet is born and not made). ఈయంశ (శక్తి) క్రమముగా లోకమునందు అభివ్యక్తమగుచున్న దన్నచో నది లోకమునకు కల్యాణమే.

యథార్థముగ పరమోత్కృష్టుఁడగు కవి భగవంతుఁడే. భగవంతునిలోని శక్తు లన్నియు మానవునియందుఁ గలవు. అవి వికసించుటకు మాత్రము కాలము పట్టును. ఈ వికసనముమీఁద కాలమునకు ప్రభావము మెండు. ఈశక్తు లన్నియు సంపూర్ణముగ వికసించినమానవుఁడు భగవంతుఁడే అనుటకు సందేహము లేదు.

---

# తారక

ఓలేటి సీతారామమూర్తిగారు.

మబ్బునును జిల్గువలిపమ్ముమాటునందుఁ-బొంచి దోఁబూచులాడుచు ముగ్ధనయన
రాగదృష్టులు సారించి రక్తినింతు; చుక్కపూఁబోణి! నీ దెంత సోయగమ్మొ!

ప్రేమమాధుర్యయౌవనశ్రీలు గురియు-బంగరుపిసాళి రిక్కజవ్వని! త్వదీయ
నవ్యవీక్షణ మోహవిన్యాసపులకి-తత్రపావృష్టి యొసఁగు సౌంధర్యసుధను.

నిదురఁ గను మోడ్చి విశ్రాంతిఁ బొదలుచున్న-య్యుప్రశాంతతపోవేళ నెవరికొఱకు
వాలుఁగన్నుల మోదాశ్రుజాల మొలుక-విసువ కన్వేషణమ్ము గావింతు విట్లు?

తొలిప్రొద్దు కెంజాయఁ దలనెత్తు పచ్చిక కొక హైమముక్తంపు గోముతోడ
తొలుకాడు సెలయేటి తళుకుటందపు లేఁత కెరటమ్ము నకియు క్రొమ్మురుపుతోడ

నవకంపు పరువంపు నైగనిగ్యము లీను తెలియాణిముత్తెమ్ముతీరుతోడ
వెలఁది వెన్నెలనవ్వు చలువచూపుల చాలు జిగినించు మల్లెపూ చెలువుతోడ
హృదయ మూరించుకలికి నవ్వెనసి పొదల-ప్రేమభావాళి దృక్కులో వెల్లివిరియ
ఈ యమృతవిహాయసమున నేకతంబ-సంచరింతు వోకింత వేసటయె లేక.

బయలుకాటుకనీడల బాట నిల్చి-క్రమ్ముకొను నివతాళింపు కనులదృష్టి
విశ్వహృదయమ్ము నుడుపతీ! విసివికొనక - యింతపరిశీలనం బొనరింతు వేల?

చదల మోడము నీలాలచాలునందు-మధురహాస దివ్యసుమ మాల లల్లి
చలిమిరిని గొల్పుచూపుల సౌరు నించి-విశ్వరాగమ్మదెల్ల త్రావెదవు తార!

పూవుపొత్తిళ్లఁ బ్రేమప్రపూతసుప్తి-లీలలో మురిసెడు చంచరీక మట్లు
నీసుధామలరాగ సందీప్తిశయ్య-మించుకాటుక నిశి పులకించిపోవు.

ఆయువనీలరాగ గగనాంతరనీరదఖండ వేదిపై
ఓయమృతార్ద్రహాసిని! సుఖోన్నతిఁ దారి పికాంగనాగళా
ప్యాయన గానమాధురులఁ బ్రాముదు నందనసౌఖ్య మీనునే
తీయని ప్రేమగీతికొ నదింతువ మోహన హృద్విపంచితో?

* * * * * *

తీరు తీయంపుసోనలు గారు నీదు - నీలికనురెప్పమాటున జాలుకొనిన
ప్రణయకరుణామృతమ్ము నాపై వెలార్చి - నీ స్మితామలధామాన నిల్పికొనుము.

ఇది నవతామసీతరుణి నృత్యమునల్పు సుధారహోనిశీ
హృదయవిలాసవీథి; తెలి రిక్కపడంతి! విహారమోదనం
పదలఁ బిసాళినవ్వులఁ బ్రభాత మెఱుంగని దివ్యసుప్తికై
యెదనెదఁ జేర్చికొంచును శయింతిమ కారుమొయిళ్ల సెజ్జపై?

శ్యామ వియత్తరంగిణి ప్రశాంతపు సైకతకుంజసీమ జ్యో
త్స్నామృత తావకీన దర హాసకరంబిత విస్ఫురద్రహః
ప్రేమములోననే విరిసి విశ్వము నిల్చినదాఁక తారకా
కామిని! నీయెడంద కడ కన్నులచూపులలో నటించెదన్.

రెప్పవాల్చక యిటు మధురించిపోవు-విజననీలాభ్ర శర్వరీవీథియందు
నిల్చి నాపయి వలపుపన్నీటి తావిఁ-జిమ్ముము, హసింతు నొక్కకల్పమ్ము నేను.

---

# ప్రణయసామ్రాజ్యము
## (సంగ్రహవిమర్శనము)

శ్రీ విద్వాన్ నిమ్మగడ పున్నయ్యశాస్త్రిగారు

ఇది యొకనవల. "హాసనమయి, రాధ" యని దీని కింకొకనామము గలదు. శ్రీ కర్లపాలెం కృష్ణరావుగారు దీనిని విరచించిరి. వీరు సారస్వతసమితికార్యదర్శులనియు, నింకను గొన్నికృతులకుఁ గర్తలనియు నీ గ్రంథ ముఖపత్రమునం దున్నది. దీనిని పాఠశాలా పఠనీయగ్రంథములలో నొకటిగ టెక్స్టుబుక్కు కమిటీవా రంగీకరించినట్లు విని యీసంవత్సరము మాపాఠశాల యందు దీనిని విద్యార్థులచేఁ జదివింపఁ దలంచి యొక మిత్రునియొద్దఁగల 'ప్రణయ సామ్రాజ్యము'ను దెప్పించి పఠించితిని. దానిఁ జదివినంతనే యయ్యది పాఠశాలలయందుఁ బఠనీయగ్రంథముగ నుపయోగింప నెవ్విధమునఁ బరిశీలించినను పనికిరానిదని స్పష్టమైనది. అందుకుఁ దగిన కారణముల సంగ్రహముగ నీక్రిందఁ బొందుపఱుచుచున్నాను, చిత్తగింపుఁడు.

తొలుదొలుతఁ బ్రణయసామ్రాజ్యమను గ్రంథనామమే గ్రంథస్థవిషయమును వెలిబుచ్చుచున్నది. స్త్రీపురుషప్రణయభావ పరంపరలచే నామూలాగ్రము మెలివైఁబడిన యేతద్గ్రంథము మూఁడవఫారపు విద్యార్థులకుఁ బఠనీయమఁట. ఈగ్రంథముపై కవిగారి మిత్రులొకరు దమ యభిప్రాయముగూడ నిచ్చియున్నారు.

ఇయ్యది విషయ లంపటులైయావనోద్రేకమున, తలిదండ్రుల, గురువుల, యాజ్ఞల నుల్లంఘించి స్వైరవిహారతత్పరత నభిలషించు పడుచువాండ్రకు నుబుసుపోకకుఁ జదివికొనఁ గొంతవఱకు నుపయోగింపవచ్చును. అంతియ కాని విద్యార్థులకు, భాషాజిజ్ఞాసువులకు, కవితారసపిపాసులకు, నాంధ్రభాషకు నెవ్విధిని జూచినను సహకారి కానేరదు. సరికదా, దీనిపఠనమున, విద్యార్థిబృందము విషయార్థిబృందముగా మాఱునను టలో నించుకయు నతిశయోక్తి యుండదని మనవి. ఇఁకఁ బ్రకృతమునకు వత్తము.

### ఇతివృత్తము

కృష్ణమూర్తి యనునతఁడు యఫ్. ఏ. విద్యార్థి. ఇతఁడు పదునాఱుసంవత్సరముల ప్రాయమువాఁడు. మేనమామయింటఁ దిండితిని కాలేజీలోఁ జదువుచుండువాఁడు.

ఆమేనమామ కూఁతురొక బాలవితంతువు "రాధ" యనునది గలదు. రాధపై నితనికి వలపు కలిగినది. వీరిపరస్పరప్రణయము నానాఁట మించుచుండెను. ఇంతలోఁ గృష్ణమూర్తికి వేశ్యాలోలుఁడగు గోవిందరావు కూఁతురును శారద యనుదానిని బరిణయముచేసిరి. కృష్ణమూర్తి మామగారుంచుకొన్న వేశ్యనే మూర్తిగారి మిత్రుఁడు రామమూర్తియుఁ బ్రేమించి మించెను. తుదకీవేశ్య సన్యసించి వేదాంతములోనికి దిగి రాధా, శారదలకు మైత్రిఁ గుదిర్చెను. కృష్ణమూర్తి రాధా, శారదలపై బాహువల్లరుల వైచి తా నిరువురినడుమ నిలిచి, "వీరిద్దఱు నన్నానంద వార్ధి నోలలాడింపక తప్పదు" అని పల్కెను. భోగము సన్యాసిని చేతులు చాఁచి యాశీర్వదించెను. ఇది ముఖ్యము గాథ. దీనిని విస్తరించుటకై ప్రణాళిక (Plot) స్వేచ్ఛగ నల్లఁబడి గ్రంథబాహుళ్యమున కుపకరించినది.

### పాత్రలు

కథానాయకుఁడు కృష్ణమూర్తి. తేజస్వినియగు రాధను వలచెను. ఆమెను పెండ్లాడ వైధవ్యము ప్రతిబంధకమయ్యెను. అందులకై యబలాసంఘము నుద్ధరించువానివలె ప్రగల్భములాడుచు, అనదలగు వితంతువుల గతిని దలఁచి జాలిపడినవానివలె నటించుచు, రాధపైఁ దనకుఁగల ప్రేమయే పరమావధిగాఁ దలంచియు, సంఘనియమముల లెక్కింపనని పల్కియుఁ దుదకునని వేఱొకకన్యను పెండ్లాడి, భోగము రోగిని దయచే రాధనుగూడఁ జేపట్టి, తిన్నయింటివాసాలు లెక్కపెట్టినవానిబోలెల మూనున్న మేనమామను ముంగిలికిఁ

దెచ్చినవాఁడు. రాధను చేపట్టుట దక్క నితనినోట గ్రంథకర్త పలికించినవానిలో పరార్థమను నొకయుపకృతియు జరుగలేదు. వీరో నెపమున ప్రణయినుల వశపఱచుకొనుపద్ధతుల నేర్చినవారిలో నీకృష్ణమూర్తి పాత్రధారియుఁ జెప్పఁదగియున్నాఁడు.

కథానాయిక రాధ. కృష్ణమూర్తియొక్క తారుణ్య, లావణ్య, విలాసములకుఁ జొక్కి ప్రేమించి సిగ్గు విడిచి తండ్రితోఁ దనప్రణయమును సూచించి చెప్పి, తల్లి నుల్లంఘించిన ముగ్ధ. నాయికానాయకు లుచ్చరించిన నీతివాక్యములకుఁ దగినంత విద్యావంతులనుగాఁ గాని, సంస్కారసంపన్నులనుగాఁ గాని కవి చిత్రించలేదు. కథానాయకుని మిత్రుఁడు రామమూర్తి నాయకుఁడు ప్రేమించిన రాధను ప్రేమింపఁదలఁచి యతనికి విషప్రయోగముఁ జేయించినవాఁడు. పైఁగా నాయకునిమామగా రుండు కొన్ని వేశ్యలతో సంబంధముగలవాఁడు. కథానాయిక తలిదండ్రులు పూర్వాచారపరాయణులని గ్రంథకర్త వ్రాసెను. కాని వారియింటివిడవళ్లును, విద్యార్థులగు కొడుకుల పోఁకుండ్రవ్యవస్థను వారు విచారించుటయు నవనాగరకపద్ధతికిని మించినవికృతినిఁ గల్పింపఁబడినవి. నాయకుని గ్రామము గాని, యాతనితండ్రుల వృత్తాంతములు గాని గ్రంథమున గానరావు.. కావున నీగ్రంథమున పాత్రపోషణము(Characterization)ను గుఱించి కర్త శ్రద్ధ వహింపలేదని తోఁచుచున్నది. బోసమయి యను ముద్దుపేరు రాధకు నాయకునిచేఁ బెట్టించి యామెను వెకిలివృద్ధానినిఁ గావించుట సమంజసముగా లేదు. పాత్రలవర్తనలమూలమున దీనినుండి నేర్వఁదగిన నీతి యత్యల్పముగూడ లేదు. ఇందలి పాత్రల రీతుల ననుకరించినవారికిఁ దలిదండ్రులు, గురువులు, దైవము, అదియిది యననేల? నీతియు, జాతియుఁగూడ లెక్కలోనివిగ, లక్ష్యపెట్టఁదగినవిగ నుండఁజాలవు.

## నీతిబాహ్యములగు వర్ణనలు, పాటలు

"ఇప్పుడు దుర్గ (గోవిందరావుగారి వేశ్య) శాంతించి శయ్యపై గూర్చొని గోవిందరావును గూడ దన వామభాగమున గూర్చుండబెట్టుకొని తన యెడమతొడ నాతని కుడికాలుమీదనుంచి తన ముంగురులను సవరించుట కాతని కవకాశమును గలుగజేసెను. గోవిందరా వొకచేత దాని ముంగురులను దిద్దుచు రెండవచేతిని దాని మెడమీదుగ దెచ్చి కుడిబొమ్మను జేర్చి సరసముగ మాట్లాడుచు—" పుట ౪౩.

"అనుచు గోవిందరావు దాని (భోగముదాని) చేయి బట్టుకొనిశయ్యమీదికి నెక్కెను." పుట ౪౮.

"నిన్నె కోరియున్నది నాతో - విన్నపము సేయుమన్నది." (ఇది జావళిపాటయట) పుట ౭౦.

ఇంకొక జావళీపాట

"ఎందుకీతొందరా-సుందరాకార - నీ - పొందు గూడెద తాళరా—

పందిరి-బల్ -పట్టెమంచము-సందునరతిసుఖ మంద
జేసెద - ఎందు కీతొందరా."

అది విని రామమూర్తి "హై, హై, హై, హై" పుట ౮౦.

గ్రంథమునందలి యసభ్యవిషయములలో ముఖ్యములుమాత్ర మీపై నుదాహరింపఁబడినవి.

## అసందర్భములు (కొన్ని)

౧. "భాను డప్పుడప్పుడే పశ్చిమాంగన నెన్నెను." పుట ౧. ఇటఁ బశ్చిమదిక్కాంత యని యుండుట యుక్తము. చరమగిరిఁ జేరవచ్చురవిఁ గాంచి పశ్చిమదిక్కాంత వెనుదిరిగి పరువెత్తుచుండెనా యేమి?

౨. "జాజిపూవులు చల్లనికాంతు లీనుచుండెను".

౩. "సాయంసమయ మగుటచే స్త్రీలు పనిపాటలు ముగించుకొని, పాలుగిండ్లకు బోయి జడలు వేయించుకొని, నిజగృహంబులకు మరలుచుండిరి."

౪. "ఆతని మాపు లప్రయత్నముగ క్రిందియావరణమందు నిలుచబడియున్న నొకయువతిపై బడెను." ఈయువతి యనుదిన మీతనియెదుట దిరుగుచుండు మేనమామ కొమరితె రాధయే. క్రొత్తపిల్ల కాదు.

౫. రాధను ప్రేమించి యిష్టములేనిపెండ్లి చేసికొన్న కృష్ణమూర్తి మామగారింట రామనగరున మాసము రోజులుండి యచటి కైదుమైళ్ల దూరముననున్న తలిదండ్రుల జాడనైన పోనక, మదరాసు ప్రయాణమగునపుడు ఒకరోజు చుట్టపు చూపు చూడఁబోవుట—ఇది యిష్టము లేని నడవడియేనా?

౬. రామనగరునకుఁ బశ్చిమభాగమున నొకవింత యుద్యానవనమున విహరించు దుర్గవద్దకు గోవిందరావు వచ్చెను. అంతటి యుద్యానవనములోఁ గూర్చుండ దావు లేక నిరువురును గచ్చపొదచాటునకుఁ జేరుట.

## చ్యుతసంస్కారములు, పునరుక్తులు

౧. ఊహాపోహలు, ౨. పుగాకు, ౩. "అనసూయా దమయంతులు నీకావర్ణితులుగారా", ౪. నిక్కుచు నీటుచు, ౫. కూర్చొని, ౬. యోగినామాట, ౭. పట్టుకుచ్చులబోలు నామె కోమలకేశపాశములు, ౮. భర్తలను బూజించి, సేవించి, యారాధించి, యర్చించి, ౯. భగవత్ప్రసాదితము, ౧౦. పక్కపాపెడ, ౧౧. తెల్ల జపాను సిల్కు—ఇత్యాదులు.

## మఱికొన్ని విశేషములు

కథానాయకుఁడు పెట్టికొన్న సులోచనములు గాజుపెంకులని గ్రంథకర్త నిరసించెను. (పుట ౨.) తమకు ఇరువదివత్సరముల ప్రాయము గలిగినట్లు కథానాయకునిచేఁ జెప్పించుకున్న కృష్ణారావుగారు గ్రంథమునమున్న తమ ఛాయాపటమునఁ గండ్లకా గాజుపెంకులను దవిలింప మానలేరైరి. "ఇంటిముంజూరునుండి జారు వర్షబిందువులమాడ్కి నామె నయనేంద్రియములనుండి యశ్రుజలములు బడెను." ఇది కథానాయికను గుఱించిన వాక్యము. ఇది యపూర్వోపమాలంకారము. స్వర్ణయుగమువారి క్రొత్తరచనలలోనిది కాఁబోలు.

## సమాప్తి

స్త్రీలయలంకారవర్ణనలు, సతీలోలుర ప్రణయసంభాషణలు, స్త్రీలయందములకుఁ జొక్కు పురుషులు, పురుషుల విలాసములకుఁ జొక్కు నస్త్రీలు చేయుతంత్రములు—ఇవి యిందలి ముఖ్యవిశేషములు. అప్రస్తుతప్రశంసగఁ గథామధ్యమున నవలాకారుఁ డేదో వీరావేశ మెత్తినటుల హిందూసంఘమును, తదాచారములను నిందించుచు నుపన్యసించును. తుదకు భోగము యోగినిచేఁ జేయించిన పనిలో నేకంతమునుగూడ బ్రగల్భములాడిన కథానాయకునిచేఁ జేయించి మోసఁజెయ్యెను. ఈగ్రంథము ౩౭-వ పుటలోఁ గవిగారు కథాపాత్రల ముఖమున వెల్లడించుకున్న స్వోత్కర్షాపూరితవిషయములలో నొక్కటియు దీనికిఁ బట్టలేదు. ఇందలిభాష గ్రామ్యము మించి, గ్రాంథికము గాక నుభయభ్రష్టత వహించినది. రసపోషణ మెట్టిదో దీనియందు మందుకుఁ గానము. కథానాయికానాయకు లెంత స్వైరవిహారధీరులై వీరాలాపములాడి సంఘసంస్కారము గావింతుమని తుదకు భ్రష్టతఁ జెందిరో, అట్టులే యిందలిశైలియుఁ దోవతెన్ను లేక, యే నియమమునుగూడ పాటింపక యథేచ్ఛగా సాగినది. వాడుకభాషలో నుత్తమగ్రంథము లెన్నియో నేఁడు వెలువడుచున్నవి. కాని యిది యట్టివానిలోనికిఁ గూడ చేరఁజాలదు. దమయంతీ, సీతా, అనసూయా, సావిత్రుల నుపమింపఁబడిన కథానాయికయం దొకానొక ప్రశస్తమహిమయును బ్రకటింపఁబడలేదు. పైఁగా రామమూర్తి తనను ప్రేమిస్తున్నాఁడని వితంతువను రాధనోటఁ జెప్పించి యాపాత్రకు మిగులఁ గళంకము గలిగించి కవి చెడఁగొట్టినాఁడు. ఇట్టివే యసందర్భములు, అనన్వయములు, అశ్లీలములు, అసభ్యములు, అవాచ్యములు గ్రంథ మెల్లెడలఁ గలవు. ఇట్టిదానిని జక్కగా—కాదు, కాదు—సామాన్యముగాఁగూడఁ జత్తగింపకుండ కమిటీవారు బాలురకుఁ బఠనీయముగా నంగీకరించుట విద్యార్థుల—కాదు—వారి తండ్రుల, ఉపాధ్యాయుల దురదృష్టము. చూడుఁడు: "యీయపారపారావారధారుణీతలంబున నెందఱు": దీని కర్థ మేమి? "అవకాశము చిక్కినప్పుడెల్ల కన్నుగీటి విటుల నాకర్షించు చాకచక్యము"; "దాని సంపాదన—నెదురీవి నపేక్షించు ముద్దుమొగలకును": ఈమాటలభావార్థములను భావసహితముగ మూఁడవఫారములోని పసవలను నిసువులకు నుపాధ్యాయుఁడు బోధింపవలసెఁగా? ఆంధ్ర

భాషాయోషాలలామ నేఁటి కిట్టి కాకిబంగారు సొమ్ముల వంటి పుస్తకములచే నలంకరింపఁబడవలసివచ్చెఁగా? ఇంతేట నైనను శ్రీగ్రంథకర్తగారు సాంఘికవిషయమున నెట్లున్నను, భాషావిషయమునఁ దమదండయాత్ర సాగింపక, తగిన పరిశ్రమ యొనర్చి భాషాసేవ యొనర్పఁ గోరదము. ఈకాలములలోఁ గమిటీవా రెట్టిగ్రంథము నేనియు విప్పిచూడకయే ఒప్పుకొనుచున్నారు. అట్టివానినే నాల్గవ తరగతిబాలురుగూడ చేతినేసి వెక్కిరించి, యింతకంటె మేము బాగుగా వ్రాయఁగల మనుచున్నారు. కావున గ్రంథకర్తలు, బాలురపురోభివృద్ధిఁగోరువారు, తమ బిడ్డలం దమయాజ్ఞల మెలంగఁగోరువారు—విట్టియప్రశస్తగ్రంథముల రచించి భాషాప్రపంచమునకు భారము గల్పింపకుందురుగాత.

ఇంకొక వాక్యముతో దీని విరమించెదము. అసలు గ్రంథవిషయమే స్త్రీపురుషుల శృంగార కథ. తరువాత కృష్ణారావుగా రొకక్రొత్తపుస్తకమును వ్రాఁబోవు దానినిగూర్చి పల్కి యొకపద్యమును ఈసామ్రాజ్యము లోనే ప్రకటించిరి. అది గుడికి శిఖరమువలె గ్రంథోద్దేశమును జాటుచున్నది. దాని నీక్రింద నుదాహరించెదము!

"పరము గిరమ్మటంచు నిట
పల్కెద వేలను కానివాటి, నో
పరమదయాళ! చూచితివె?
ప్రాణము బోయిన రేది యెట్టులో
పరగున జేగి మానినుల
సందిట జేరుము, మోక్ష మయ్యదే
తరచుగ నేల పెక్కు లిక
దన్నుము జీవిని సౌఖ్యరాసిలో."

చూచితిరా వీరియాదర్శము. ఇట్టివేనా బాలురకు బోధించు గ్రంథములలో నుండఁదగిన ప్రకటనలు.—

---

# అగ్నిపరీక్ష

రంగనాయకులుగారు

ముగియునే మోజీవిత మిట్లె? బిగియుచున్న
కంటకావృతగ్రీష్మకకంఠపాశ
మంతకంతకు విలయరుద్రాగ్నిహోత్ర
భీషణోజ్జ్వలనేత్రమ్ము విప్పుచుండె!
గరళబాధల నెటొ మ్రింగి గళము నెత్తి
నిన్నుఁ బాడుదమన్న, నాసన్నమృత్యు
కాకసంఘము భయదవక్త్రములఁ బొడిచి
యినుపపాదాలతోఁ బ్రహరించుచుండె!

ఇంతయొత్తిడిగొంతులో నెట్టు లింకఁ
బిలుచు, "నోయికృష్ణా! మధుప్రేమసింధు!
ఋషిజనస్వాంతసరోజభృంగరాజ!"
యనుచు నీకోకిలము మనసార నిన్ను?
మూఁతపడియున్న వెన్నెన్నొ మూఁగపాట;
లేఁగిది లోకమునఁ జవిచూపఁబడునొ?
ఇది విషాదాంతదుస్స్వప్న మేమొ? యిది ప
రోక్షకైవల్యతాగ్నిపరీక్ష యేమొ?

---

# దశరథుఁడు సత్యవాది యగునా?

-శ్రీ తి. వ. నారాయణస్వామిగారు

రామాయణ కథా నిబద్ధులగు వ్యక్తులయొక్క స్వభావములను గుర్తించు తలంపుతో వాల్మీకి రామాయణమును జదువుచున్న నాకు దశరథుఁడు సత్యవాది యగునా? యను సంశయము కలిగినది. నాకుఁ దోఁచినంతవఱకు నాకుఁగల సంశయములను బాఠకలోకమునకు నివేదించుకొనుచున్నాను. ఇందేవేని యనుచితములగు యుక్తు లున్నచో సహృదయులగు పాఠక మహాశయులు సవరింతురు గాక. నావాదమే నిశ్చయ మను నుద్దేశము నాకు లేదు. ఇందలి సత్యము నన్వేషించు తలఁపే యీవ్రాఁతకుఁ గారణము.

ముందుగా రామాయణమునందలి యవసరమగు కథను సంగ్రహముగా వివరించి, పిదప నాకుఁ దోఁచిన సందేహములను జర్చించెదను.

౧రామాయణకథకు మూలపురుషుఁడగు దశరథుని పౌరజానపదప్రియుఁడనియు, దీర్ఘదర్శియనియు, ధర్మాసక్తుఁడనియు, జితేంద్రియుఁడనియు, సత్యసంధుఁడనియు వాల్మీకి వర్ణించెను.

ఇట్టి సుగుణ ఖనియగు దశరథుఁడు తన మూఁడవ భార్యయగు కైకేయిని బెండ్లియాడునపుడు కైకేయి తండ్రియగు కేకయాధీశ్వరుఁడు "నాకుమార్తె యందు నీకుఁ గలిగిన సుతునకు రాజ్యము నిత్తునని ప్రతిన యొనర్తువేని నీకుఁ గన్య నిత్తు"ననఁగా నట్లేయని యంగీకరించి యామెను బెండ్లియాడెను.౨

కాఁగా:—

రామాదుల వివాహము లైనవెనుక దశరథుఁడు భరతుఁడు మేనమామ యింట నుండఁగా దుర్నిమిత్తముల నుపలక్షించి మంత్రులతో నాలోచించి రామునకుఁ బట్టముఁగట్ట నెంచి నానానగరవాసులగు జనులను, పౌరులను, దేశాధీశ్వరులను (౩జనకుఁడు, కేకయాధీశ్వరుఁడును దప్ప తక్కినవారిని) బిలువఁ బంచి, "౪నేను చాలకాలము పూర్వులగు రాజులమార్గము ననుసరించి రాజ్యపాలనముఁ జేసితిని. వృద్ధుఁడనైతిని. కావున నీసభాస్తారులగు ద్విజోత్తములచే ననుజ్ఞాతుఁడనై గుణవంతులకుఁ గన్నాకగు రాముని రాజ్యపాలనకు నియమించెదను" అనుచు రాముని గుణములను వర్ణించెను.

౫పదపడి పౌరుల యుద్దేశము దెలుఁగఁగోరి "యీ రామాభిషేకకార్యము నాచేత లెస్సగా నాలోచింపఁబడినట్లు మీకుఁ దోఁచినచో సభాసదు లంగీకరింతురు గాక.

---

౧. తస్యాం పుర్యాం......జగదపాలయత్. (వాల్మీ. బాల. ౬ సర్గ, ౧—౪ శ్లో.)

౨. శ్లో. పురా భ్రాతః పితా నస్సమాతరం తే సముద్వహన్,
మాతా మహే సమాశ్రౌషీ ద్రాజ్య శుల్క మనుత్తమమ్.

వ్యా: పురేత్యాదినా రాజ్యశుల్కం సమాశ్రౌషీత్. తవపుత్రికాయాం యో జనిష్యతే తస్మై రాజ్యందాస్యామీతి ప్రతిజ్ఞాం కృతవాన్. (వాల్మీకిరా. అయోధ్య. ౧౦౭ సర్గ, ౩ శ్లో.)

కేకయరాజాయ రాజ్యశుల్కం దత్వా కైకేయీవివాహం కృతవాన్ తం వృత్తాన్తం హృదికృత్వాహ.
(వాల్మీకి రా. అయోధ్య. ౪ సర్గ, ౨౫ శ్లోకవ్యాఖ్య.)

౩. శ్లో. నతు కేకయరాజానం జనకం వా నరాధిపః,
త్వరయాచా న యామాస పశ్చాత్తౌ శ్రోష్యతి ప్రియం. (వాల్మీకిరా. అయోధ్య. ౧ సర్గ, ౪౭ శ్లో.)

౪. వాల్మీకిరా. అయోధ్య. ౨ సర్గ, ౪ మొదలు ౧౨ శ్లో.

౫. యదీదం మేఽనురూపార్థం మయా సాధు సుమన్త్రితమ్,
భవన్తో మేఽనుమన్యన్తాం కథం వా కరవాణ్యహం. (౨ స. ౧౫ శ్లో.)

"౧ఈకార్యము నాకు మిక్కిలి యిష్టమైనదే యయినను, నితోధికఫలదమగు యోచన వేఱొకటి యున్నచో మధ్యస్థులగు తాము విచారింతురుగాక. మధ్యస్థుల యాలోచనము వాదప్రతివాదములచేఁ జర్చింపఁబడి మే లొనఁగూర్చును." ఈవాక్యములను విని యోగ్యుఁడగు రాజు లభింపఁగలఁడని సభాసదు లంగీకరించిరి.

౨సభాసదులచే నీపట్టాభిషేకవిషయ మంగీకృతమైనపిదప దశరథుఁడు రాముని బిలువఁబంచి, "రామా! నీగుణగణముచేత నీప్రజలు వశీకృతులైరి. వీరు నిన్నుఁ బాలకునిగాఁ గోరుచున్నవారు. కావున నీవు యావ రాజ్యభారమును వహింపవగును." అని తెలిపెను. అది విని రాముఁడును మొదలగు సభాసదులు సంతసించి యిండ్లకేగిరి.

౩సభ చాలించి యెవరియిండ్లకు వారేగిన వెనుక "రేపటిదినముననే రామునకుఁ బట్టముఁ గట్టవలయు" నని మంత్రులతో నాలోచించి దశరథుఁ డంతఃపురమునకుఁ బోయెను. తిరుగ రాముని దనకడకుఁ దీసికొనిరమ్మని సూతునితోఁ జెప్పెను.

౪సూతుఁడు రామున కాసంగతిని దెలుపఁగా "నిప్పుడే మరలఁ జేల రమ్మనెనో?" యని సంశయించుచు రాముఁడు దశరథుని జూడ నేఁగెను. తరువాత రాముని దశరథుఁడు చూచి, "రామా! రాజ్యమును బాలించుచు నన్నిటఁ దృప్తి నందిన నాకు నిన్ను రాజ్యాభిషిక్తునిఁ జేసి చూచి యానందించుటకన్న మిగిలినకార్య మింకొకఁడు లేదు. మఱియుఁ, బ్రకృతిజనములు నిన్ను రాజుగా నభిలషించుచున్నవారు. అందువలన నిన్నీ రాజ్యమున కధిపతిగాఁ జేయువాఁడను. ఇది కాక, దారుణములగు నుత్పాతములు తోఁచుచున్నవి. ఈయుత్పాతములు దేశాధిపతి కనిష్టదాయకములు. అందువలన నా కీయుద్దేశము పూర కుండునంతలో రాజ్యాధిపతి వగుట మంచిది. ప్రాణులబుద్ధి తఱచుగాఁ జంచలముకదా! అదియునుఁ గాక, యిట్టి కార్యములకు విఘ్నములు తఱచుగా కలుగుచుండును. కావున నట్టి విఘ్నములరాకుండ నప్రమత్తులై నీస్నేహితులు రక్షించుచుందురుగాక.

౫విదేశగతుఁడగు భరతుఁ డిచటికి రాకముందే నీ పట్టాభిషేకమునకుఁ దగినకాలము. ౬భరతుఁడు సాధువంతుఁడే అయినను, మనుష్యులమతి చంచలము. సత్పురుషులచిత్తమైనను జరిగిపోయిన కార్యముల కంగీకరించును. కావునఁ బట్టాభిషేకమున కంగీకరింపఁదగును." ఈరీతిగా రామునితోఁ జెప్పి యభిషేకపూర్వదివసకరణీయముల నుపదేశించి యాతని నింటికిఁ బంపెను.

౭.తరువాత రాజు కైకేయికి "నేఁటిదనుక రామాభిషేచన వృత్తాంతము తెలియదు కావున నీ ప్రియవార్తను దెలిపెద" నని యామెయింటికిఁ బోయెను.

*　　*　　*　　*　　*

దశరథుఁడు ముందుగాఁ గౌసల్యా సుమిత్రలను బెండ్లియాడెను. వారియందు సంతానము లేకపోవుటచేఁ గైకేయిని పుత్రార్థియై వివాహముఁ జేసికొన నుద్యమించెను. కైకేయి తండ్రియగు కేకయుఁడు కైకేయిని దశరథునకు భార్యగా నిచ్చునపుడు, "రాజా! నీకు నా

౧. శ్లో. యద్యప్యేషా మమ ప్రీతి ర్హిత మన్య ద్విచింత్యతాం,
అన్యా మధ్యస్థ చింతా హి విమర్దాభ్యధికోదయా. (౨ స. ౧౬ శ్లో.)

౨. వాల్మీకిరా. అయోధ్య. ౩ సర్గ, ౩౭వ మొదలు ౪౦వ వరకు శ్లో.

౩. వాల్మీకిరా. అయోధ్య. ౪ సర్గ, ౧ మొదలు ౩ శ్లో. వరకు.

౪. వాల్మీకి రామాయణము, అయోధ్య. ౪-వ సర్గ, ౪ శ్లో. మొదలు ౨౪ శ్లో. వఱకు.

౫. శ్లో. విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః,
తావదేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ. (౪ సర్గ, ౨౫ శ్లో.)

౬. వాల్మీకిరా. అయోధ్య. ౪ సర్గ, ౨౬, ౨౭, ౨౮ శ్లోకములు.

౭. వాల్మీకిరా. అయోధ్య. ౧౦ సర్గ, ౧౦వ శ్లో.

కుమార్తెయందు కలిగిన సుతునకు రాజ్యము నీయ నంగీకరింతువేని నాకూఁతు నిత్తు" ననెను. దశరథుఁ "డట్లే" యని కైకేయిని వివాహముచేసికొనెను. దశరథుఁ డామెను పెండ్లియాడినవెనుక ముగ్గురుభార్యలయందును సంతాన లాభము కలిగినది. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నలుగురి లోను దశరథునకు రామునియందు ప్రీతి హెచ్చయ్యెను.

పూర్వమునుండియు నిక్ష్వాకు కులమున జ్యేష్ఠునికే రాజ్యపరిపాలనార్హత. ఈవిషయము దశరథుఁ డెఱుఁగును. తనకు సంతతి లేదని రాజ్యము నుంకువగా నిచ్చి కైకేయిని పెండ్లియాడినాఁడు. సంతతియే యుండ దను కొన్న యాతనికి భార్యలు ముగ్గురియందును నలుగురు సుతులు కలిగిరి. నలుగురు కొడుకులంకదా! నాకేమి యని సంతోషించుటకుఁ దగిన యవకాశము దశరథునకు లభింపలేదు. ఎందువలన? జ్యేష్ఠుఁడగు రాముఁడు రాజ్యార్హుఁడు. కులక్రమాగతమగు నాచారము నుల్లంఘించుటకు వీలులేదు. కైకేయికి రాజ్య మిచ్చివేయఁబడినది. ఏమి చేయుటకును దోఁచలేదు. ఎట్లయినను కైకేయిని వంచించి రాజ్యమును రామున కీయవలయునను దురూహ దశరథునకు జనించినది.

కుమారులు నలుగురకును వివాహము లైనవి. వివాహము లైనపిదప భరతుని మేనమామయగు యుధాజిత్తు తనతో మేనల్లుఁడగు భరతుని, శత్రుఘ్నుని దీసికొని పోయెను. సమయము చిక్కినది.

భరతుఁడు మేనమామయింటినుండి రాకమునుపే రామునకుఁ బట్టముఁగట్టవలయునని యుద్దేశించినాఁడు. జనకునిఁ, గేకయునిఁ దప్పఁ దక్కిన రాజలోకమును, జానపదులను, పౌరులను సభకు రప్పించినాఁడు. వృద్ధుఁడగు జనకుఁడు దశరథుఁడు కైకేయిని వివాహముచేసికొనుట నెఱిఁగియుండునేమో? అందువలన నాముసలిరాజును, (అతఁడు వచ్చినచో నసలుసంగతి బయలుపడునని,) తన మనుమని కిచ్చినరాజ్యము నితరుల కిచ్చినచో నంగీకరింపఁడను కారణమునఁ గేకయునిఁ, బిలువఁబంపి యుండఁడు.

"వారి నేల పిలువలే"దని యెవ్వరైన నడుగుదురేమో? యని, "వారు దూరముగా నున్నారు. రాముఁడు రాజైన వెనుక విని సంతోషింతురని తొందరచేత దశరథుఁడు కబురంపలే"దని దశరథునిపక్షమున వాల్మీకి వాదించినాఁడు. ౧ఆవాల్మీకియే దేశదేశములనుండి రాజసమూహము సభకు వచ్చినట్లు చెప్పినాఁడు. జనకకేకయ దేశము లీవచ్చిన రాజుల దేశములకన్న దూరమేమో?

ఆస్థాన మలంకరింపఁబడినది. రాజలోకమును పౌరులును సభ నలంకరించిరి. దుందుభిధ్వనితో సమానమైన కంఠధ్వనితో దశరథుఁడు "నేను చాలకాలము రాజ్యమును పాలించితిని. విశ్రాంతిని కోరుచున్నాను. సర్వగుణాకరుఁడగు మా రామభద్రుని మీకు రాజుగాఁ జేయ నుద్దేశించితిని. మీ కిష్టమా? ఇంతకన్న మంచి యాలోచన మీకుఁ దోఁచినచోఁ జెప్పుఁ"డన్నాఁడు.

లోకాభిరాముఁడగు రాముఁడు రాజ్యాధిపతి యగునఁట. దశరథుఁడుకూడ పూర్వుల యాచారము నతిక్రమింపక జ్యేష్ఠునే రాజ్యమున కధిపతినిగాఁ జేయునఁట. రామునికన్న మంచిరాజు వారికిలభించునా? "రోగియుఁ బాలనేకోరెను. వైద్యుఁడును పాలనే నిర్ణయించెను" అన్నట్లు వారి కింకేమి కావలయును? దశరథుఁడు కైకేయిని పెండ్లియాడిన నాఁటిసంగతి సభ్యులలో నొక్కరికిని దెలియదు. తెలిసియున్న కేకయుఁడును జనకుఁడును సభకు రానేలేదు. ఎవ్వ రడ్డువారు? ఒక్కపెట్టున సభలో "ప్రభువువారి యాజ్ఞానుసారము రాముఁడే మాకధిపతి యగుఁగాక" యనుసవ్వడి రెక్కలు గట్టుకొని యెగిరినది.

ఈసంగతి రామునితో నివేదింప నిశ్చయించి దశరథుఁడు రామునిఁ బిలువఁబంపెను. అతఁడు వచ్చిన వెనుక దశరథుఁడు "రామా! యీసభాస్తారు లందఱు నిన్ను రాజ్యపాలకునిఁగాఁ గోరుచున్నవారు. కావున నీవు పట్టాభిషేకము నంగీకరింపుము" అనినాఁడు.

---

౧. శ్లో. ప్రాచ్యోదీచ్యాః ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ భూమిపాః, మ్లేచ్ఛాశ్చార్యాశ్చ యేచాన్యే వనశైలాంతవాసినః, ఉపాసాంచక్రిరే సర్వేతం దేవా ఇవవాసవం. (వాల్మీకిరా. అయోధ్య. ౩ సర్గ, ౨౫౨౬ శ్లో.)

తండ్రియాజ్ఞ జవదాటఁడను బిరుదు వహించిన రాముఁ డేమనును?

పట్టాభిషేకమున కాయత్తపరుపవలసిన సంభారములను సంపాదింప భటులను నియోగించినాఁడు. "రేపటిదినమునసే పట్టాభిషేక"మని నిశ్చయించి దశరథుఁ డంతఃపురమున కేఁగినాఁడు.

రాముని యుద్దేశము సభలో నిష్కర్షగాఁ దెలిసికొనుటకు వీలు చాలదని యూరకొన్నాఁడు కాఁబోలు. సూతునిఁ బిలిచినాఁడు. "రాముని వెంటనే తీసికొనిర"మ్మని యాజ్ఞాపించినాఁడు. సూతుఁడు రామునికడ కేగి, "రామా! తండ్రిగారియాజ్ఞ యైన" దనెను. చెప్పఁదలఁచిన సంగతి సభలోఁ జెప్పియే యున్నాఁడుకదా; తిరిగి యెందులకు రమ్మనెనో? అని రాముఁడు సందేహించెను కాని మానునా? తండ్రినిఁ జూడనేఁగెను. దశరథుఁడు రామునిఁ జూచి రహస్యముగా, "ప్రకృతిజనులు నిన్ను రాజుగాఁ గోరుచున్నవారు. రేపటిదినమున నీకు పట్టాభిషేకము నిశ్చయ"మని, "భరతుఁ డూరలేఁడు. ఇంతలో నేమి భరతశత్రుఘ్నులు వచ్చినపిదపనే యీ ప్రయత్నము చేయరాదా?" యని రాముఁ డనునేమో? యనుకొని, "భయంకరములగు నుత్పాతములు తోఁచుచున్నవి. అట్టి యుత్పాతములు దేశాధిపతి కనిష్టదాయకములు. కావున తొందరగానే నిన్ను రాజ్యాధిపతినిగాఁ జేయవలయు"నన్నాఁడు. మనుష్యులచిత్త మెప్పటికెట్లు మారునో? రాముని యొక్క తల్లులలో నెవ్వతెయైనను తనను నిర్బంధించి రాజ్య మిమ్మనునేమో? అని తలఁచి, [1]యీ యుద్దేశము నాకు మారక మునుపే పట్టాభిషిక్తుఁడ వగుమన్నాఁడు. దీనివలన తనయుద్దేశమే తన వశమున లేనట్లు కనుపట్టుచున్నది. ఇందువలనఁ గైకేయికి శుల్కముగా నీయఁబడిన రాజ్యము మాట యటుండఁగా వరముల నెపమున తనను కైకేయి రాజ్యము నిమ్మని యడిగి నిర్బంధించునేమో యను నుద్దేశము దశరథునకుఁ గలిగియుండు ననుకొనవచ్చునా? ఇది కపటకృత్య మనుకొనవచ్చునా?

ఇదియుఁ గాక; తనలోఁ దెలుపకయే రాజీపట్టాభిషేక ప్రయత్నమును జేయుచున్నాఁడు. తన కీయవలసిన వరములకు రాజ్యమునే యడిగిన నియ్యక తప్పునా? అందువలన నీప్రయత్నమునకు కైకేయి కాని, యామె యనుచరులు కాని విఘ్నముచేయ నుద్దేశింతురేమో? యనుకొని "[2]ఇట్టికార్యములకు విఘ్నములు మెండు కావున నట్టి విఘ్నములు సంభవింపకుండునట్లు నీమిత్రులు రక్షించుచుందురుగాక" అని చెప్పినాఁడు. దైవికములగు విఘ్నములను రామునిస్నేహితు లెట్లు వారింపఁగలరు. మనుష్యులే యీకార్యమునకు భంగకారు లనుబుద్ధి దశరథునకు లేకున్న నిట్లేల యనును? కుశలబుద్ధియగు దశరథున కీపాటి తోఁచదా? కైకేయి కిచ్చిన రాజ్యమును తిరిగి యొరుల కీయ సమకట్టినచో నిన్ని జిత్తులను పన్నుటకు దశరథున కేమవసరము?

ఇదిగాక; భరతుఁ డూరినుండి రాక మునుపే నీకుఁ బట్టాభిషేకమునకుఁ దగినకాల మనినాఁడు. భరతుఁ డచట నున్నచో నాతని కీరాజ్య మీయవలసియుండునేమో? అన్న కుచ్చితపుబుద్ధి దశరథునకు లేకున్న నిట్లేలనును? తానో మూఁడుకాళ్ల ముసలి. నేఁటికి సంతానప్రాప్తి యైనది. కలిగిన నలువురును కండ్లయెదుట నుండఁగా జ్యేష్ఠుఁడును, కల్యాణగుణాకరుఁడును, రాజ్యార్హుఁడును నగు రామునకుఁ బట్టముఁగట్టినఁ దన కెంత తృప్తి? లోకుల కెంత యానందము? మోసగాఁడగు దశరథున కట్టియవకాశ మెట్లు లభించును?

రామునియెడ భరతునకు భక్తి మెండు. ఆసంగతి దశరథునకుఁ దెలియును. రామునకుఁ బట్టముకట్టిన భర

---

౧. శ్లో. తద్యావదేవ మే చేతో న విముంచతి రాఘవ, తావదేవాభిషించస్వ చలాహి ప్రాణినాంమతిః.
వ్యా. తదితి చేతః, త్వాం అభిషేక్ష్యామీతి బుద్ధిః; యావన్న విముంచతి, మామితి శేషః; కుతోబుద్ధి విమోచన ప్రసక్తి రిత్యాహ: మాత్రంతరాది ప్రార్థనాదిభి రితిభావః. (అయోధ్య. ౪ సర్గ, ౨౦ శ్లోకము.)

౨. శ్లో. సుహృదశ్చాప్రమత్తా స్త్వాం రక్షం త్వద్య సమంతతః,
భవంతి బహువిఘ్నాని కార్యా ణ్యేవంవిధాని హి. (అయో. ౪ స. ౨౪ శ్లో.)

తుఁడు కాఁడనఁడు. కాని:—భరతుఁడు తన ప్రియభార్య యగు కైకేయికొడుకు. ఆమెకుఁ దాను తొల్లి వరముల నిచ్చియున్నాఁడు. కావలసిన కోర్కెలను వెంటనే కోరినదా? లేదు. అందువలన నిప్పు డావరవ్యాజమున రాజ్యమును గైక కోరి భరతున కిచ్చిన నేమనఁగలఁడు? అందువలనఁ దా నీమాటలను మనస్సున నుంచికొని, "నాయనా! భరతుఁడు మంచివాఁడే యైనను, ౧బుద్ధిమంతుల చిత్తమైనను పైవారొనర్చు మిత్రభేదాదులవలన మారు పాటును చెందును. మరియు జరిగిపోయిన కార్యమునకే సమ్మతించును. అంతే కాని జరుగఁబోవు కార్యము తనకు లాభదాయకమగునని తోఁచినచో, విడిచిపెట్టఁడు. కావున భరతుఁడు రాకమునుపే పట్టముగట్టికొమ్మని రహస్యముగా రాముని బోధించినాఁడు. ఇన్ని కార్యముల నింత నిపుణముగా మతి చేసిన ముదుసలి చేయఁగలఁడా?

౨కైకేయి కీయఁబడిన రాజ్యమా మెను మోసగించి రామున కీయ నుద్దేశించిన దశరథుఁడు మృషావాది కాలేదా? యని యీశ్వరుని పార్వతి యడుగఁగా నాతఁడు ౩దశరథుని వివాహసమయమునఁ గైకేయి కొడుకునకు రాజ్యమిత్తునని యంగీకరింపలేదు. మరెట్లనఁగా:—తన కుమారునకుఁ బట్టముఁ గట్ట నుద్దేశించినప్పుడు జ్ఞాపకము చేసినచోఁ దప్పక కైకేయిసుతునకే రాజ్యము నిత్తును; లేనిచో రాజ్యార్హుఁడును, గుణాకరుఁడగు నింకొకనికి రాజ్య మిచ్చెదను అనెనని సమాధానము చెప్పెనఁట. ఇట్టి నిర్ణయ మేసందర్భమునకైన నుండునా?

సంతతి లేదు. తిరిగి సంతతికై వివాహము చేసికొనఁ దలంచినాఁడు. కేకయుని కూఁతు నిమ్మని యాచించినాఁడు. అతఁడు తనకుమార్తెకుఁ గలిగిన కుమారునకు రాజ్య మీయ నంగీకరింతువా? అనినప్పుడు సంతానార్థి యగు నాతఁ డెట్టిసమాధానము చెప్పును. "సకాలములో నాకు జ్ఞాపకము చేసినచో" అనిన కార్యము పొసఁగునా?

వెనుకటి కొకసత్యవాది తన శత్రువుపైఁ దెచ్చిన యభియోగము తనపక్షము కాదని తెలిసినదట. చేత కాని సమయమున కదా దైవ మెవ్వరికైనను వరదుఁడుగాఁ దోఁచును. భగవంతుని ప్రార్థించిన ఫలించు నను కొని గుడికిఁ బోయినాఁడు. సాగిలఁబడి మ్రొక్కినాఁడు. "స్వామీ, నాకార్యము ఫలించినచో, తూఁగినప్పుడు తోఁచినంత బంగారము సమర్పింతు" నన్నాఁడఁట. ఆ కార్య మట్లే ఫలించినది. అట్లున్న దీ నిర్ణయము.

పోనిండు; జ్ఞాపకముచేయుదునని కేకయుఁ డంగీకరించినాఁ డనుకొందము. దేశదేశములనుండి రాజ నివహమును బిలువఁ బంచి కేకయునకు వార్తనే యంపలేదు కదా? తా నెట్లీసంగతిని జ్ఞాపకమునకుఁ దేఁగలఁడు? "పోనీ, కైకకేని తెలియునేమో? ఆమె యేల జ్ఞాపకము చేయరా" దనుకొందమన్న, నామె యీ కుల్కవివ.యు మెఱుఁగనే యెఱుఁగదు. తాను రాజ్యమును యాచించునప్పుడైనను దేవాసురసమరమున భర్తకుఁ దాను చేసిన యుపకృతికి ప్రతిఫలముగా నిచ్చిన వరములలో లెక్కించునా? ఇదిగాక; దశరథుఁడు రామునకుఁ బట్టముగట్టుట

౧. ఇందుకు "సతాంతు ధర్మనిత్యానాం కృతశోభిచ రాఘవ."

వ్యా. ధర్మనిత్యానాం ధర్మనిరతానాం, చిత్తం, కృతశోభి పరకృతమిత్రభేదాదినా శోభితం శీల మస్తీతి కృతశోభితి. —అయో. ౪ స. ౨౭ శ్లో.

యద్వా:—సతాం చిత్తం, కృతేనశోభతే నతు కరిష్యమాణేన. అయం భావః యదీదానీమేవ రామాభిషేకః క్రియతే తర్హి భరతచిత్తస్యాపి హర్షో భవేత్. తదా రాజ్యాశా భరతస్య భవేదితి. అత స్త్వరిత మాత్మాన మభిషిక్తం కుర్విత్యర్థః.

౨. శ్లో. రాజ్ఞో దశరథ స్యాస్య మృషావాదిత్వ మాగతం, ప్రతిజ్ఞోల్లంఘనం యస్మా త్కృతం తత్కేకయాధిపే, కైకేయ్యా గ్రహణే పూర్వం తదుద్వాహే హ్యుపస్థితే. —ఉమాసంహిత.

౩. శ్లో. వివాహసమయే రాజ్ఞా ప్రతిజ్ఞాత మిదం శ్రుణు, పట్టాభిషేకసమయే భవేయం స్మారితో యది, త్వయా వా స్యైన భూపాల తదా చేత్కరవా ణ్యహం. ఇత్థం ప్రతిజ్ఞా మకరోద్వివాహగ్రహణే నృపః, తిస్మా దస్మిన్నవద్యాగ్రే నహోపోఽస్తి శుభాననే. —ఉమాసంహిత.

నిశ్చిత మగువఱకుఁ గైకయింటికే పోలేదు. ఆమెకు మాత్ర మెట్లు తెలియును ? ఈయంశములనుబట్టి యాలోచించిన, దశరథుఁడు కైకను వంచించుతలఁపు గొని యసత్య మాడుటకు సందేహింపలే దనుకొనవలసివచ్చినది.

ఈ దశరథుఁడు రామునియందు ప్రీతి కలవాఁడగుటచేఁ గైకేయిని మోసగించినాఁడేమో? రామునిపట్ల నసత్యవాది గాక కార్యనిర్వహణము నొనర్చునేమో— యనుకొందమన్న, వానియెడఁగూడ దశరథునకు మృషావాదిత్వము సిద్ధమగుచున్నది. ఎట్లన :—

తనపూర్వులగు రాజు లనుసరించినమార్గము నే యనుసరించి జ్యేష్ఠుఁడగు రామునకు రాజ్యము నీయ నుద్దేశించి యిట్టి మాయోపాయములఁ జేసె ననినచో, రామ వనవాససందర్భమునఁగూడ మాయచేయక తీరినది కాదు.

పట్టాభిషేకము రేపటిదినముననే కావలయునని నిశ్చయించి యింతవఱకుఁ గైకేయి కీసంగతి తెలియ దనియు, నిఁకఁ దెలిసినను బాధకము కాదనియు నిశ్చయించికొని, కైకేయియింటికి దశరథుఁ డేఁగినాఁడు. మంథరావాక్యప్రేరితయై కోపాగారమున నామె శయనించినది. ప్రియురాలు. చూచినాఁడు. గుండె బ్రద్దలయినది. ఏమి చేయును? పిలిచినాఁడు. లాలించినాఁడు. బోధించినాఁడు. "ముసలికి ముచ్చటలు హెచ్చు"కదా! పలికినఁ జాలును. "ప్రేయసీ! నీ కేది కావలసియున్న నదే యిచ్చెద" నన్నాఁడు. ఆహా! పులియట్టివాఁడైనను పొలఁతికి లోకువయేకద! ఆసందర్భమున నాతఁ డాడినమాట లిట్లున్నవి. ౧"నేనును నాయనుచరులును నీవశవర్తులము. నీయభిమత మెట్టిదైనను నెఱవేర్తును. వమ్ముచేయ నుద్దేశింపను. నాప్రాణములైనను సరే, నీవు కోరిన నిచ్చెదను. నీదెస నాకుఁగల ప్రేమోత్కర్షము నెఱిఁగియు నన్నేల శంకించెదవు. నేను చేసిన సుకృతమాన నీయిష్ట మెద్దియో చేసి తీర్చెదను.

"రామునకుఁ బట్టముఁగట్ట నుద్దేశించితిని. ఆసంగతి తెలిసి యిదివఱలో నే నిచ్చినవరములకుఁగా రాజ్యము నడుగఁదలఁచి యిట్లలిగినదేమో? అట్లే యయినచో నేమనఁగలవాఁడ?" నని యాలోచింపలేదు. "సరే! నీవు కోరఁదగినది యై నే నీయఁదగిన దెట్టిదైనను ఇచ్చెద" ననెనా? అట్లనఁగలఁడా?

కైకేయి తొల్లి దేవాసురయుద్ధములో దశరథునకుఁ జేసిన యుపకారమును జ్ఞప్తికిఁ దెచ్చినది. అయ్యది నుఁ దన కిచ్చిన వరములలో నొకదానికి "భరతునకుఁ బట్టముఁ గట్టుటయు, రెండవదానికి రాముని నడవికిఁ బంపుటయుఁ గోరినది.

వరము లనినతోడనే "అకొరకితినిరా" యనుకొన్నాఁడు. డిల్లపడినాఁడు. తల్లడిల్లినాఁడు. ఏమిలాభము? "ముందుకు వచ్చిన నూయి, వెనుకకుఁ బోయిన గొయ్యి" యను స్థితికి వచ్చినది దశరథుని యవస్థ. నానాదేశాయాతులగు రాజోత్తములయెదుట, సత్యసంధులును, జితేంద్రియులును నగు వసిష్ఠవామదేవాదుల ముందఱ, రాజ్యమును రాముని కిచ్చెద ననినాఁడు. ఆమాట తప్పుటకు వీలు లేదు. ఇప్పుడో? వివాహసమయమున రాజ్యము నంకువగా నిచ్చినసంగతి యట్లుండఁగా, తన ప్రాణమును రక్షించినందులకు సంతసించి యిత్తుననిన వరముల నీయక తీరునా? లేకున్న, నిప్పుడైనను నీయిష్ట మెద్దియో యడుగుము. ప్రాణమైనను సరే ఇచ్చెద" నని మాట తప్పఁగలఁడా? సత్యసంధుఁ డనిపించుకొనవలదా?

౨సాంత్వనవచనములచేతఁ జక్కఁబరుపఁదలఁచినాఁడు. ౩"తరుణీ! నిన్ను నే వసిష్ఠవామదేవాదులయెదుట

---

౧. శ్లో. అహంచైవ మదీయాశ్చ సర్వే తవ వశానుగాః, న తే కించి దభిప్రాయం వ్యాహన్తు మహ ముత్సహే,
ఆత్మనో జీవితేనాపి బ్రూహి య న్మనసేచ్ఛసి, బల మాత్మని జానంతీ నమాం శంకితు మర్హసి,
కరిష్యామి తవ ప్రీతిం సుకృతే నాపి తే శపే. ౧౦ స. ౩౪-౩౫.

౨. శ్లో. నాజ్ఞాస్త్రేణ తదా రాజా కైకేయ్యా స్వవశేకృతః, ప్రచస్కందవినాశాయ పాశం మృగ ఇవాత్మనః.
అయోధ్య. ౧౧ స. ౨౨ శ్లో.

౩. శ్లో. తాంహి మే సుకృతాం బుద్ధిం సుహృద్భిస్సహనిశ్చితాం, కథం ద్రక్ష్యామ్యపావృత్తాం పరైరివహతాం చమూం. కిం మాం వక్ష్యంతి రాజానో నానాదిగ్భ్యస్సమాగతాః, బాలో బతాయ మైక్ష్వాకశ్చిరం రాజ్య మకారయత్.

రామునకు రాజ్యము నిత్తు నంటిని. దాని నెట్లు విడువఁ గలను? నీ కోరినట్లు నే నొనర్చినచో నిన్నటి నావాక్య మసత్యమగును. అందువలన నసత్యవాది యను దూఱునకు నన్నుఁ బాల్పడనీయకు" మనియు, "నింత చపలబుద్ధి యగురా జింతకాల మెట్లు రాజ్యమును పాలించె" నని లోకులు తన్ను నిందింతురనియు మొఱఁబెట్టినాఁడు. మాట జరిగినది కాదు. బ్రతిమాలినచో నెట్లుండునో? ఆలోచించినాఁడు. అంజలిఘటించినాఁడు. ప్రార్థించినాఁడు.

౧ రాజు చేతులను జోడించి నయవాక్యము లతో బుజ్జగించుచు నిట్లనెను: "దేవీ! సాధుస్వభావము కలిగి దీనుఁడనై చావనున్నట్టి రాజనై యున్న నన్ను ననుగ్రహింపుము. తరుణీ! నీవు మంచి హృదయము కల దానవు. ఈరాజ్యము నాది కాదు. శూన్యుఁడనై మతి మాలి ప్రజలయెదుట రామునకు రాజ్యము నిత్తు నంటిని. ఈరాజ్యము నీ కీయఁబడినదే. నీవలన ననుగ్రహింపఁబడిన యీరాజ్యమును రాముఁడు వడసి పరిపాలింపఁగా కీర్తి నందుము" అని.

ఇట్లు ప్రార్థించిన మహానుభావుఁడు రామునకుఁ బట్టాభిషేకప్రయత్నము చేయుటకు ముందే కైకేయి వద్ద కేగి, "కైకేయీ! యీరాజ్యమంతయు నీ కుంకువగా నీయఁబడినది. మఱియు, దేవాసురయుద్ధకాలమున నీచే రక్షింపఁబడితిని. ఈరాజ్యము నీయది. పూర్వమునుండియు మనవంశమున జ్యేష్ఠుని రాజ్యపాలకునిఁగాఁ జేయుట యాచారము. నేను వృద్ధుఁడను. నీకు భరతుఁ డెట్టివాఁడో రాముఁడును నట్టివాఁడు కావున నీ యీరాజ్యమును నీ యిచ్చవచ్చినవానికి న్యాయానురోధముగ పట్టమును గట్టి కీర్తిబడయుము" మనినచో నామె రామునియం దభిమానము కలది కావున, రామునకే రాజ్యము నిచ్చియుండునేమో? అసత్య మాడఁబోయిన నంగద లెన్ని సంభవించినవి!

కైకేయి యొప్పినది కాదు. విసిగినాఁడు. తుదకు కోపమువచ్చినది. కానకు —"నీకోరినకోర్కె నాకనిష్టము. కావున నోపాపాత్మురాలా! నీవు లోలోననే క్రుళ్లుము. మండిపొమ్ము. నశింపుము. ఏయెత్తయినస్థలమునుండి యయి తేకిరైనను వేయిచుకలగుము. కాని నేను చేయను" అనెను.

కైకేయి "సత్యవాదిని కా నను ము. లేకున్న నా యిచ్చవచ్చినట్లు చేయుము" అనుపట్టు విడువలేదు. నగరవాసులను సత్యముపలికి మెప్పింపకున్న నష్టము లేదు. నాఁతిని మెప్పింపకున్న మనఁగలఁడా? తుదకు "[3]ధర్మ బంధేన బద్ధోఽస్మి" యని గత్యంతరము లేక అనినాఁడు. రాముని మెల్లగా "నరణ్యమార్గమును నాశ్రయింపు"మన్నాఁడు.

* ఈ ధర్మము రామునకుఁ బట్టముగట్టు తలఁపున సభలో రాజలోకముతోఁ జెప్పునప్పుడును, రామునితో రహస్యముగా నాలోచించినయపుడును, నెం దేగినదో?

"అశక్త్యా పురుష స్సాధుః."

ఈకారణములనుబట్టి దశరథుఁడు చలచిత్తుఁడని యు, గామవశుఁడనియు, నసత్యవాదియనియు, సందే హింపవలసివచ్చినది.

---

* వ్యా. సుకృతాం సమ్యక్ప్రవర్తితాం, అత్రహేతుః సుహృద్భిస్సహ నిశ్చితాం, బుద్ధిం రామాభిషేక విషయిణీం బుద్ధిం, అపావృత్తాం కథం ద్రక్ష్యామి.

వ్యా. బాలోబతాయమితి. బాలో మూఢః, అయ మైక్ష్వాకః దశరథః, చిరం కథంరాజ్య మకారయత్ అకరోదితి నానాదిగ్భ్యశ్చ స్సమాగతా రాజానః మాం వక్ష్యంతీతి యోజనా.

౧. శ్లో. ఏవ ముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాంజలిః, ప్రసాదయామాస పునః కైకేయీం చేద మబ్రవీత్, సాధువృత్తస్య దీనస్య త్వద్గతస్య గతాయుషః, ప్రసాదః క్రియతాం దేవి! భద్రే రాజ్ఞో విశేషతః, శూన్యేన ఖలు సుశ్రోణి! మయేదం సముదాహృతం, కురు సాధు ప్రసాదం మే బాలే! సహృదయాహ్యసి, ప్రసీద దేవి రామో మే త్వద్దత్తం రాజ్యమవ్యయం, లభతామసితాపాంగే! యశః పర మవాప్నుహి. ౧౨ సర్గ. ౧౧౫ మొ. ౧౧౯ శ్లో. వఱకు.

౨. శ్లో. ప్రతప్స్య వా ప్రజ్వలవా ప్రణశ్య వా సహస్రశో వా స్ఫుటితా మహీం వ్రజ, న తే కరిష్యామి వచ స్సుదారుణం మమాహితం కేకయరాజపాంసని. అయో. ౧౨ స. ౧౧౧౪ శ్లో.

౩. ధర్మబంధేన ధర్మపాశేన బద్ధోఽస్మి త్వా కేనరామవివాసనం మనా గమజ్ఞాతం,

# హృదయార్పణము

కవిసోదరులు: పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్యగార్లు

కేవలమైన ప్రేమలతికా నివహమ్మునఁ జూపునిప్ప వా
శావధి నంతుగాని; విరహమ్మున నీకయి వేఁగివేఁగి నీ
వేవము పడ్డ పైచి యొకటేమది గోరితిఁ; గాని దానికిన్
తావక మైన కారుణికతాగుణమున్ వెలిదీయ వద్దిరా!

ఆదృతిలేనినాప్రణయ మారడిపోయినఁ బోవ్రఁగాక నీ
వేదతి; ప్రేమశూన్య మగునేమొ భవన్మతి; యింతచూచియున్
సాదుతనంబటే యిది కసాయితనంబగుఁ గాని; కోరినన్
పైదలి కౌఁగిలింతలకు వ్రాలని నీయసమాననిష్ఠయున్.

లోఁతగు నీదు డెంద; మతిలోలుపమైనమనమ్ము నాది; నీ
వో తడిలేని తామరవు; పోసిననీరము పీల్చు నాచు నేన్;
కోఁతలువడ్డ నాహృదయకోటరముం బగిలించి చూపి నీ
చేఁతలకెల్లఁ బాలుపడి సిగ్గతి చిక్కితి నిట్లు మిత్రమా!

ఎంతనివేఁడుకొన్నను ద్రవింపదు నీహృదయమ్ము నేయయు
స్కాంతపు జాతిముక్క జతగా నొనరించెనొ తమ్మిచూలి; నీ
యంతన లాగుకొంటి హృదయమ్మును నన్నును సర్వమున్;
కృపావంతము కానినాఁడు రసవంతమ? స్వాంతము, రాగవంతమా?

భారవశమ్మునన్ వలచివచ్చిన నెచ్చెలి నూరడింపఁగా
నేరవు, ప్రేమతోఁ బిలువనేరవు, చూడఁగనేరవున్, సఖా!
తేరకుఁ దక్కినట్టి యువతిన్ కయికో విదియేమి? చాలునో
హో రసికాగ్రణీ! వలపులూరని నీతలఁపేమి చెప్పుమా!

నాథ! భవన్మనమ్ము కఠినమ్ము, శిలామయమై వియోగపున్
బాధలపాలుచేసి రసవంతము నామదిలోనిమాట, నీ
సాధన కేమిలే సయిఁపఁజాలని నాపయి నీశరత్తు దు
స్సాధమహానలమ్ముల నజస్రముఁ జిమ్మెడి, సడ్డగింపవే?

---

# ప్రాచీన చిత్రములు

(౧, ౩, ౪ చిత్రములు ఆనంద కే. కుమారస్వామిగారి చిత్రసంచయము నందలివి.)



౧. దుర్గ (మహిషాసురమర్దని)



౨. దుర్గ (మహిషాసురమర్దని)
మహాబలిపుర శిల్పచిత్రము.

# భవభూతిమహావీరచరితము

తట్టా వీరరాఘవాచార్యులుగారు

కవితాప్రపంచమును తిలకించుట ప్రతిమనుజునకు సాధారణముగుపని కాదు. నేత్రము లెన్నియుండినను, గమనసాధనము లెన్నియున్నను, నిరుపయోగములు. అది యొకమహాకవి మనోదృష్టికే గోచరమగును. అతఁ డొకచోటనుండియే కవితాప్రపంచమున నిగూఢముగా దాగియున్న రసవద్బీజములను కనుగొనగలఁడు. కనుగొనుటయేకాక ఆబీజములను భావనాలవాలమున వెదచల్లి ప్రతిభాసలిలములచే పెంపొందించి సముచితరచనాదోహదంబున పెద్దవృక్షములనుజేసి మహోత్తమములగు తత్ఫలముల నమూల్యముగా సుమనస్సుల కర్పించి తాను ధన్యంమన్యుఁ డగును. ఇదియును సులభసాధ్యమగునది కాదు. బహుభవసమార్జితసుకృతవిశేషస్వయంవరణసక్తయగు వాగ్వాణి యపాంగలేశమున కెవ్వఁడర్హుఁడో తాదృశునికే యది లభించును. కావుననే ఆనందవర్ధనాచార్యులవారు స్వకృతధ్వన్యాలోకాఖ్యగ్రంథమున

'సరస్వతీ స్వాదు తదర్థవస్తు
నిష్యందమానా మహతాం కవీనామ్,
అలోకసామాన్య మభివ్యనక్తి
పరిస్ఫురన్తం ప్రతిభావిశేషమ్.'

మహాకవిత్వోచితప్రతిభాస్ఫురణ సర్వసాధారణమయినది కాదనియు నది వాగ్దేవతాప్రసాదస్వయంకృతమనియును చెప్పి,

'సోఽర్థస్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన,
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌ శబ్దార్థౌ మహాకవేః.'

సముచితరసోల్లసితవిశిష్టసుశబ్దార్థ సంఘటనమే మహాకవికి ముఖ్యముగా గమనింపదగినవిషయమనియును వాక్రుచ్చియున్నవారు. ఇట్టి విశిష్టరచనాధుర్యులై నేటికిని కీర్తికాయులై యున్నవారు కొద్దియే. అట్టివారిలో శ్రుతవృత్తుండగు భవభూతి యొకండు. ఆజానజమహాకవిలక్షణలక్షితుం డగునీతనిచే రచితములయి సానదీరినజాతిరత్నములవలె ప్రకాశమానములగు కృతిరత్నములు మూఁడు. వీటిలో వీరరసాధారాసాధరణ గుణోదారనాయకోపేతంబగు నది మహావీరచరితము. ఇం దీమహాకవిచే బాలకాండము మొదలుకొని యుద్ధకాండపర్యంతికగాథ యౌచితి ననుసరించి చక్కఁగా వర్ణింపబడియున్నది. ఈకవి తాను రచయితయేకాక, 'భక్తస్య తత్ర సమరంత మమూపి వాచః' అనునట్లు స్వతస్సిద్ధభగవద్రామభక్తిపరిపూరితుఁడు గాన నైసర్గికకల్యాణగుణోన్నిద్రుండగు రామభద్రునిమహిమాదులకు మరింత వన్నె దెచ్చియున్నవాఁడు. ఈగ్రంథప్రథమాంకమున సిద్ధాశ్రమమునందు కన్యకాసహితకుశధ్వజునికి దాశరథిసహితవిశ్వామిత్రునికి సమాగమము వర్ణింపబడినది. ఇందు గాధేయునికి తపశ్చాతుర్యముకంటె లౌకికవ్యవహారణచతురిమయే చక్కఁగా నిర్దేశింపబడియున్నది. 'జగదుపకృతిబీజం మైథిలీం ప్రాపయిష్యన్' అనునట్లు జగదుపకారహేతువగు జానకిని శ్రీరామునితో గూర్పనిచ్ఛగల యీతపస్వి రామలక్ష్మణులు వినునట్లు ప్రకాశముగా

'సందిష్టంచ మైథిలస్య రాజర్షే రస్మాభిః. ఆచార ఇతి యజమానోఽపి యజ్ఞే నిమంత్రితోఽపి. కుశధ్వజస్తు సీతోర్మిలాసహితః ప్రేషితవ్య ఇతి. కృతంచ తత్ప్రియసుహృదా'

అని యనుటచే నిమంత్రణవ్యాజమున దీక్షితుఁడగు జనకునికి సందేశమంపి సీతోర్మిలాసహితుండగు కుశధ్వజుని తనయాశ్రమమునకు పంపునట్లు చేసి పురాణదంపతులగు సీతారాముల కన్యోన్యసందర్శనావకాశమును గల్పించి పరస్పరప్రీతి నంకురింపజేసియున్నవాఁడు. ఇచ్చట అనుషంగికముగా లక్ష్మణోర్మిలా ప్రీతిగూడ వర్ణింపబడి యున్నది. ఇందలి కుశధ్వజుపాత్రకు మర్యాదగల గృహస్థునికి పెద్దలయెడ నుంచవలసిన భయభక్త్యాదులు చక్కఁగా వర్ణింపబడియున్నవి. కావుననే సూతునితో సంభాషించునప్పు డీతఁడు

'ప్రకృష్టకల్యాణో దర్శనసంగమో హ్యేతే భవన్తి భగవన్త స్సత్యసంధా స్సాక్షాత్కృత బ్రహ్మాణో మహర్షయః.

తమాంసి ధ్వంసన్తే పరిణమతి భూయా నుపశమ
స్సకృత్సంవాదేఽపి ప్రథితే ఇహ చాముత్రచ ఫలమ్,
అథ ప్రత్యాసంగః కమపి మహిమానం వితరతి
ప్రసన్నానాం వాచః ఫలమపరిమేయం ప్రసువతే.'

(సాక్షాత్కృత పరబ్రహ్ములయి సత్యవాక్కులయి పూజ్యులగు నిట్టి మహర్షి వరేణ్యుల సంబంధములు గొప్ప రాబోయెడి శుభఫలములకు కారణములు గదా! ఇట్టి మహానుభావుల దర్శనముచే సమస్తాజ్ఞానములు నశించుచున్నవి. మోక్షహేతువగు సత్త్వాభివృద్ధి గల్గుచున్నది. ఒకసారి సంభాషించినను రెండులోకములయందలి ఫలము చేకూరుచున్నది. ఇట్టి మహానుభావుల విషయమై భక్తిపూర్వకముగా ప్రత్యుత్థానాభివందనాదుల నొనర్చుట చెప్పశక్యముకాని గొప్ప మాహాత్మ్యమును విశేషముగా కలుగజేయుచున్నది. ప్రసన్నులగు వీరివాక్కు లిట్టిట్టివని చెప్పనలవిగాని ఫలమును పుట్టించుచున్నవి.) అని యిట్లు పాత్రవ్యాజముచే నిట్టిపరిశుద్ధభావము లీకవిపుంగవునిచే నిరూపితములో గమనింపుడు. ఇంకను సిద్ధాశ్రమమున సీతనుగూర్చి గంభీరపవిత్రధీరభావుండగు రాఘవుని చిత్తమెట్లుపవర్ణితమో తిలకింపుడు:

'ఉత్పత్తి ర్దేవయజనా ద్బ్రహ్మవాదీ నృపః పితా,
సుప్రసన్నోజ్జ్వలా మూర్తి రస్యాం స్నేహం కరోతి మే.'

(దివ్యయజ్ఞక్షేత్ర ముత్పత్తిస్థానము. సతత పరబ్రహ్మధ్యాన తత్పరుడు స్వకర్మనిరతుడునగు జనకమహారాజు పెంపుడుతండ్రి. మనఃప్రసాదకరమై మహానుభావాలంకృతమగు శరీరము. ఇట్టిమెయందు నామనస్సు స్నేహాయుక్తమగుచున్నది.) ఇచ్చట స్నేహపద స్వారస్యము జన్మాంతరమున సమమరూపములగు రెండువ్యక్తులకు సహజ పరస్పరగ్రథితమై మరల ఈ జన్మమున ఉద్బోధకవిశేషముచే స్వతోనిర్గతమై యొకరిపై నొకరికి గల్గు ప్రవమాణ నిర్మలచిత్తప్రీతి విశేషమని గ్రహింపదగినది. మరియును ఇచ్చటి ప్రతిపదస్వారస్యము ధ్వన్యలంకార తత్త్వవేదులకే గోచరమగునని విస్తృతిభీతిచే నిగమింపుచున్నవాడ. ఇట్లు నాయకానురాగానంతరము దర్శనమాత్రముననే ప్రీతచిత్తయగుజానకి ఎదుట నహల్యాశాపవిమోచనాదులచే వ్యక్తమహిముండగు శ్రీరాముని విషయమై యామె హృదయ మిట్లు వర్ణింపబడినది.

'సీతా — (సవిస్మయానురాగం నిర్వర్ణ్య)
సరీరనిమ్మాణసరిసో సే అణుభావో.'

(శరీరనిర్మాణోచితమయిన దీతని మాహాత్మ్యము.)

మరల తాటకావధనియుక్తుండగు రాముని గూర్చి

'హద్ధీ హద్ధీ ఏసో ఎవ్వ ఎద్ధ ణిఉత్తో.'

(అయ్యో ఎంతకష్ట మెంతకష్ట మితఁడే యీకార్యమునందు నియోగింపబడినవాడు.)

పునర్విశ్వామిత్రవాక్యములచే తాటకాసంహారోద్యుక్తుండగు రాఘవునిగూర్చి

'సీతా — అహో పరాగతీవ. హాధిక్ హాధిక్
ఉత్పాతపాతావలిరివ సా హతాశా మహానుభావ
మభిద్రవతి.'

(అయ్యో, ఈసుకుమారాకారుడు తాటక నెదురుచున్నవాడు. ఎంతకష్ట మెంతకష్టము? ఉత్పాతసమూహము వలెనే వ్యర్థాశయ యగునీదుష్టురాలు మహానుభావు నెదుర్కొనుచున్నది.) ఇట్లు నైసర్గిక సచ్ఛీలకోమలభావయగు జానకీకన్యయొక్క స్వాభిలషితవరవిషయకౌత్సుక్యావేగత్రాసరత్యాదిభావము లెంతరమణీయములో కనుంగొనదగును. ఇట్టిసందర్భముల నీకవిరాజు పరకవులచే నాయికానాయకసంఘటనావసరమున కుచకచాదివ్యర్థబాహ్యాంగవర్ణనలచే నాతమి దీర నొనర్పబడు రీతి ననుసరింపక యథావస్థితపాత్రోచితగౌరవానుభావ వ్యంజకము లగు నాయికానాయకసద్భావములను వ్యక్తపరచి విశేషజ్ఞులగు సహృదయుల నాకర్షించుచున్నవాడని వేరుచెప్పవలయునా? ఏవంవిధ నాయికానాయక కుశధ్వజవిశ్వామిత్రసమావేశసమయమున కన్యార్థి రావణప్రేషితరాక్షసపురోహితప్రవేశ మొనర్పబడినది. ఈపురోహితుడు తన ప్రభువగురావణుడే సర్వాధికుడను తలంపున కాబోలు ప్రథమమున కుశధ్వజాదులగూర్చి

'సందిష్టంచ వో మహారాజేన.'

(మహారాజగు రావణునిచే మీకు సందేశ మంపబడినది.) యనిచెప్పి కన్యారత్న మయోనిజ మిత్యాదివాక్యము లచే సందేశార్థమును వివరించెను. ఇట్టిసందేశ శ్రవణా నంతరమున జరిగిన శ్రీరామలక్ష్మణుల పరస్పరసంభాషణ వైఖరి యెట్లు చిత్రితమో కనుంగొనుడు:

'ఆర్య నిశాచరపతి ర్దేవీ మిమాం ప్రార్థయతే.'

(ఆర్యా, రాక్షసరాజు మహామహావురాలగు నీకన్యను యాచించుచున్నవాడు.)

'రా—వత్స!
సాధారణ్యా న్నిరాతంకః కన్యా మన్యోఽపి యాచతే;
కింపునర్జగతాం జేతా ప్రపౌత్రః పరమేష్ఠినః.'

(ఓకుమారా, సాధారణముగా కన్యకను సామాన్యమనుజుడు గూడ యాచించుచున్నవాడు. జగజ్జేతయై విశుద్ధబ్రహ్మ వంశోత్పన్నుడగు రాక్షసాధిపతి యాచించెననుటలో వింత యేమున్నది.)

'ల—అతిహి సౌజన్య మార్యస్య. తస్మి న్నపి నిసర్గవైరిణి నిశాచరే బహుమానః.'

(ఆర్యుడవగు నీసుజనత్వము మిక్కుటముగదా. ఎందువలన నట్టిసహజశత్రువగు రాక్షసునియందు గూడ గౌరవమో.)

'శ్లో. యో న స్త్రైయీపరిధ్వంసా
శ్శాత్త్రం తేజోఽపకర్షతి;
అస్మాకం యశ్చ రాజాన
మనరణ్యం కిలావధీత్.'

(శాస్త్రతేజస్కరములగు వైదికకర్మలను వినాశ మొనర్చి ఎవడు మనక్షాత్త్రియవీర్యము నపకర్షించెనో, యేమహాత్ముడు మనకు పూర్వుడగు ప్రజారంజకుడైన యనరణ్యభూపాలుని వధించెనో. ఇట్లమర్షోద్దీపకమగు) శత్రువిషయకప్రస్తావనయందును వికృతినొందని రామ దేవునివాక్యములను గమనింపుడు.

'రా—కామం శత్రురితి వధ్య స్స్యాత్. నపునరతి వీర్యమప్రమేయతపస మప్రాకృతం ప్రాకృతవ దర్హసి వ్యపదేష్టుమ్.'

(శత్రువని చంపదగినవాడగునుగాక! లోకాతీత వీర్యతపోనిధానమగు నొకయసాధారణపురుషుని సాధారణునివలె తూలనాడుటకు నీ వనర్హుడవు.)

'ల—నిరస్తవీరపురుషాచారస్య కా వీరతా.'

(శూరజనమర్యాదను వదలినవానియొక్క పరాక్రమ మేపాటిది.)

'రా—వత్స మామైవమ్.
యద్విద్వానపి తాదృశోఽ ప్యభిజనే
ధర్మాత్పథోఽపి చ్యుతః
కిం బ్రూమోఽత్ర త దస్య దేవ వ వశ
స్త్రైలోక్యే సర్వే గుణాః;
లీలానిర్జితషణ్ముఖాద్భగవత
శ్శ్రీరామదగ్న్యాద్ దృతే
నిర్విఘ్నప్రతిపన్న విశ్వవిజయో
వీరస్తు కస్తాదృశః.'

(ప్రసిద్ధ బ్రహ్మవంశజాతుడయినను, విద్వాంసుడయినను రాక్షసాధిపతి ధర్మమార్గమును వీడినాడనుటను గురించి మేమేమిచెప్పుదుము? ఆవిషయము వేఱు. సమస్తసద్గుణము లొకస్థలమునం దుండవుగదా! అనాయాసముగా కుమారజేతయగు మహానుభావుడగు పరశురాముని విడిచి పూర్తిగా సర్వప్రపంచమును జయించినరావణునివంటి వీరు డెవడు.) ఇట్లు దుర్గుణభూయిష్ఠుండగు శత్రువునందును గుణములనే గ్రహించి శ్లాఘించెడి మహోదార భావము శ్రీరామచంద్రునియందుకంటె మరెవ్వని యందు కాన్పించును? ఏవంవిధధీరోదాత్తధీరోద్ధత నాయకనిసర్గోచితసంభాషణసందర్భాదులచే శ్రవణ పుటముల నలరించెడి నీమహాకవి నెంతకొనియాడం దగును. పూర్వప్రస్తుతరావణసందేశ శ్రవణానంతరమున మైథిలీచిత్తవృత్తి యెట్లువర్ణితమో చూతము.

'సీ—హాధిక్, హాధిక్. రాక్షసో మా మభ్యర్థయతే.'

(ఎంతనిందిత మెంతనిందితము. రాక్షసుడు నన్ను గోరుచున్నవాడు.) మృదుప్రకృతికయగు బాలిక కింతకంటె తనను గోరెడుక్రూరునివిషయమై యనవలసిన దేమున్నది. ఈదృశభావవైఖరులసమయమున సాభిమానరాక్షస

పురోహితగర్వాపహారికో అగుమ ప్రధాననాయకరామవీరోన్నత్యైజనముకో అగుమ తాటకాప్రవేశము సూచితమాయెను. నాగాయుతప్రాణయగు నీ మహామృత్యువును చూచి యించుకయు చలింపని మహాధీరుడగు రామభద్రునిగూర్చి రాక్షసపురోహితుని వాక్యము

'రాక్షసః—(స్వగతమ్) అయం స రామో దాశరథిః. యదేవః

ఉత్తాలతాటకోత్పాత
దర్శనేఽప్యప్రకంపితః,
నియుక్తస్తత్ప్రమాథాయ
స్త్రైణేన విచికిత్సతి.'

(ఆదశరథపుత్రుడగు రాముడా యాతడు? ఏ యితడు మహాభయంకర తాటకావ్యాజ మహోత్పాతదర్శనమునందును నించుకయు చలింపక తత్సంహారార్థము గాధేయప్రేరితుడై స్త్రీ యనుటచే సంశయించుచున్నవాడు.) సమాజచ్ఛిద్రాన్వేషణ స్వభావులగు నిట్టి రాక్షసులచేతను కొనియాడందగిన ధైర్యదయాదులు శ్రీరామునికి తప్ప మరెవ్వరి కుండును? ఇట్లు తాటకావధ సందిహానుడగు దాశరథిని ప్రేరేపించెడి విశ్వామిత్రవాక్యము లెట్టివో యనుశీలింపుడు:

'వి—త్వరస్వ వత్స, కిం నపశ్యసి బ్రాహ్మణజనస్య సంఘాతమృత్యు మగ్రతః.'

(కుమారా, తొందరపడుమా, బ్రాహ్మణ సంఘమునకకాలమృత్యువగు దానిని ముందర చూచుట లేదా?) ఇచ్చట విప్రోదితవేగాతిశయ మెంతరమణీయమో చూడుడు. ఇందలి బ్రాహ్మణపదము సాభిప్రాయము. ఇట్టి సమయమున నెటుచెప్పుటకు తోచక న్యస్తభరుడగు కౌసలేయుని క్రమవాక్సరణిని గమనింపుడు.

'ఏవం భగవంతో జానంతి:
సర్వదోషా నభిష్వంగా దామ్నాయసమతాంగతాః,
యుష్మాక మభ్యుపగమాః ప్రమాణం పుణ్యపాపయోః.'

(పూజ్యులగుమీబోటివా రిట్లు తలంచుచున్నారు. సర్వదోషరహితములయి వేదతుల్యములగు మీయొక్కయంగీకారములే పుణ్యపాపములవిషయమై ప్రమాణము.) సందిగ్ధస్థలముల మహానుభావులవాక్యములయం దుంచదగిన విశ్వాస మిట్టిదేకదా. కౌశికవాక్యానుగరామకృత మారీచజననీమారణానంతరము రాక్షసపురోధవాక్యములు లోకన్యాయానుసారముగా నెటుల విశదీకృతములో వినుడు:

'రాక్షసః—భో ఆర్యే తాటకే కింహినా మైతత్
అంబుని మజ్జన్త్యలాబూని గ్రావాణః ప్లవంతే.'

(ఓమహానుభావురాలగు తాటకా, యేమిటిది? నీటియందు బెండ్లు మునిగి గుండ్లు తేలుచున్నవి.)

'శ్లో. న స్వస్య రాక్షసపతే స్ఖలితః ప్రతాపః
ప్రాప్తోఽద్భుతః పరిభవోఽస్య మనుష్యపోతాత్;
దృష్టః స్థిన్నతేన చ మయా స్వజనప్రమారో
దైన్యం జరాచ నిరుణద్ధి కథం కరోమి.'

(ఓతాటకా, నీమరణముచే నిప్పుడు రాక్షసాధిపుండగు రావణునిపరాక్రమము క్షీణించినది. మనుష్యమాత్రుండగు బాలునివలన నసంభావితమగు పరిభవము తటస్థించినది దగ్గరె నుండిన నేను నాకండ్లార బంధుమరణమును చూడవలసివచ్చినది. జరాదైన్యములు పునశ్శత్రుప్రతిక్రియయందు న న్నసమర్థునిచేయుచున్నవి. ఏమిచేయుదును.) ఇట్లీవృద్ధుడు విచారించి మరల సందేశము స్మృతికి రాగా ప్రత్యుత్తరార్థియై విశ్వామిత్రకుశధ్వజుల నెట్లు ప్రశ్నించెనో కనుంగొనుడు.

'రాక్షసః-అయి భోః కి మస్మాసు వః ప్రతివచనమ్.'

(ఓహోయి, మావిషయమై మీసమాధాన మేమి.) ప్రథమమున సందేశశ్రవణానంతర మెట్టియుత్తరమును చెప్పుటకు తోచని గాధేయుడీతరుణమున నెంత ప్రగల్భముగా వచించెనో యాలకింపుడు.

'అత్ర సీరధ్వజో వేత్తా కనిష్ఠోఽపి కుశధ్వజః,
అస్యాః పితా సకన్యాయాః కులజ్యేష్ఠః ప్రభుశ్చ సః.'

(మీప్రభువుచే నంపబడిన సందేశవిషయమై ప్రత్యుత్తరము నెఱింగినవాడు జనకమహారాజు; కుశధ్వజుడు చిన్నవాడుగదా. ఆజనకుడీకన్యకను పెంచినవాడు. కులముపెద్ద. ఈకన్యక నెవనికిచ్చుటకును ఇతడే

సమర్థుడు.) ఈసమయోచితసమాధానమున తృప్తినొందక సర్వమాయుం డనబరగు నీరాక్షసవృద్ధగోమాయువు మరల

'సోఽప్యాహ కుశధ్వజో జానాతి కౌశికశ్చేతి.'

(అతడును ఈవిషయమున తెలసినవారు కుశధ్వజకౌశికు లని చెప్పుచున్నవాడు.) వినవట్లు దీనికి మరల ఏమియు ప్రత్యుత్తరము నొసంగక చతురుండగు గాధిపుత్రుడు దివ్యాస్త్రదానప్రస్తావనామిషచే కాలవిలంబమును చేసియున్నవాడు. దివ్యాస్త్రదానానంతరము 'ప్రాదుర్భవతు తద్ధను' రిత్యాదివాక్యములచే శివధనుః ప్రస్తావన చేయబడినది. ఈమధ్య దివ్యాస్త్రజ్వలితతేజోవిరాజిత రామసాన్నిధ్యముచే తమను లక్ష్యపెట్టక తగుసమాధానమీయకుండుటచే గళితాభిమానుండగు నీనిశాటుండు ప్రకాశముగా కుశధ్వజుని గూర్చి

'రాక్షసః—ప్రభో, కుశధ్వజ, కియచ్చిరమనాదృతోఽస్మి'

(ప్రభువగు కుశధ్వజా, ఎంతయోసేపు నిరాదరింపబడినవాడ నగుచున్నాను.) మొట్టమొదట మహారాజగు రావణునిచేమాకు సందేశింపబడినదని సగర్వముగా బలికిన యీవృద్ధుని నోట నిప్పటి కిట్టివాక్యములు వెలువడుటకు కారణమును చదువరులే సులభముగా నూహింతురుగాక! ఈ ఈవృద్ధునిప్రశ్నకు మరల

'ఉక్తమేత త్సీరధ్వజో జానాతీతి.'

(జనకమహారాజు ఈ విషయమున తెలిసినవాడని చెప్పబడినది.) ఇట్లుత్తరమును చెప్పిన యీకుశధ్వజుడు ఇప్పటిలౌకికనీతిజ్ఞులకు ఆచార్యక మొనర్చుటకు యుక్తుడని తలంపవలసియున్నది. ఏతదనంతరము శివధనుర్భంజనము రామలక్ష్మణులకు సీతోర్మిళాదానము ప్రస్తావింపబడినవి. ఈసీతాదిదానానంతరము కుశధ్వజవిశ్వామిత్రసంభాషణ మెంతలోకానుసారియో నిరీక్షింపుడు.

'వి—సుష్ఠుతరం బహుమన్యామహే వక్తవ్యశేష స్త్వస్తి.'

(మిక్కిలి బాగుగా అనుమోదించుచున్నాము. కాని చెప్పదగినది కొంచెమున్నది.)

'రాజానవ్యాజ్ఞాపయ.'

(ఓమహానుభావా, ఆజ్ఞాపించుమా.)

'వి—దుహితరౌ మాండవీ శ్రుతకీర్తిశ్చ తేచ భరత శత్రుఘ్నాభ్యా మభ్యర్థయే.'

(ఆ నీకొమరితలగు మాండవీ శ్రుతకీర్తులను గూడ భరతశత్రుఘ్నులకొఱకు యాచించుచున్నవాడను.) విశ్వామిత్రు డిట్టిలౌకిక తంత్రజ్ఞుడుగానసే

'రాక్షసః—(స్వగతమ్) తపస్యతో వనేచరస్య సతః క్షత్రియకుటుంబవ్యైయాత్యం బ్రాహ్మణస్య.'

(తపస్సు నాచరించుచు వనచారియైయుండెడి బ్రాహ్మణునికిగూడ క్షత్రియకుటుంబవ్యవహారములయం దేమిదిట్టతనము) అని తలంచియున్నవాడు. ఇట్లు తన నభ్యర్థించిన కుశికజాతునిగూర్చి

'రాజా—కిమత్ర కించి ద్విచార్య మస్తి. కిం త్వత్ర వస్తుని పరవా నస్మి.'

(ఈవిషయమునకొంచమయినను విచారింపదగినది గలదా? కాని నే నిం దస్వాధీనుడను.)

'వి—కేన?'

(ఎవనిచేత?)

'రాజా—ఏకేన తావ ద్భగవతైవ.'

(మొదట పూజ్యుడవగు నీయొక్కనిచేతనే.)

'వి—అ థాన్యేన కేన.'

(పిమ్మట ఇంక నెవనిచేత?)

'రాజా—ఆర్యసీరధ్వజేన! గౌతమేన శతానందేన చ.'

(అన్నగారగు జనకునిచేతను గౌతమపుత్రుడగు శతానందమునిచేతను న్నూ.)

'వి—సీరధ్వజశతానందయో రహ మావేదయితా.'

(జనకశతానందులకు నే నీవిషయమున చెప్పగలను.) ఇట్లీపాత్రసంవిధానానంతరము భరతశత్రుఘ్నుల నుద్దేశించి కుశధ్వజపుత్రికాప్రతిపాదనంబును దశరథునిగూర్చి దూతప్రేషణయు వర్ణింపబడినవి. ఈసందర్భమున ముదితలగు సీతోర్మిళలయొక్క భావము లెంతసహజములో కనుంగొనుడు.

(భాయా) 'దిష్ట్యా; అవిప్రవాస ఇదానీం భగినీనాం భవిష్యతి.'

(సంతోషము. అక్కచెల్లెండ్రము మనకందరికి ఒక చోటనే నివాస మేర్పడగలదు.) నిసర్గానురక్తలగు అక్క చెల్లెండ్ర కింతకంటె నపేక్షణీయ మెద్ది? ఇటు పిమ్మట దుర్విదగ్ధనిర్విణ్ణరాక్షసపురోహితప్రలాప మనంతరము యజ్ఞదూషకమారీచసుబాహుప్రవేశ మటుపిమ్మట తన్నిధనోద్యుక్త రామలక్ష్మణోద్యోగవిశేషములు సూచితములై యంకసమాప్తి చేయబడినది. ఇందు మూలకథకు భిన్నముగా నౌచితి ననుసరించి భిన్నకాలాదులయం దొనర్పబడిన యహల్యాశాపమోచన తాటకావధదివ్యాస్త్రదానసుబాహుమారీచప్రవేశాదులకు ప్రయోజనం బును గ్రంథాధ్యేతలగు రసజ్ఞులే యూహింపగలరని పరిశిష్టాంకములనుగూడ మున్ముందు దిఙ్మాత్రముగా విమర్శించి పాఠకుల కందివ్వగలవాడను.

(సశేషము.)

---

## విరహవిధురుఁడు

'విధురుఁడు'

ఏమధుమాసచంద్రికల నీపరువెక్కిన యేలపాటలో
కోమల పుష్పమంజరుల గుచ్ఛకవుంగిటఁ దేలి సోలి యే
వో మధుగీతు లల్లుకొనిపోయెడి తుమ్మెద సోయగాలలో
నే మధురానుభూతియె రహించి దహించును ప్రేమవేదనన్.

తీయనిమల్లెపూవుల హృదిన్ జెలరేఁగి విదిల్చి హోరుననన్
పాయలుపాయలై పొరలి పారెడితావుల యేళ్లలోన, నో
ప్రేయసి! యెక్కడే యుకిరి బిక్కిరి; యొంటిగఁ బట్టుశయ్యపై
కాయముఁ వాల్చఁగానె, పెనుగాయము రేఁగిన మృత్యుబాధయా.

మదవతి! సాంధ్యహేమసుషమా తటినీ నవరోచి రూర్మికా
స్పదవియదుజ్జ్వలాబ్ధమృదు సైకతవేదులఁ గూరుచుండి, నిన్
వెదకెదు కాంతిగోళముల విచ్చినకోర్కుల బేలచూపులన్
జెదరి వెలుంగుచుక్కవలె నీ వెట నుందువొ చెప్పరాదటే?

చెలియా! యీసెలయేటియొడ్డుల, రచించెన్ మాధవ స్నిగ్ధుఁ డూ
యెలగాఁ బూచిన జాజితీవియల, నింకీవంకఁ గ్రొమ్మావిమో
కలఁ 'గూకూ' లను ముమ్మరించె బ్రదుకంగా విశ్వసౌందర్య సం
ప్రళయక్షోభలఁ దావు నిండుకొనె, చావంబోవ నే యాసనో?

ఆయతిలేపుతో బ్రదిమి నాఁచుకొలంది దురంతవిప్రలం
భాయతవేదనాభరిత యామిని నా కనునీట నాని పో
మోయఁగలేను; నాకనుల మూఁగిన దొంతరచింతలందు నో
తీయనిచూపుదాన! యొకతేప కనంబడరాదె జాలికేన్.

"సెలయేటి."

---

# మున్నంగి...శర్మగారి 'కృష్ణవేణి'

దింట్యాల సర్వేశ్వరుఁడుగారు

శ్రీయుతులు మున్నంగి...శర్మగారిచే రచియింపఁబడిన "కృష్ణవేణి" యనునవలను చూచితిని. కడముట్టఁ జదివితిని. అది నాహృదయముపైఁ గొంత పని చేయకపోలేదు. ఈనూతనయుగమున నవలలు వ్రాయుట యనునాగరికత ముదిరిపోయి వెనుకఁబడునట్టి స్థితిగూడ కలుగుచున్నది. ఇట్టి స్థితిలో నీనవల కేవలము వెనుకఁబడియున్నది. కథాసంవిధానమున కిందు ప్రాముఖ్యము నేపాత్రము నీయలేదు. రంగమున ప్రవేశము నందిన పాత్రము లన్నియు సరియగు నిర్వాహమునకు వచ్చియుండలేదు. మఱియు, పాత్రములకు సరియగు పరిష్కారము చేయలేదు. ప్రప్రథమమున ప్రదర్శించిన రంగరాయపాత్ర మెందులకో బోధపడుటలేదు. అతనికి నిర్వాహమున నెట్టిసంబంధము లేదు. కథ నారంభించువాఁడే తానై యెక్కువలక్ష్యముతో వర్ణింపఁబడి, కొంతకథలో పనిచేసి బంధము నేర్పరచుకొనియుండిన ఈ రంగరావువంటిపాత్ర మిట్లు నిరాధారముగ నిర్వాహము లేక యంతరించుట శోచనీయము.

మఱియు నీతఁడు ఏఅంతస్తునందలిమనుష్యుఁడో, యాతనిప్రవర్తనము, మనోభావము లెట్లుండవలయునో యనునంశములను గ్రంథకర్తగారు గమనించియుండలేదు. పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడు కాఁబోవువాఁడు "రిజర్వ్డ్"? "రెక్లస్" శ్రద్ధతోఁ జదువుచుండువాఁడు ఏస్థితిలో నుండవలయునో యట్లుంచక, యువతిపైపున చాంచల్యయుత దృష్టిని బఱుపఁజేసిరి. ఈతఁడు దుష్టుఁడో శిష్టుఁడో తెలియుటలేదు.

సూర్యనారాయణపాత్రము నేమియుఁ బోషింపలేదు. రంగారావువంటి పరాయివాఁడు కృష్ణవేణిని వెదుకుటకై యంతప్రయత్నింపఁగా నీతని కేమియు చీమ కుట్టదే! ఇంక నితరపాత్రములైనను తమతమయున్నతలను నిలఁబెట్టుకొనియుండలేదు.

## భాష

కవిరచనము గ్రాంథికము. పాత్రములు వాడుక భాషలో భాషించుచున్నవి. గ్రంథకర్తగారు ఆయా జిల్లాల వాడుకభాషల నుపయోగింపఁదలఁచిరి. కాని వారిస్వస్థానమగు ననంతపురంజిల్లాభాషను వాడఁగలిగినట్లు విశాఖపట్నంజిల్లాభాషను వాడలేకపోయిరి. గోదావరిజిల్లాభాషయందైనను స్వాభావికత మట్టుపడినది. తమకు స్వతస్సిద్ధముగ నున్న యనుప్రాసలాంపట్యమున నాచితిని, క్రమమును పాటింపక ప్రయోగములు గావించియున్నారు. ౩౭-వ పేజీలో "విరక్తులలో విలాసు లున్నారు. జువ్వాఖోర్లతో ఝూటాఖోర్లున్నారు. ధనికులతో దండుగమారిరాము లున్నారు." ఈమూఁడింటను, మధ్యమున్నవాక్యము పూర్వోత్తరములవంటి క్రమము నవలంబించినదా? ౩౮-వ పేజీలో "వంతపాటవము తప్పుటచే స్ఫుటము తప్పినది" అని యున్నది. ఈ స్ఫుటపదము గుణివాచకమైనది. ఇచట గుణవాచకము వలసినది.

## కథాసంవిధానము

"కంచము మార్చి మట్టెలు చేయుట"చే కథయంతయు ఖరాబైనది. "శ్రీశైలయాత్ర" అని వ్రాసిన నవల "కృష్ణవేణి" యగుటవలన, ఉభయతః భ్రంశము నందినది. "చల్దికన్న నూరుఁగాయ యెక్కువ" యైనట్లు ప్రధానకథకు కించిదుపకారకమగు శ్రీశైలయాత్రావర్ణనము పుస్తకమున నెక్కువభాగము నాక్రమించినది. మొదటనుండి యాఱుప్రకరణములు యాత్రాకథయే! మరల తొమ్మిదవప్రకరణము ప్రారంభమున కృష్ణవేణి పెట్టెను రైలులో రామచంద్రున కప్పగింతచేయించినను, కమ్మయువకునిచే కృష్ణాపత్రికఁ జదివించి శ్రీశైలమునే ప్రత్యక్షము చేయించినారు. ఆవార్తలలో శ్రీ

శైలమునందలి శిశువుమరణము, స్త్రీమరణములనుగూర్చి ఇనస్పెక్టరు నరసింగరావుగారు చేసిన యనుసంధానమును బ్రకటించుట యనవసరము. ఇది చాలక వారి సామర్థ్యప్రదర్శనమునకై కమ్మచౌదరికథను కల్పించుట యనవసర మైనదానిలో ననవసర మైనది. ఇవి ప్రధాన కథకు కించిత్తయిన నుపకరించవు. సాధారణసంవత్సరమునాఁటికి విధవావివాహము లింకను నాయకుల ప్రోత్సాహము లేక జరిగెడివి కావుగదా. అట్టిరోజులలో అందునను, స్త్రీయగు రంగనాయకమ్మ అంత స్వేచ్ఛగా భర్తతో విధవావివాహమునుగూర్చి పురికొల్పుట కేవల మసమంజసము.

కృష్ణవేణి యంతర్ధానము నొందుటకు ముందు వ్రాసి పుస్తకములో నుంచిన లేఖను బట్టి చూడఁగా, కృష్ణవేణి తప్పక శరీరత్యాగ మొనర్చియుండవలసినదే. గ్రంథము నంతటితో (రామచంద్రునియంతర్ధానముతో) పరిసమాప్తి చేసియుండిన నెంతో బాగుగ నుండెడిది. కాని యట్లు చేయక, మరల శెంగసూరున నీయిద్దరిని సమావేశపరచి పాఠకులను రంజింపఁజేయవలయునని "శర్మ" గారు ప్రయత్నించుట సుందరముగ లేదు. "ఎట్టిప్రేమ నైనను కొండెగాండ్రు విఘటన చేయఁగలరు. కావున, నిజ మరయనిచో, మననాయకులవలెనే యకారణముగ వినిపాతము నొందుదురు" అను నీతిని ఈ గ్రంథమునుండి నేర్వఁగలుగుదుము. ఇప్పు డేదియును గనుపడదు. కృష్ణవేణీ రామచంద్రులను గుఱించి, ప్రేమ విఫలమైనందులకు దుఃఖించుటయా ? సంసారబంధమును వదలి వైరాగ్యము నొందినందులకు సంతసించుటయా ?

కాలవిరోధములు

మొట్టమొదటిపంక్తి "సాధారణసంవత్సర మాఘ బహుళ సప్తమీ భానువారము..." అని యున్నది. అప్పటి పంచాంగము తీసి చూచినచో సప్తమి సోమవారమునాఁడై యున్నది. ఎత్తుగడలోనే తప్పు. "ప్రథమకబళే మక్షికాపాతః" అనునట్లు, దానికి సరియగు (తిథికి) క్రీస్తుశకపు తేది ౧౯౧౧ సం. రం ఫిబ్రవరి ౨౦ వ తేది యగుచున్నది. వారము ప్రధానము చేసుకొని లెక్కించినచో ముందు మూపు తేదీలకు ఒకటి తగ్గించుకొని చదువుకొనవలయును.

మన రంగారావు రైలులో నెక్కినవెంటనే ఆంగ్లమున నుండు "టాలుస్టాయి రిసరెక్షన్" తీసి చదువ నారంభించినాఁడఁట. వంధ్యాపుత్రుఁడు గగనకుసుమములు ధరించినట్లు, అసలు ఆగ్రంథము ఆంగ్లమున ననువదింపఁబడి ప్రథమముద్రణమును ౧౮౯౯ లో పొందినది. ౧౯౧౧ లో నాటిని కాగ్రంథమును మనశర్మగారు సంపాదించి పెట్టినారు. ఏమి సంభావ్యత ?

౨౧-వ తేది ఉదయము బయలుదేఱిన మన యాత్రికులు ౨౪-వ తేది సూర్యాస్తమయవేళకు శ్రీశైలమున దేవాలయ ముఖద్వారమునకు చేరినట్లు తేలుచున్నది. ఎట్లనఁగా — ౨౬వ తేది శివరాత్రి. ౨౭వ తేది ఉదయమునుండి శ్రీశైలక్షేత్రముననే యున్నట్లు ౨౦-వ పుట మొదలు ౨౯ వ పుటవఱకుఁ గల గ్రంథభాగముచే తేలుచున్నది. అంతకు ముందురాత్రి "ఆటుకులతో, మినపసున్నితో" క్షేత్రోపవాసము చేసినట్లు కనుపడుచున్నది. దీనికి కొన్నిపంక్తులు ముందు "సూర్యాస్తమయవేళకు రంగరావు, మీనాక్షమ్మయు దేవాలయ ముఖద్వారమున నడుగిడఁగల్గిరి" యని యున్నది. కావున నది తప్పక ౨౪ వ తేది సాయంకాల మగును. కాఁగా మార్కాపురము నుండి శ్రీశైలమునకు అయిదు రోజులు ప్రయాణముచేసినట్లు తేలుచున్నది. మనయాత్రికులు శివరాత్రియగు ౨౬-వ తేదినాఁడును, ఆమరుసటిదినమునను అచ్చటనే యున్నట్లు నాలు గైదు-ప్రకరణములచే తేలుచున్నది. అయిదవప్రకరణము చివర రంగారావు భీమప్పల సంభాషణలో మరునాఁటిమధ్యాహ్నము భోజనానంతరము ఇంటికి తిరుగునట్లుగా చెప్పించి యున్నారు. ౧౯౧౧ సం॥రము లీపుఇయర్ కాకపోవుటచే ఆఫిబ్రవరి ౨౮-వ తేదితో పూర్తియగును. కావున నీ రిచ్చటనుండి బయలుదేఱఁదలఁచినవేళ మార్చి ౧-వ తేది మధ్యాహ్నము అన్నమాట. మన సూర్యనారాయణ శివరాత్రి రేపనఁగా నాఁటిసాయంకాలము ౩½ గంటల బండిలో మార్కాపురంస్టేషనులో దిగినాఁడు. "శివరాత్రి మార్కాపురముననే గడచినది" అనుటచే ఇరువది

యారు ఇరువదిరేడు తేదీలు మార్కాపురముననే యున్నట్లు స్పష్టము. నాఁటికి నాలవదినము సాయం కాలమువఱకును అచ్చటనే వేచియున్నట్లు వ్రాయుచు న్నారు. నాలవదిన మనఁగా మార్చి ౨-వ తేది. నాఁటి రాత్రి ౯ గంటలు దాఁటె మనయాత్రికులు సూర్యనారా యణు కలసికొన్నారు. ఇప్పు డంతయు కలయ చూచి నచో ౧౫ రోజులలో శ్రీశైలమునుండి మార్కా పురము చేరినట్లు తేలుచున్నది.

మద్రాసులో రామచంద్రరావునకు బెజవాడ నుంచి సూర్యనారాయణ వ్రాసినజాబు, విశాఖపట్నం నుంచి రంగనాయకమ్మ వ్రాసినజాబును మార్చి ౨౬-వ తేదినాఁటి మధ్యాహ్నము అందినవి. నాఁడే అతఁడు "రేపు బయలుదేఱుదును" అని రంగనాయకమ్మకు వ్రాసినాఁడు. రామచంద్రరావు మనకు మంగళవారము నాఁటి యుదయము ౬ గంటలకు బెజవాడస్టేషను ప్లాటుఫారముమీఁద మెయిల్‌లో కనుపడినాఁడు. అప్పటి రైలులో "కమ్మయువకుఁడు కృష్ణాపత్రిక విజృంభించి చదువుచున్నాఁడు." ఇప్పుడు కొంత చర్చించి ముందు చూపినతేదీలు అవియే యేల కావల యునో నిర్ధరించుచున్నాము. ఆపత్రికలోనివార్తలలో ౨౧-వ తేదినాఁటి కలకత్తావార్తయొకటి కలదు. అం దుననే శ్రీశైలపువార్తలుకూడ కలవు. అందుచే నీ ౨౧ వ తేది శివరాత్రికి అవ్యవహితపరమగు మాసములోని దయి యుండవలెను. అనఁగా మార్చిమాసములోనిది. ౨౧-వ తేది ఫిబ్రవరిమాసములోనిది యేల కాదు? అని ప్రశ్న చేయరాదు. ఏలయన, పూర్వము నిర్ణయించిన రీతిని మార్చి రెండవతేదినాఁడు మనసూర్యనారాయణ మార్కాపురం సత్రములో సాధుటీవేషముతో నున్న ఇనస్పెక్టరు నరసింగరావుతో మాట్లాడి యున్నాఁడు. ఆ ఇనస్పెక్టరు ఆరాత్రి రైలులో ప్రయాణ ముచేసి, పాతాళగంగలో పడి చనిపోయిన శ్రీ అన్నగార్ల నిరువురను అరెస్టుచేసియున్నాఁడు. ఆవార్త యీపత్రికవల్లనే తెలియుచున్నది. కావున నిది ఫిబ్ర వరిమాసములోని పత్రిక కాదు. అందులో "ఈ నెల ౨౧ వ తేది" అనుటచే అది మార్చినెల యగుట స్పష్టము.

ఆతేదికి తర్వాత శనివారము ౨౧ వ తేదినాఁడు వచ్చి నది. కృష్ణాపత్రిక నాఁటిది. కావున మన రామచంద్ర రావు బెజవాడ ప్లాటుఫారముమీఁద కనుపడిన మంగళ వారము మార్చి ౨౦ వ తేదీయే తప్పక యగును. దీనిని బట్టి ఆముందుతేదీలును స్పష్టములు. ఇప్పుడు ఇక్కడ నేర్పడిన వైపరీత్యమును గమనింపుఁడు. ఏనాఁడో నెల దినములక్రింద శ్రీశైలమున జరిగిన వార్తలను ఈనాఁడు ప్రకటించుట యేమి? కలకత్తాలో నాలుగురోజులక్రింద జరిగినవార్తను నేఁడే ప్రకటించు టేమి? కృష్ణాపత్రిక కింతపక్షపాత మెందులకో? రామచంద్రునకు బెజవాడ నుండి వచ్చినలేఖ "కృష్ణవేణి అదృశ్యయైనది" అని సూర్య నారాయణ వ్రాసినదై యుండవలెను. అట్లే విశాఖపట్ట ణమునుండి వచ్చిన లేఖ కృష్ణవేణి యిచ్చట చేరినదని రంగనాయకమ్మ వ్రాసినది. ఇందులకు ఆలేఖలను చదువు చుండినప్పటి రామచంద్రునియందు చిత్రించిన భావములే సూచకములు. ఇరువదిరోజులకు పైఁబడి ఎన్నఁడో తప్పి పోయిన వ్యక్తినిగురించి ఇప్పుడా వాకబుచేయుట? ఈ పైయంశములచే ఈతేదీలను నిర్ణయించుకొనుటయందు శర్మగారు క్షమింపరాని పొరపాటు పడిరి.

రామచంద్రుఁడు విశాఖపట్టణమున నుండఁగా జరిగిన కథను తెలుపుటకై ౧౦-వ ప్రకరణము ఆరంభింపఁబడి నది. దీని ఎత్తుగడ "గురువారము సాయంకాలము" అని. ఈగురువారము ఏది? నాఁటి తేది యేమి? తిథి యేమ గును? అను నీయంశములను చర్చింతును. ఇది యాతఁడు విశాఖపట్టణమున ప్రవేశించిన మంగళవారమునాఁటికి మూఁడవనాఁడగు గురువారమే. ఏలయనః ఈతఁడును సోమసుందరమును కలసి కృష్ణమూర్తి యను నటుని యొద్దకుఁ బోయి యాతప్పుడులేఖను గురించి ప్రశ్నిం చుటలో నాతని ప్రత్యుత్తరమువలన తెలియును. నాటకము ఆదివారమునాఁటి రాత్రి జరిగినది. ఈతఁడు సోమవారము మధ్యాహ్నము నరసీపట్నము పోయి మం గళవారము, బుధవారము "పొలాలు గట్ర చూసుకొని", నేఁటిసాయంకాలము ఇచటికి చేరెను. అట్లే ౧౨౩ వ పుటలో కృష్ణవేణి చరమలేఖయందు "మంగళవా రమునాఁడు రైలునుంచి వచ్చి గుమ్మమున బండి దిగి

మేడముంగిట నుండిన సమఁ జూచినమాపులును, గురువార మునాయంకాలము శికారు తరలుచు......" అనుదానిచే నిర్ణయించి చూడఁగా, ఈరెండును ఒక సప్తాహములోనివే యని తేలుచున్నది. అగుటచే నిది యా మంగళవారమువాఁటికి మూఁడవనాఁడగు గురువారమే యనియు, తేది ౩౦ మార్చి ౧౯౧౧ సం॥రం అనియు, తిథి సాధారణసంవత్సర ఫాల్గుణ బ ౩౦ లు అనియు, నిరాఘాటముగ తేలినది. ఇప్పు డిచట వచ్చెడి విరోధములను గమనింపుఁడు. ౧౦౬ వ పుటలో ౧౧ వ ప్రకరణము ఆరంభమున "ఎనిమిదిగంటలు కావచ్చినది. సందె వెన్నెల మకమకలాడుచున్నది." ఆహాహా! కటికఅమావాస్యనాఁడు మనశర్మగారు వెన్నెలపంచిపెట్టుచున్నారే! మరియొకటి: ౧౦౫ వ పేజీలో సోమసుందరము మాటలలో "వట్టి అడవిమనిషిలా నున్నావు...ఇంకా దశమి నాలుగురోజు లున్నదిగా" అని వ్రాసినారు. ఈ కవి బ్రహ్మసృష్టిలో అమావాస్యకు నాలుగు రోజులలోనే దశమి వచ్చుచుండును కాఁబోలును!

## ఉపసంహారము

ఈనవల ౧౯౩౨ సంవత్సరమున నుండి, ౧౯౧౧ సం॥రమువాఁటి కథను వ్రాయుట. ప్రాఁతకాలపు పరిస్థితులను భావించి వ్రాయుట బహుదుస్తరమైనవిషయము. ఏలయన, నిత్యసన్నిహితములగు నాధునిక పరిస్థితులచే నాభావన లంతరింపఁజేయఁబడుచుండును. రచయిత ఎట్టి మఱుపు లేక జాగరూకుఁడై పోవుచుండవలయును. మనశర్మగారిట్టిసందర్భములలో నేకాగ్రత నిలుపలేకపోయిరి. రంగారావు బి. ఎ. చదువుచున్నానని చెప్పి యాపైని ఉద్యోగములు దొరక వనుసంగతులు చెప్పుటలో ౧౯౧౧ నాఁటి గాలి ఏమియు లేదు. నేమముల దిద్దుబాటు విషయమునఁ గూడ నట్లే. ఆకాలమున నిందుమీసములే ప్రేమింపఁబడుచుండెడివి. ఇప్పుడైనచో నరమీసములో, అసలు లేకపోవుటయో. ఇట్టి పొరపాటులు మిక్కిలి వచ్చుచుండును. అందుచే పాఁత కథలను వ్రాయఁబూనుటకన్న నెప్పటి కప్పుడు జరుగుచుండువట్లు కథలను వ్రాయుట మంచిది. ఈరీతిగా త్రవ్వినకొలఁది ఎన్నియో దొరకుచుండును. నవలవ్రాఁత యన్న సామాన్యము కాదు. ప్రస్తావనలో ప్రారంభమునఁనే "ఈనవలవ్రాఁత నాతొలిజతనము" అనినారు. "ప్రథమప్రయత్నమన్న సాధైనప్రయత్న మన్నమాట" అని సామగంటివారిసాక్షి. "సృష్టి రాద్యేవ ధాతుః" అని కాళిదాసు. ఇం దేది నిజమో?

"చెబితే నమ్ముతావో లేదో; సాధారణంగా ఎవ్వళ్లేవా ఏదేవా వ్రాసి పట్టుకొస్తారు, వినుపించడానికి. నీ వన్నట్టే చగ్గా విమర్శించమంటారు. విమర్శించామా, వాళ్ల కొక్కరకొరలు. మనదా పూరికే బుజ్జ పూసే మచ్చ కాదు. ఏదేనా తోచిందా, చీదాగా బద్దలేసి చెప్పవలసిందే! విన్నాడా సరే!—లేదా—వాడికర్మం."

('కృష్ణవేణి', ౧౦౨-వ పుట.)

౧

మందారము

చూశావా, పారిజాతం?

పారిజాతము

ఏమిటి ?

మందారము

నిన్నను ఇక్కడ లేదు; ఈరోజు పగలు ఇక్కడ లేదు; రాత్రి నిద్ర లేచి చూతునుగదా—

పారిజాతము

అవును. ఆడుకొనే రాక్షసుల పిల్లలు పడవేశారో, దేవతలు ఆసనశిలగా ఏర్పాటు చేసుకొన్నారో, గంధర్వకాంతలు లాక్షారేఖలు పాదములపై దిద్దుకోడానికి పాదపీఠముగా ఉంచుకొన్నారో దీనిని?

మందారము

అట్టి శిల కాదు, పారిజాతం, ఇది.

పారిజాతము

మనము నిద్రపోతున్నప్పుడు శిలావర్షం కురవలేదుగదా ?

మందారము

ఈ ప్రాంతమున ఈశిల ఒక్కటే కానవస్తున్నది, చూడు.

పారిజాతము

అట్లాగైతే సాహచర్యమును వదలి భూమి నాశ్రయించడానికి ఉల్కారూపమున దిగిన శిల కాదుగదా ఇది.

మందారము

ఇది అట్టిశిల కానేరదు, పారిజాతం!

పారిజాతము

భూకంపమువల్ల హిమగిరి ఊటాడి ఈశిల ఇక్కడికి విసరివేయ లేదుగదా ?

మందారము

లేదు లేదు. గండకీనదిలో పుట్టే సాలగ్రామ శోభ వచ్చింది దీనికి.

పారిజాతము

ఏమైనా ఈశిల మన సేవకు పాత్రమే ననిపిస్తోంది.

మందారము

అవును. ఈశిల శిల కానట్లున్నది. ఎవరో తెలుసుకోవాలి.

పారిజాతము

ఆసంగతి తెలుసుకోవడ మెంతసేపు. వాయువు మన ఆకులతో గుసగుసలాడినప్పుడు తెలుసుకోవచ్చును.

మందారము

దూరదేశసంచారులైన పక్షులపాటలలో ఆవార్త ఇమిడి ఉండవచ్చును.

పారిజాతము

మనపుష్పాల నాశ్రయించే తుమ్మెదల స్తోత్రపాఠముల కది లక్ష్యమై ఉండవచ్చు.

మందారము

ఆసంగతి కనుక్కొందాము.

పారిజాతము

ఆలాగే.

౨

గంధర్వుడు

దేవేంద్రుడు ఆనతిచ్చాడు, ఈలోకములో శిలలన్నీ పరీక్షించమని.

గంధర్వి

ఎందుకో?

గంధర్వుడు

తాను ప్రేమించినస్త్రీ గౌతమశాపమున శిలయైనదట—

గంధర్వి

పాపము!

గంధర్వుడు

ఏశిలలో నందనవనవాసనలు ఘుమ ఘుమలాడుచుంటవో, ఏశిలలో భయకంపితహృదయము తటతట కొట్టుకొంటూ ఉంటుందో,—

గంధర్వి

ఎంతటివెర్రి దేవేంద్రుడికి!

గంధర్వుడు

ఎందువల్ల?

గంధర్వి

శిలారూపము పొందినస్త్రీకి స్త్రీత్వలక్షణము లుంటవా, శిలాలక్షణము లుంటవా?

గంధర్వుడు

కాముకునిభ్రాంతి మన కీపని కల్పించిన దన్నమాట.

గంధర్వి

ఎన్నిశిలలు పరీక్షించావు ఇంతవరకు?

గంధర్వుడు

ఎన్నిశిలలని చెప్పను. అన్నీ ఒక్కమాదిరిగానే శిలాలక్షణములతోనే కనిపించినవి. పూర్వము స్త్రీరూపమున నున్న శిల ఇది అని ఎట్లా తెలుసుకోవడం నీవు చెప్పు.

గంధర్వి

నే నెన్నడైనా శిలారూపము ధరించి ఉన్నట్లయితే చెప్పిఉందును.

గంధర్వుడు

స్త్రీవి కాబట్టి ఆమాత్ర మూహించలేవా?

గంధర్వి

సుఖము దుఃఖముగా మారినది గదా, పాపము, అహల్యకు—పాపము చేసినందుకు ప్రతీకారము శిలారూపము గదా!

గంధర్వుడు

అయితే—

గంధర్వి

ఆశిలారూపములో పశ్చాత్తాపము చూడవచ్చును.

గంధర్వుడు

ఎట్లా?

గంధర్వి

చివరదాకా విను.

గంధర్వుడు

సరే.

గంధర్వి

పశ్చాత్తాపమునకు ఫల ముండవద్దా మరి: ఏమి టాఫలం?

గంధర్వుడు

పాపము తాళితము కాగా తిరిగి మానవజన్మ పొందడము.

గంధర్వి

ఎట్లా?

గంధర్వుడు

అది శాపములో ఒకభాగమే గదా!

గంధర్వి

ఏమి టది?

గంధర్వుడు

శ్రీ రామపాదస్పర్శవల్ల శిల మళ్లీ స్త్రీగా మా రగలదని.

గంధర్వి

కాబట్టి భవిష్యత్తులో తనకు కలగగల మేలుకు కారణభూతమయ్యే శ్రీరామ పాదస్పర్శకు ఏశిల మృదులమై వేచి ఉంటుందో ఆశిలను వెదుకుదాము పద.

గంధర్వుడు

అంతే కాకుండా ఇంకో విశేషంకూడా ఉండ వచ్చును.

గంధర్వి

ఏమి టది?

గంధర్వుడు

నైసర్గిక పరిణామమందు శిల స్త్రీగా మారడా నికి ఎన్నియుగములకాలమో పట్టునుగదా!

గంధర్వి

అవును.

గంధర్వుడు

శాపకారణమువల్ల నిసర్గమునకు వ్యతిరేకమైన కార్యము ఇప్పుడు ఒక్కక్షణములో జరిగినది.

గంధర్వి

జరిగితే?

గంధర్వుడు

ఈ విపరీత పరిణామ కార్యములో తదవస్థలు కొన్ని గోచరము కావచ్చునేమో?

గంధర్వి

దేవేంద్రు డున్న నందనవనవాసనలు మొదలై నవి చూడవచ్చుననా?

గంధర్వుడు

కాదు—ఆశిలలో కొంతవరకు మానవత్వము కొంతవరకు పశుత్వము, కొంతవరకు జడత్వము కానవచ్చునేమో?

గంధర్వి

చూద్దాము పద.

3

మందారము

విన్నావా, పారిజాతం?

పారిజాతము

ఏమిటి?

మందారము

గంధర్వులు శిలలు వెదుకుకొంటూ ఈ వైపుకు వస్తున్నారట.

పారిజాతము

ఎందుకో?

మందారము

అహల్య శిలగా మారినశిల ఏదైనదీ చూచి దేవేంద్రుడికి చెప్పడానికి.

పారిజాతము

ఎవరు చెప్పారు?

మందారము

నాకొమ్మలమీద విశ్రమించిన చిలకలు చెప్పు కొంటూంటే విన్నాను.

పారిజాతము

ఒకస్త్రీహృదయమును భగ్నముచేసి దానిజీవిత మునకు చిచ్చుపెట్టిన ఇంద్రున కెందు కీ తాపత్రయము.

మందారము

భగ్నప్రేమకు అశ్రుతర్పణము ఆశిలమీద విడుస్తాడు కాబోలు?

పారిజాతము

ఆశిలయందు తనప్రేమ కాస్పదమైనస్త్రీని ఆరో పించుకొని పూజిస్తాడేమో?

మందారము

శిలగా నున్నా ఆమెకు శాంతి లేదు కాబోలు ఈతనివల్ల!

పారిజాతము

తాను ప్రేమించిన లావణ్యము, సౌందర్యము, తారళ్యము, నర్మభాషలు, మందహాసములు శుద్ధజడరూపములో నున్న ఈశిలలో ఎట్లా చూస్తాడో ఈదేవేంద్రుడు? చిత్రం! తనకు జరిగిన పరాభవమైనా తలుచుకొన్నాడు కాదు కాబోలు!

మందారము

పాపము, ఈశిల ఎట్లా ఉన్నదో చూడు. దుఃఖమంతా ఘనీభవించి శిలాకారమున అవత రించిన ట్లున్నది.

పారిజాతము

పంకిలమైన దేహము పశ్చాత్తాపరేఖలతో శిలారూపము ధరించిన ట్లున్నది—మనపాదము లాశ్రయించినది, పాపము!

మందారము

చూడు, చూడు, ఎట్లు అది సంకోచవికోచ ములు చెందుతున్నదో.

పారిజాతము

దుఃఖముతో కుమిలిపోతున్నదా అన్నట్లు!

మందారము

దుర్భరదుఃఖముతో కాబోలు ప్రత్యణువూ కంపించిపోతున్న ఈశిల మనసేవకు పాత్రమే అనిపిస్తున్నది.

పారిజాతము

అదుగో గంధర్వుడూ గంధర్వీ వచ్చేశారు.

గంధర్వుడు

ఇక్కడోశిల ఉన్నది.

గంధర్వి

చూడు, చూడు, గంధర్వా, ఈశిల, పాపం

గంధర్వుడు

హృదయవేదన కాబోలు ఆస్పందనకు కారణము; దానిలో మనుష్యత్వము గోచరించడం లేదా ?

గంధర్వి

అది పశ్చాత్తాపము—స్త్రీత్వ మందులో గోచరిస్తోంది. ఆవైపు అణుస్పందన మెట్లా లయమవుతున్నదో !

గంధర్వుడు

మానవత్వము పోయి, పశుత్వము నశించి, శుద్ధ జడత్వస్థితి కొన్నాళ్లు అనుభవించడముకు సంసిద్ధమౌతూన్న ట్లుంది.

గంధర్వి

ఈజడత్వములో పరమార్థచింత ఇమిడి ఉండడము గొప్ప విశేషము.

గంధర్వుడు

ఇది జడత్వము కాదేమో అసలు ! శిలారూపమునుబట్టి జడత్వ మనుకోవలసినదే కాని అసలు ఈస్థితి నిత్యసమాధిస్థితి ఏమో ?

గంధర్వి

నీవు చెప్పినమాట నిజము కావచ్చు.

గంధర్వుడు

చూడు, గంధర్వీ,—పరిణామ మొందుచున్న ఈ శిలలో ఆ తారళ్య రేఖలు—అవి నేత్రాణువులు కాబోలు ! ఆమార్దవ చిహ్నాలు—అవి దేహాణువులు కాబోలు ; ఆ తళ్కులు—అవి మందహాసరోచులు వెదజల్లే వక్త్రాణువులు కాబోలు ; ఆసౌరభము, అనైల్యము, ఆసౌందర్యము, ఆసౌవర్ణ్యము, ఆఆకర్షణము—ఆమె దేహమందలి ప్రత్యణువూ ఆశిలారూపములో ప్రతిబింబిస్తూన్న ట్లున్నది.

గంధర్వి

ఆశిలలో లే వవి ; నీకళ్లలో ఉన్నవి—కాముకుడవు కాబట్టి.

గంధర్వుడు

కాదు గంధర్వీ, నీలావణ్యాను లే ఆశిలలో ఉండ చూచుకొంటున్నాను.

గంధర్వి

ఇక్కడిక ఉండరాదు, పద, దేవేంద్రుడితో చెప్పుదాము పద.

గంధర్వుడు

హృదయమును నీరు చేస్తూన్న ఈశిలను చూస్తే జాలి పుట్టుతోంది.

గంధర్వి

పద, వెళదాము, పద—రా, గంధర్వా, రా.

౪

దేవేంద్రుడు

నాఅహల్యకు శరణిచ్చినవట మందారపారిజాతాలు—అవి ఎక్కడో ? ఆశిలను నేను గుర్తించగలనా ?

ఇదిగో మందారము, ఇదిగో పారిజాతము—ఇదా ఆశిల—నాఅహల్య ! పాప మివి అప్పుడే ఈశిలను తమపువ్వులతో పూజించి నాకృతజ్ఞతకు పాత్రమైనవి.

ఈశిలా నాఅహల్య? ప్రేమాంకూరాలు పుట్టడానికి పాదైన ఆహృదయ మేదీ? ఈ తట తట కొట్టుకొంటూఉన్న భాగమా? అమృత నిష్యందమగు అధరమా జేగురురంగుతో ఈ మూల నున్న నున్నని గుండ్రని భాగము? గాఢాశ్లేషణశీలములగు బాహువులా ఈ మృదుల శిలాభాగమందలి ఈపచ్చనిజీరలు? ఆమదిరాక్షి నేత్రముల తళ్కులా ఈస్ఫటికా కృతి నున్న ఈమూలశిలాభాగము?—ఈ వైపున నున్న సువర్ణచ్ఛాయ కాబోలు ఆమె దేహచ్ఛాయ—ఈ శిలేనా నాఅహల్య! అయ్యో, నాఅహల్యకు ఎంతటిఅవస్థ పట్టింది!

ఔరా! ఈశిల నన్ను చూచి ఎట్లా కదిలిపోతోందో! దారుణప్రయత్నము చేసి, తననోటితో నన్ను పిలిచి, తనబాహువులతో నన్ను కట్టివేసికొని నన్ను తనలో ఐక్యము చేసుకోవాలని ప్రయత్నము కాబోలు—వ్యర్థ ప్రయత్నము! ప్రేమసామ్రాజ్య పట్టభద్రతకు సోపానాలు కట్టిన నా అహల్య ఇప్పుడు చేత నారహితయై నాకు స్వాగతమైనా చెప్పలేకుం డా ఉందా!

అహల్యా, అహల్యా! ఒక్కమారు నా పిలుపుకు మారు పలుకవూ?—ఈశిలకు స్పంద నము అధికమౌతూ ఉన్నది. నాతో మాట్లాడు టకు కాబోలు ప్రయత్నిస్తోంది. నీకనునయము కల్పించడానికి వచ్చాను అహల్యా, ఒక్క మాట మాట్లాడవా— ఆశిలలోనుంచి శబ్దము వస్తూ ఉన్నట్లుంది. జాగ్రత్తగా వింటాను—

శిల

(శబ్దము.)

దేవేంద్రుడు

ఏదో శబ్దమే అది—అహల్యా, నామాట విని పిస్తోందా? నాకు ప్రత్యుత్తరము చెప్పతావా? మనమనదుఃఖములు ఒకరితో ఒకరము వెళ్ల బోసుకొని దుఃఖోపశమనము పొందుదామా? మాట్లాడు, అహల్యా, జాగ్రత్తగా వింటాను, మాట్లాడు.

శిల

(శబ్దము.)

దేవేంద్రుడు

ఆశబ్దము ఏమై ఉంటుంది? అది ప్రణవము వలె ఉన్నది—తప్పు విన్నానేమో? దేవేం ద్రుడా అని పిలిచిందేమో; మళ్లీ వింటాను.

శిల

(శబ్దము.)

దేవేంద్రుడు

అది నన్ను పిలిచిన పిలుపు కానట్లుంది. అది ఇంద్ర శబ్దము కానట్లుంది. అది ప్రణ వమో—లేక—రామ శబ్దోచ్చారణమో?— నన్ను నా అహల్య గుర్తించలేదేమో? అహ ల్యా, నేను దేవేంద్రుడను, నీకోసం చూడు, ఈ నందనవన కుసుమములు తెచ్చాను! చూడు, వీటితో నిన్నలంకరిస్తున్నాను—నేను ఇంద్రు డనే అహల్యా. శ్రీకారాకారముగా స్పం దిస్తున్న ఆ నీశ్రోత్రాణువులతో నామాట లా లకిస్తున్నావా, అహల్యా, ఆలకిస్తున్నావా?

శిల

(శబ్దము.)

దేవేంద్రుడు

మళ్లీ ఆశబ్దమే వినిపిస్తోంది. ఆమె ఆలకించడం లేదు. అది ప్రణవమూ రామశబ్దమూ మిళిత మై కలిగినధ్వని,—ఈసీనునిపై అహల్యకు కోపము వచ్చింది శాబోలు. ఆమెప్రేమకు పాత్రమయ్యే విధ మేమిటి? అహల్యా, నీ కోసం వచ్చాను; నీవిచారాన్ని నేను తీసుకొని అనుభవించవలెనని వచ్చాను; నీకు అనునయము కల్పించడానికి వచ్చాను; నాతో మాట్లాడవా?

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

రామశబ్దోచ్చారణమే అది. ఈశిల అణువులన్నీ తమస్పందనములను ఏకముఖము చేసికొని రామశబ్దమును పలుకుచున్నవి. ఇంక నా కేమిగతి? అహల్యా, నామాట వినవూ?

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

అహల్యా, ఏ కాకినై దుఃఖముతో ఇట్లా కుమిలిపోవలసిందేనా నేను? నీవు శిలగా ఉన్నా నిన్ను నా అహల్యగానే భావించి పూజించ దలుచుకొన్నాను, అహల్యా; నా నందనవన మంతా నీపాదాక్రాంతము చేస్తా; నా ఐరావతమును నీకు కావలి ఉంచుతా; నాస్వర్గమును ఇక్కడికి తీసుకువచ్చి నీకు పరిచర్య చేయిస్తా, అహల్యా, మాటాడవూ?

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

ఈ శిలలో అణువులన్నీ ఏకాగ్రమై ఒక్క రామశబ్దమును పుట్టించుటయందే లగ్నమైన ట్లున్నది! ఎప్పటికైనా నన్నుద్దేశించి పలుకుతుందేమో ఈశిల—ఓపికతో కూర్చుంటాను.

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

చేతనా రహితమా ఈశిల?—కాన ట్లీకంపమే సాక్షి..జ్ఞానరహితమా? అయితే ఈరామ శబ్దం ఎట్లా పుట్టింది? ఎంత విన్నా నాపేరు వినిపించడం లేదు. ఎంత పిలిచినా పలకడం లేదు. ఇంక ఈమెను ఎంత వేడినా లాభము లే దనిపిస్తోంది.

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

ఆశ్చర్యము—ఈ శిలతో కూడా ఈ మందారమూ ఈ పారిజాతమూకూడా స్పందించి రామ శబ్దము కలిగిస్తున్నవి.

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

ఈ చిలకలూ, ఈ కోయిలలూ, ఈ పక్షులన్నీ కూడా రామనామమును పాడుతున్నవి. వాయువీ వృక్ష శాఖలలో దూరి రామనామమునే పుట్టిస్తూ ఉంది! అహల్యా, నాకు నీవు దిక్కు కాదా? నాతో మాట్లాడవా?

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

శిల నాతో మాట్లాడుతుం దనే భ్రాంతితో రావడము నాదే తప్పు—ఈ శిల నా అహల్య కాదు! అయితే మాట్లాడే ఉండును—ఈ ఒక్కమారూ చూస్తాను, పోనీ మాట్లాడుతుం దేమో; అహల్యా!

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

ఇక ఇక్కడ నిలిస్తే నాకూ రామశబ్దోచ్చారణ చెయ్య బుద్ధి పుట్టుతోంది. స్మృతిపథమున అహల్యను నిర్మించుకొని కొలుస్తూ ఉంటాను; అదే నా కనునయ మిస్తుంది — వెడతా అహల్యా!

శిల

రా......................మ్.

దేవేంద్రుడు

మళ్లీ రామశబ్దమే! నా అన్ని ప్రశ్నలకూ రామశబ్దమే ప్రత్యుత్తర మవుతున్నది—నేను వెళ్లిపోవడమే మంచిది!

శిల

రా......................మ్.

మందారము

దేవేంద్రుడు వెళ్లాడు—వట్టి కాముకుడు!

పారిజాతము

పాపం, ఈ శిలకు మన ఆకులే చలువ కల్పించవలెను కాబోలు.

మందారము

మన రెమ్మలతో దానిని నిమిరి దానికి అనునయము కల్పించవలెను.

శిల

రా......................మ్.

పారిజాతము

మనపక్షులు పాటలు పాడి దుఃఖోపశమనము చెయ్యవలెను.

మందారము

మనపువ్వులు తమసౌరభాలను కలుపుకొని భవిష్యత్తులో దానికి ఆశ కల్పించవలెను.

శిల

రా......................మ్.

పారిజాతము

నిత్యమూ ఈశిలనుండి పుట్టే రామనామము వల్ల మన ప్రాంతమంతా పునీత మౌతుంది.

మందారము

అంతే కాదు; భవిష్యత్తులో మనకు శ్రీరామదర్శనమే లభించబోతోంది, ఈశిల ప్రభావము వల్ల.

శిల

రా......................మ్.

పారిజాతము

అప్పుడు మనకు మనపుష్పములద్వారా రామ పాదస్పర్శ అనే మహాభాగ్యం తటస్థిస్తుంది— అంతకన్న కావలసిన దేమి!

శిల

రా......................మ్.

మందారము

శిల ఎట్లా రామనామం పలుకుతోందో!

పారిజాతము

మనకు మాత్రం ఈమాట లెందుకు? మన మూ ఆపనే చేద్దాము.

శిల

రా......................మ్.

మందారము

రా......................మ్.

పారిజాతము

రా......................మ్.

శిల

రా......................మ్.

---

## గ్రీష్మ ఋతువు

విద్వాన్ అల్లూరి వేంకటసీతమ్మగారు

పూర్వపుమైత్రి జీవులకు బోధవమొనర్పగ నగ్నివాయు లీ
యుర్విని జీవరాశి తల లూపగజేయు తలంపుతోడ నా
శరుగ్వనికంటిమంటవలె సర్వము గాల్పగ వేడిగాల్పులన్
బర్వగజేసినేమొ బలభద్రదహుతాశను లుగ్రమూర్తులై.

పడమరగాలి వీచె నొకపట్టున బెట్టుగ తాపతప్తమై
మడుగులు నిర్కబారె గరిమంబును వీడె సరోజషండ మా
మొడనెడ నెండమావు లిల నేత్రుల దోచెను వేడిగాడ్పు చే
గడగడలాడె గ్రీష్మఋతుకాలమహాత్వ మదెట్టిదోకదా.

---

# తగిలినవేలికే తగులుతుంది

వేలాల సుబ్బారావుగారు, బి. ఏ.,

(మొదటిభాగం)

"కొన్నికొన్నిచోట్ల జవాబుదారీ గల అధికారులు కొందరు తమయధికారాన్ని దుర్వినియోగంచేసి దొరతనమువారికిగూడా అపకీర్తి గలిగిస్తూ ఉంటారు. అట్టివారిని కఠినదండనలకు లోను చేయక పోయినయెడల లోకులకు సర్కారుపైగల విశ్వాసము, సదభిప్రాయము తప్పుట సహజము. ప్రస్తుతపుకేసుకు సంబంధించిన ఈదోషి ఒకజవాబుదారీగల పోలీసు సార్జెంటుపదమున ఉండియును తనకర్తవ్యమును పాలింపక పోవుటే కాక తన కెంతమాత్రము సంబంధము లేని యొకవ్యవహారంలో జోక్యం కలిగించుకొని చివరకు రెండుప్రాణాలకు అపాయకారకుడైనాడు. ఆప్రాణాలను దీయవలెనని ఇతనిఅభిప్రాయం కాకపోవచ్చు. కాని ఇతడు చేసిన అవివేకపు పనివలననే వాటిరెంటికి నష్టం కలిగింది. స్వకర్తవ్యచ్యుతుడై ఇట్టినేరం చేసినందులకు గాను ఇతనికి రెండుసంవత్సరాలు కఠినశిక్ష విధింపడమైనది. ఇతనిబుద్ధిహీనతవల్ల గలిగిన అనర్థానికి ప్రతిఫలంగా ఇతడే శిక్షను అనుభవింపవలసింది కాని ఇతరులు కారు. కాబట్టి ఇతడు చెరసాలలో ఉన్నంత కాలం ఇతనికుటుంబనిర్వాహార్థం ఏకొంత సహాయం చేయుటకుగాను దొరతనమువారికి సిఫార్సుచేస్తున్నాను."

అని జిల్లామేజస్ట్రేటుగారితీర్మానంలోని అంతిమ వాక్యాలను వినంగానే నాకు అపరిమితానందం అయిపోయింది. తాత్కాలికంగా ధర్మానికి అపజయం కలిగినప్పటికి చిట్టచివర కదే గెలుస్తుందని నిశ్చయపరచుకొన్నాను. న్యాయస్వరూపుడైన పరమాత్మ అత్యాచారాన్ని ఎంతకాలమని సహింపకలడు? అని అనుకొన్నాను. పోలీసుసార్జెంట్ యేమిటి? అధికారదుర్వినియోగం ఏమిటి? జిల్లామేజస్ట్రేటేమిటి? ఈతీర్మానం ఏమిటి? ధర్మాధర్మాల జయాపజయాలేమిటి?—అంటారా? వినండి చెబుతాను.

## ౧

బెజవాడా-గుంతకల్లు రైల్వేలైనుమీద వినుకొండ, దొనకొండస్టేషన్లమధ్య కురిచేడు అనేస్టేషన్ ఉంది. ఉత్తరాది ఇలాకాలనుంచి శ్రీశైలానికి యాత్రీకులనేకులు ఇక్కణ్ణుంచికూడా దిగిపోతూవుంటారు. ఈ స్టేషన్‌కు ఎదురుగా సుమారు నాలుగుమైళ్లదూరంలో చిన్నకొండలవరుస తూర్పుపడమరలుగా వ్యాపించివుంది. ఈవరుసలోని కొండలన్నీ చిట్టడవులతో నిండి వర్షాకాలంలో, ముఖ్యంగా ప్రాతఃసాయంకాలములందు—ఆకాశం లంబమానవర్షోన్ముఖమేఘాక్రాంతమై ఉన్నపుడు—చూడడానికి మిక్కిలి సుందరంగా ఉంటాయి. స్టేషనుకు సూటిగా ఎదురుగా వున్నకొండను డొంకమార్గాన్నే ఎక్కి అవతలి వేపు దిగి మరినాలుగుమైళ్లు నడిచిపోయినామంటే గుండ్లకమ్మ అనేచిన్ననది అడ్డంగా వస్తుంది. దీన్ని దాటి అవతలిఒడ్డు ఎక్కంగానే తగులుతుంది ముసిపేముల అనే ఒకచిన్నగ్రామం. ఈగ్రామపుపరిసరాలే ఈకథాప్రథమభాగానికి రంగస్థలాలు. గ్రామానికి పడమట మైలు-ముప్పాతిక మైలు దూరంలో గ్రామజీవనానికంతా ముఖ్యాధారమైన ఒక సాధారణపు చెరువు వుంది. అవ్వూరికీ చెరువుకూ మధ్య ఉండే మైదానమంతా ఆచెరువునీటివల్ల సాగయ్యే పల్లపుపొలాలే. చెరువు సరిగా రెండుపర్యాయాలు నిండిందా అంటే ఒకకారు రాగిపంట నిరభ్యంతరంగా పండుతుంది. ఇటువేపు రాగి, జొన్న, సజ్జ గ్రామీణుల ముఖ్యాహారం. వీటినే చెరువులక్రిందా, వాగులఒడ్డున వున్న పొలాల్లో వేసుకొంటూవుంటారు సాధారణపు చెరువుల్లోని నీరు వరిపంటకు చాలదు. ఈగ్రామంలోగుండా వచ్చిన డొంకబాట ఒకటి చెరువుకిందిపొలాలకు దక్షిణపశ్చిమంగా ప్రాకి చెరువుకు ప్రక్కగుండా అక్కడికి రమారమి అయిదారుమైళ్లదూరంలో వున్న త్రిపు

రాంతక మనే మరొక గ్రామానికి పోతుంది. ఇటువేపు శ్రీశైలయాత్రీకులకు తగిలే పెద్దగ్రామాల్లో త్రిపురాంతకంగూడా వకటి. ఇక్కడా ఒకపెద్దచెరువు దాన్ని ఆనుకొని ఒకప్రక్క త్రిపురాంతకేశ్వరుని ఆలయం మొదలైనవి ఉన్నాయి. తైర్థికులు తటాకజలావగాహన మాడి మహాదేవుని దర్శించుకొని పోతూవుంటారు. అదికాక ఇటువేపుల కంతా ఒకమాదిరిగ్రామమ్మ అవడంవల్ల సర్కారునౌకర్లు వచ్చినా అక్కడే మకాంవేస్తూవుంటారు.

ముడివేముల ఒక క్షుద్రగ్రామం. ఈ విశేషణం దీనికి ఒక్కదానికే కాదు సుమండీ! ఈ ప్రాంతంలో వున్న గ్రామాల కన్నిటికీ అన్వయిస్తుంది. అన్నింటికీ అంటే మళ్లీ ఎన్నో గ్రామా లున్నాయనికూడా అనుకో వద్దు. ప్రతియేటా పంట పండుతుందనే నిశ్చయం లేక పోవడంచేత ఇటువేపు జనులే తక్కువ. జనులనుబట్టే గ్రామాలూనూ. నేలలు సారవంతమైనవే కాని ఏంలాభం? వానలు పూజ్యం. నదులను వాగులనూ బంధించి కాలువలను తీయించడానికి భూమి సమమైంది కాదు. చిట్టడవులు, తిప్పలు, కొండలు, ఎగుడుదిగుడు నేలలు, నడుమ నడుమ కొండవాగులు. ఒక్క ఇరవై మైళ్లకాల్వ వేయించాలంటే ఎన్ని వియాడక్టుల, ఎన్ని ఎక్విడక్టుల కట్టించాలో తెలియదు. కనీసపక్షం మైలు కొక అక్విడక్టో లేక వియాడక్టో లేక రెండింటినో కట్టించి తీరాలి. ఇక లాకులకు లెక్క ఉండదు. ఎన్నికొండలు తొలిచి సొరంగాలను నిర్మించాలో తెలియదు. ఇక కాల్వ త్రవ్వడానికి నేలయొక్క స్వభావం చూస్తామా అంటే రాళ్లమయం. రాళ్లంటే ఇన్నీ అన్నీ అని కాదు. అనంతాలు. పలుసురాళ్లు, సుద్దరాళ్లు, గులకరాళ్లు, మరసరాళ్లు, నల్లరాళ్లు, నాపరాళ్లు, సుంద్రాళ్లు, ఓ, రాళ్లే రాళ్లు—నేలపైన రాళ్లు, దున్నితే రాళ్లు, త్రవ్వితే రాళ్లు. అడవులన్నీ రాళ్లు, కొండలన్నీ రాళ్లు, వాగులన్నీ రాళ్లు, డొంకలన్నీ రాళ్లు, వంకలన్నీ రాళ్లు—నేల అడుగడుగునా రాళ్లను ఈనుతుందా అనిపిస్తుంది. దైవానుగ్రహంవల్ల కావలసినవర్షం కుర్సిందా అంటె చాలు, ఈరాళ్లలోనుంచే పెకలించుకొని మొలుచుకొస్తాయి మరకతాలవంటి నానావిధవనస్పతులూ, పచ్చనిపైర్లూ, ప్రశస్తమైనశాకాలూనూ. కాని ఒక్కొక్కమారు ఏళ్లపర్యంతం ఎగేస్తుంటాయి వానలు. రావణుడు తన చెల్లెలు చుప్పనాతికి పసుపుకుంకుమక్రింద ఇచ్చాడని అంటూఉంటారు పెద్దలందరూ ఈ ప్రాంతాలనీ. రాక్షసులరాజ్యకాలంలో యజ్ఞయాగాదులు లేకపోయినప్పటికీ రావణుడిభయంచేత ఏమైనా కురిపిస్తూ వచ్చాడేమో వర్షాలను కాని ప్రస్తుతం ఆంగ్లేయుల రాజ్యకాలంలో ఆలాటిభయ మేమీ లేకపోబట్టి కాబోలు ఇంద్రభగవానుడు అటువైపు మొగమైనా చూపించడు కొన్నిఏళ్లపర్యంతం ఇప్పుడు. ఏకారణమైనా కానీండి! అక్కడివాళ్ల తలరాత అనండి! వర్షత్రయానావృష్టి దేశాన్నంతటినీ భస్మీభూతం చేసి, జనులందరినీ గగ్గోలుపరచి, తహతహ లాడించి, ఏడ్పించి, నిర్భాగ్యుల ననేకులను అకాలంలోనే పరలోకసనాథ స్వాగతాలకు అభ్యాగతుల గావించింది. చిట్టచివరకు బ్రదికున్నవారి పుణ్యప్రతాపాన్ని నాలుగోఏడు కుంభవర్షం కురిసి నదులు వాగులు పొంగిపోయినాయి. చెరువులు కుంటలు ఏకమైనాయి. వట్టిపోయిన బావులు జలమయమైపోయినాయి. యమునిదగ్గరనుండివచ్చిన బలవంతపు ఆహ్వానాలను తప్పించుకోలేక స్వీకరించి ప్రయాణాలకు సిద్ధంగావున్న దౌర్భాగ్యులందరూ తాము దీసికొన్న ప్యాసుపోర్టులను ఆప్రవాహాల్లో కలిపారు. ఏప్రకారంగానో అష్టకష్టాలుపడి చెరువుక్రింది పొలాలనన్నింటిని దున్ని బాగుచేసికొని రాగిపైరు వేశారు. రెండునెల్లకు పైగా గడిచిపోయింది. మూడేండ్ల పర్యంతం భూమి బీడుపడివుండడంచేత కాబోలు పైరు నవనవలాడుతూ మహాజబురుగా ఎక్కివచ్చింది. గుబురులుగా పెరిగిన దుబ్బుమొక్కలే కాని ఒంటిమొక్క చాలా తక్కువ. ఎటు జూచినా మోకాలిబంటి పచ్చనిపైరు గాల్లో లహలహలాడుతూ తరంగాలు కల్పిస్తూ ఊగుతూవుంది. పిల్లలూ, పెద్దలు, యువతీయువకులు, వీళ్లు వాళ్లేమిటి, పొలాల్లో పనిపాటలు వున్నవాళ్లంతా చెరువుక్రిందికి వెళ్లారు. సాయంకాలం నాలుగుగంటలు దాటి ఉండవచ్చును. పడమట మబ్బు పట్టి ఉండడం

చేత ఎండ చల్లబడింది. రండి, మనంకూడా ఒకమా రీచెరువుగట్టుమీదికి వెళ్లి వద్దాం.

అదుగో! కొక్కెంచులకు ముళ్లు పెట్టి కట్టిన పొడు గుపాటితో లెసంచులు వీపులమీదా, ప్రక్కలగుండా వ్రేలాడుతూవుంటే వంగి కొందరును, వెనక చేలమీద ఈడ్చుకొంటూ కొందరునూ, మూపోని కొందరును కృషకవనితలు తమతమ పొలాల్లో, మళ్లగట్లమీదా కలుపుగడ్డిని దీసి ఒళ్లను నింపుకొంటూ ఉన్నారు. వహవ్వా! ఈకోపుపిల్ల యెంతవయ్యారంగా వంగి గడ్డి కోస్తూందో! అదిగో ఆఅమ్మాయి ఏవో మూవరాగాలు తీస్తూ గడ్డిని దోకి రుఘాటిస్తూఉంది. అదో! పారలు చేత పుచ్చుకొని మళ్లకు నీళ్లు కడుతున్నారు—ఆ కృష కులు. అబ్బా! వీళ్లనోటివెంట శుద్ధసంస్కృతంతప్ప వేరేవిధమైన భాష రాదే. ముద్దుకు గాని, మురిపానికి గాని, ఎగతాళికి గాని, నవ్వులాటకు గాని మోటుమాట లేకుండా వీరు మాట్లాడనే లేరు. అందులోనూ ఎంత గాఢమైన ప్రేమను, ఎంత ఎక్కువసరసాన్ని చూపింపాలో అంత ఎక్కువ మోటువాక్యాలనుగూడా ఉప యోగించాలి. ఉప్పులేని చప్పని కూరలాగు మోటు మాట లేనివాక్యం వీరికి రుచింపనే రుచింపదు...వదు స్తూవుండండి. ఆగడం ఎందుకూ మధ్య మధ్య. అదుగో ఆప్రక్కనున్న బీళ్లలో పశువులు మహాఆప్యాయనంగా మేస్తున్నాయి. వాటిని కాయడానికి వచ్చిన ఈపిల్ల కాయలు వాటిధ్యానమైనా లేక మరోవేపు బిళ్లంగోడా టలో కేరింతలుకొడుతున్నారు. అది కనిపట్టి ఒకదొంగ గొడ్డు మళ్లోకి జారాలినని మెల్ల మెల్లగా తారట్లాడుతూ వుంది. ఇదో! ఈవేపు చూశారూ! ఈఆవు ముద్దులు మూటకడుతో ఎంతముచ్చటగా వుందో! మెళ్లో గంట, గజ్జెలమాల! వంటినిండా పసుపు, మొహాన కుంకం. పొద్దుత్తు వందిని లాగున్నది. ఆకుర్రవాడెవరో దాని దగ్గర. వాడే బిళ్లగోడాటలో పాలుగొనక ఆవుమెడను రాస్తూ కూర్చున్నాడు. అది మహానందంతో నెమరువే స్తూంది. సంతృప్తి, సంతోషాలు మూర్తీభవించినట్లా గుంది దానిమొహం చూస్తే......కాస్తంత నిలవండి...

ఎవరబ్బా! వీళ్లు... మనవెనకాల మన మెచ్చిన బాట వెంటే ఇంతమంది పెద్దగుంపుగా వస్తున్నారూ.......

ఊహూఁ! తెలిసింది తెల్సింది. ఎవరో అను కొన్నా. మన తహశీల్ దొరే. వెంట మామూలు సిబ్బం దిని పెట్టుకొని వస్తున్నారు. ఇద్దరు పోలీసుజవాన్లు, ఇద్దరు బిళ్లబంట్రోతులు, మునసబుకరణాలు, మరికొంద రు మహాజనులు, త్రిపురాంతకపు పోలీసుసార్జెంటు— ఇత్యాదు లున్నట్టున్నారు.

అదుగో! మననందిని దగ్గరకు వచ్చి ఆగారు. ఏదో ప్రసంగిస్తూఉన్నారు. వినండి! సావధానంగా...

తహ—కరణంగారూ! లోకమంతా ఒక విచి త్రం—అందులో జరిగేవన్నీ అంతకంటే విచిత్రాలూ.

కర—చిత్తం! సెలవియ్యండి!

తహ—ఏముందీ! ఏవస్తువుకోసం మనం ప్రార్థేయ పడి ఎప్పుడు వెదుకుతామో అప్పుడావస్తువు దొరకదు.

కర—చిత్తం. అంతేనండి!

తహ—వెయ్యిప్రయత్నాలు చేసినా సరే అవన్నీ వ్యర్థమౌతాయి.

కర—చిత్తం! ప్రాప్తి లేకుంటే అంతేనండి.

తహ—కాని...అదే వస్తువు ఒకొక్కప్పుడు— ఆసమయవిశేష మేమిటో కాని......అప్రయత్నంగా, అకస్మాత్తుగా తానంతట అదే మనముందు వచ్చి పడుతుంది.

కర—మనకు దాని అవసరం తీరి అక్కర లేనప్పుడు...

తహ—ఊహూఁ! అది కాదు. అప్రయత్నంగా దొరకడాన్ని గురించి చెబుతున్నాను.

కర—చిత్తం.

తహ—ఇదివరకు మూడువాల్లు సెలలక్రింద ఆవు ఎక్కడైనా దొరికితే తీసుకొందామని శతవిధాల ప్రయత్నం చేయించాను. కాని మనకుకు వచ్చింది

దొరికిందే కాదు—కరణంగారూ! ఆ పూర్ణచ్చన్నగోవు ఎవరిదండీ? ఆపిల్లవాడెవరు దానిదగ్గర?

కర—చిత్తం! అదాఅండి! అది మనగ్రామందే! రెడ్డివెంకయ్యది. ఆకుర్రాడతనికొడుకు. పేరు సోముడు. ఒరేయ్! సోమిగా! ఇట్లా రా! తహసీల్దారుగారు పిలుస్తున్నారు.

తహ—వద్దు! వద్దు! వాడెందుకు కుర్రకుంక...

కర—చిత్తం. వీడికీ, వీడి తలిదండ్రులకూ ఈ ఆవంటే మహాప్రేమండి! అందులో వీడికా ఆవంటే ప్రాణం. ఎప్పుడూ దానిదగ్గరే వుండి సేవ చేస్తూ వుంటాడు.

తహ—అట్లాగా! ఆవు చాలా అందంగా వుంది సుమండి...సరే మీరింక వెనక్కు మళ్లండి మేం త్రిపురాంతకం వెళ్లాలి గాదు...దఫేదార్! గుర్రాన్ని ఇట్లా తెమ్మనూ...

కర—చిత్తం సెలవు...

అదుగో, తహసీల్దారుగారు గుర్ర మెక్కి త్రిపురాంతకం దోవ పుచ్చుకొన్నారు. కరణం మున సబులు, గ్రామజనులు వూళ్లోకి మళ్లారు...విన్నారా! తహసీల్దారుగారి ప్రసంగమంతా. ఆయావును పుచ్చుకునేలాగుంది. ఛరే! పదండి, మనమూ చెర్వుగట్టమీదుగా అటువేపునుంచి గ్రామంలోకి పోదాం.

౨.

ఆమర్నాడు సాయంకాలం సుమారు ౫ గంటలకు కరణంగారు ఉదాహరించిన రెడ్డివెంకయ్య చెరువు కింది మళ్లు చూసి వద్దామనే వుద్దేశంతో బయల్దేరాడు. కొంతదూరం పోయినతర్వాత యల్లయ్య అనే మరో పెద్దమనిషి కలిశాడు. ఇద్దరూ మాట్లాడుకొంటూ పోయి చెరువుకట్టెక్కి మళ్లకు అభిముఖంగా కూర్చొని వెంట తెచ్చుకొన్న జిల్లేడాకులతో చుట్టుకొన్న పొగచుట్టలను ముట్టించి వార్తాలాపాలను ఆరంభించారు. అప్పుడు వారి కీవిధంగా సంభాషణ జరిగింది.

"యల్లన్నా! ఆఖరుకు ఎన్నాళ్లకు దయవచ్చిందే మనమీద భగవంతుడికి!"

"ఏమోలే! అయిందీ అప్పుడే, ఇల్లలకంగానే పండగ?"

"ఇక్కడికి రెన్నెల్ల పైరైందా! ఇంకొక్కవాన కురిసి చెరువు నిండిందా అంటే చాలు. మన్నావ గట్టెక్కినట్లే...కాని కలెక్టేరు పెద్దదొర మనగ్రామాలన్నింటినీ తణిఖీ చేసి, మన మంచీ చెడ్డా విచారిస్తాడని కరణమయ్య ఎన్నాళ్లనుంచో అంటూ వచ్చినాడు కదా. ఇప్పటికీ రాలేదేమే? వాన కురవక ముందే వచ్చివుంటే బాగుండేదిసుమా!"

"ఏం? ఎందుచేత?"

"వరసాన్ని మూడేళ్లు వానబొట్టు పడకపోగా పశువులు తిరగడంచేత దుమ్ములు లేగుతూవుండిన ఈ చెరువును, మళ్లగట్లన్నీ నేల చదరమై ఒకేమాదిరిగా వుండిన దీనికిందిపొలాలూ, కుటుంబాలకు కుటుంబాలు కడుపు చేత బట్టుకొని ఉత్తరాదిసీమలకు కూలి నాలి చేసుకోడానికి పోవడంచేత పాడుపడివుండిన మనగ్రామాలను కళ్లార చూస్తే అసలుసంగతి తెలిసివచ్చేదిగా దొరగారికి. ఇప్పుడంటే మళ్లీ కొంచెం పచ్చపడిందాయె భూమి అంతా, వాన కురియడంచేత. వెనకటిదీ ఇప్పటిదీ అంతా కలిపి అంటగడుతారు ఇప్పుడు శిస్తునూ."

"వెంకన్నా! నీ వెకాలపు ముచ్చట్లో చెప్తున్నావు. పెద్దదొర వచ్చి చూడడంచేత మన కేమో ఒడుగుతుం దనుకోడం వట్టి ఆశ. దొర రాలేదేమో ఒకవిధంగా బ్రదికా మనుకో! మనకు బుద్ధి వచ్చినకాణ్ణుంచి చూస్తున్నాం గావూ. ఒక్క అమల్దారుడో, ఒక్క సీటిమూపరింటో లేక ఒక్క ఇన్స్పెక్టరో వస్తేనే మనప్రాణంమీదికి వస్తూవుంటుంది, వారికి సప్లయిలూ, సర్భరాలూ చేయలేక మన ఇంటిల్లిపాదికి రెండుమూణ్ణెల్లకు సరిపోయేగ్రాసం వారికి నాలుగైదు రోజులకే చెల్లు. మనకడుపులను కట్టుకొని, మన కన్నబిడ్డల నోళ్లను గట్టి, మనం ఊరక చూడడానికైనా

నోచుకోని అపరూపపుపదార్థాలను ఎన్నింటినో, ఎక్కడెక్కడనుంచో, ఎన్నితంటాలుపడో తీసుకొచ్చి వీరికి ఆరగింపపెడితే చిట్టచివరకు వెళ్ళేనాటి కేముందీ! తిట్లు, శాపనార్థాలు, బెదరింపులు, ఈసడింపులనే ప్రసాదించి పోతూవుంటారు. ఈలాటి చిల్లరమల్లర అయ్యవార్లనందరినీ వెంటేసుకొని పెద్దదొర వచ్చాడంటే, చచ్చామే వారికి సప్లయిచేయలేక."

"అవన్నీ నాకూ తెలుసు. కాని మూడేండ్లు వరసాగా చినుకు లేక మనం పడుతూవున్న బాధలనూ, మన మొగాలనూ, మనకొంపలనూ చూస్తే మన పేమన్నా కరుగుతుందేమో అని అధికారికి. వారుమాత్రం మనుష్యులు కామా?"

"మనుష్యులే కాని అధికారకవచం తొడుక్కోగానే మనుష్యత్వం దానంతట అదే మాయమౌతుందో లేక బలవంతంగా దాని విడన్వాలసివస్తుందో తెలియదు కాని మొత్తంమీద కనుపించదు. ఎంతకఠినపదార్థాలనైనా కరిగించడానికి సాధనాలను కనిపెట్టారు వైజ్ఞానికులు కాని అధికారిహృత్పదార్థం కరిగేలాగు చేసే సాధనం వీరికీ దొరికింది కాదు. వీరిచిత్తవృత్తికి దయకు అన్యోన్యాభావసంబంధం. అంటే అధికారిచిత్త మున్నచోట దయ ఉండదు. దయ ఉన్నచోట అధికారానికి చోటుండదు. మరోమాట. ఎవరికడుపాత్రానికి వారు తంటాలుపడుతూవున్నపుడు ఒకరిమీద ఒకరికి అనురాగం కలగడం అసంభవం. ఏదో విధంగా మనదగ్గర నుంచి లాగితేనే కాని వీరికడుపు నిండదు. అందునిమిత్తం ఇంకో ఆధార మేమైనా ఉంటేకదా! మనదగ్గరనుంచి రాకపోతే రంజాక్ ఆచరింపవలసిందే. గ్రామగ్రామాంతరాల్లో వుండే మనబోటిరైతులనుండి దీసిన రసాదానం చేతనే మదరాస్, బొంబాయి, కలకత్తాలవంటి విశాల నగరాల్లో వుండే గొప్పగొప్పయధికారు లనే మహామహీరుహా లన్నీ రోజూరు ఒకవిధంగా చిగిరిస్తూ పూలతో పిందెలతో కలకల్లాడుతూవుంటాయి. అచరాలవల్ల రసదాతలకు ప్రత్యుపకారమైనా కలుగుతుంది. కాని చరాలవల్ల అదీ పూజ్యమే. సరే, అది అట్లా ఉండనీ! ఏదో వాళ్లు పూర్వజన్మంలో పెట్టిపుట్టారు. ఇప్పుడను భవిస్తున్నారు. మన కారాత లేదు...సప్లయిలూ వగైరాలు పుష్కలంగా జరుగుతాయో జరగవో అనేభయం చేత మనగ్రామల్లాటి క్షుద్రగ్రామాలకు రానే రారు కలకటేరువంటి పెద్దదొర్లు; పెూతుబరీగ్రామాలకే పోతూవుంటారు. కాని తహశీల్‌దార్, రెవిన్యూ ఇన్స్పెక్టర్ల తాకీదులప్రకారం కరణంమునసబులు మన్ దగ్గిరనుంచి కూడా పోగుచేస్తూనేవుంటారు ఆసప్లయిల్లోని కొన్ని భాగాలను. ఒకవేళ దారిదప్పి వస్తాడే అనుకో పెద్దదొర మనగ్రామాలకు. వస్తే మాత్రం మనతో మాట్లాడుతారా? అసలు మాట్లాడడం ఏలాగు? మన మాట వారికి తెలియదు. వారిది మనకూ తెలియదు. అమల్దారుడే మునసబ్‌కరణాలను అడిగి తెలుసుకొని దాన్ని దొరగారికి ఎట్లా మనవిచేసుకోవాలో అట్లా వినిపిస్తే వారు సమస్తం రామరాజ్యంలాగు సుభిక్షంగా ఉందని వ్రాసుకోమని వారిగుమాస్తాకు చెబుతారు. ఆయన దొర చెప్పిన మాటలను మరింత తీర్చి దిద్ది రికార్డులో ఎక్కిస్తూవుంటాడు. వీటి నన్నింటిని పోగుజేసి రాజ్యమంతా సౌఖ్యసంపత్తులతో తులతూగుచున్నట్లు దొరతనమువారు ప్రకటిస్తూవుంటారు. కాబట్టి అసలు కష్టాలు అనుభవించేవాళ్లకు తప్ప ఇంకోరికి తెలియవు."

"అయితే మనగతి ఇక ఇట్లా తెల్లవారవలసిందే."

"కాకపోతే ఇంకేమౌతుం దనుకొన్నావ్? అంచేతనే కదూ ౧౫, ౨౦ ఏళ్లక్రిందట పాడిపంటలతో, పచ్చనిసంసారాలతో, కలకల్లాడే మొగాలతో నిండివుండే మనగ్రామం ఇప్పుడు తుమ్మ, జిల్లేడు, వెంపలి, తంగేడు, నాగజెముడు దుబ్బుల పొదుదిబ్బలతో నిండి చీకటి పడితే బయటికి పోవడానికే భయమనిపిస్తూవుంది. మనకు తెలిసినంతమేర చుట్టుపక్కల ఉన్న గ్రామాల కన్నింటికీ ఇట్లాటిదౌర్భాగ్యమే కావలా పట్టింది. అది సరే కాని, నీ వీమధ్య ఇక్కడ కాపురం ఎత్తేసి ఏగుంటూరుకో, తెనాలికో పోవా లనుకొన్నావట! నిజమేనా?"

"నిజమే. ఏం చెయ్యను చెప్పు మరి. మాఅయ్య దాటిపోయినకాణ్ణుంచి గ్రహచారం చుట్టుకొంది మా

కొంపకి. ఒకఏడు ఎరుకలోళ్ల దొంగతనం, ఇంకోఏడు కొంపలకు నిప్పంటుకోడం, ఆమరుసటిసంవత్సరం గొడ్లకు తెగుళ్లు. ఒకయేడు పోలేరమ్మ ఎత్తిపోతలు. ఇంకోఏడు అంకాళమ్మ గొంతుకోతలు. ప్రతిసంవత్సరం ఏదో ఒక ఉపద్రవం. ఏదో ఒక తంపి! ఎన్నింటికని తట్టుకోగలను రెల్లయ్యా! అదివరకు ఉండే కరువుకు తోడూ మూడేళ్లు వరసాగ్గా వర్షం లేకపొయ్యేసరికి ఉన్న కాస్తా కూస్తా ఊడ్చిపెట్టుకొని పోయింది. పంటలు పండి ఇంటికి గింజలు చేరాయా లేదా అనేవిచారణ లేదు. నేలను దున్నితే చాలు. పూరాశిస్తు ఇవ్వాలిసిందే అంటారు సర్కారువారు. ఆముందటేడు మల్లీ నాగయ్యదగ్గర రొక్కం తీసుకొని శిస్తుబాధ తప్పించుకొన్నాను కాని దాన్ని మించిన అప్పుబాధ మీద పడింది. అతగాడు అంతకు పూర్వం చేసిన అప్పును, కొత్తదాన్ని కలిపి వడ్డీకి వడ్డీ కట్టడం మొదలుపెట్టాడు. అసలుకు రెట్టింపు దాటింది అప్పు. గొడ్డుగోదా ఇంట్లోవి పోయినవి పోగా రెండరకలఎడ్లూ, మాగంగమ్మ ఆవు మిగిలేయి. వీటిని మేపడానికే తలప్రాణం తోకకు వస్తాఉండేది. నేనూ, మాయింటిదీ, మాపిల్లోడూ ఎంతైనా సహించుకొంటూ వచ్చాం కాని నోరు లేని వాటి మొహాలను చూడలేక పొయ్యాము. మేయడానికి ముం దొకగడ్డిపోచయినా లేక దిగాల మమ్మల్ని చూస్తూ నిల్చునేవి అవి. ఎటూ దారి తోచక ఒకకాడి ఎడ్లను తెగనమ్మాను. కొనబోతే కొరివి, అమ్మబోతే అడివి గదా. అందులో కటికకరువు. ఉన్నవాటినే పోగొట్టుకొందామని చూస్తూఉండే సమయంలో కొత్త వాటిని కొనే దెవరూ? మహాకష్టంమీద వాటిఅసలు ఖరీదులో సగంకంటె తక్కువడబ్బు చేతికి వచ్చింది. నాగయ్య అప్పు పోగా మిగిలిందాంతో గడ్డి కొన్నాను, ఎంతో ప్రయాసపడి. ఏట్లాగో గడుపుతున్నాం జీవనం. ఈయేడైనా దేవు డనుగ్రహించాడంటే సరి. లేకపోతే తట్టా బుట్టా సత్తి నేసికొని ఊరికి సొస్తి చెప్పాలిసిందే. ఇంతకూ ఒకకష్టకాలంలో మాగంగమ్మ మమ్ము ప్రాణం రక్షించింది దానికడుపు చల్లంగా. మా సోమిగాడు దానికి ఎంతో ప్రేమతో సేవ చేస్తూవుంటాడు. నోరులేని పశువేకదా! ఏంజీవమైతే నేం! రెల్లయ్యా! ఏజన్మపు సంబంధమో తెలియదు. వాడు గడ్డి వేస్తేనే కాని మేయదు. వాడు నీళ్లు పడితే కాని తాగదు. మావాడూ, దాన్ని చూస్తేనే కాని బువ్వ తినడు."...

వీళ్లిద్దరూ ఈప్రకారం మాట్లాడుతూ ఉండగా పోలీసుజవా నొకడు ముడివేముల వెట్టివాణ్ణి వెంట బెట్టుకొని చెరువువేపు రావడం మొదలెట్టాడు. చెరువుమరి నొమ్మకు దక్షిణంగా పోయిన బాటనుండా త్రిపురాంతకానికి పోతా రనుకొన్నారు వీళ్లు. కాని వాళ్లామార్గాన్ని వదలి తిన్నగా తాము కూర్చున్నవేపుకే వస్తున్నారు. దగ్గిరికి రాగానే వీళ్లిద్దరూ లేచి నిల్చున్నారు. పోలీసును జూచి వీళ్లకు కొంచెం తందరకూడా కలిగింది. ఘటనాఘటనసమర్థుడనీ, సర్వవ్యాపి అనీ, సర్వశక్తిమంతు డనీ పరమేశ్వరుడికి ఉండేవి బిరుదులు. కాని రూపంలేని ఈశ్వరుడివల్ల మన కీగుణత్రయంయొక్క సాక్షాద్దర్శనం లభించేది కాదు. క్రిస్తవశక ఊనవింశతి, వింశతిశతాబ్దాల్లో మనభాగ్యం పండబట్టి, ఉపర్యుక్తగుణత్రయపు ప్రత్యక్షదర్శనం మనకు చేకూరింది. ఏప్రకార మంటారా? రూపసహితమైన పోలీసుజాతిమూలాన్ని. రజ్జుసర్పభ్రాంతిలాగు దూరాన్నుంచి ఏదో ఎర్రతలగుడ్డ కంట బడితే చాలు. భయకంపాలు ఆవేశిస్తూవుంటాయి చూపరులను. అట్లాంటప్పుడు, పాపం, వీరు గ్రామీణులు; విద్యావిహీనులు. విద్యావంతులైతే మాత్రం! వాళ్లతరమా ఘటనాఘటనసమర్థఇత్యాదిగుణత్రయవిశిష్టరక్షకభటవర్గాన్ని ఎదురించడానికి? సరే! ఇంతలో సర్కారునౌకర్లు వీరిదగ్గరకు వచ్చి ఆగారు. వెట్టివాడు వెంకయ్యను పోలీసువానికి చూపిస్తూ,

"అడుగో—ఆయనే వెంకయ్య" అన్నాడు.

"వెంకయ్యా—మీకోసం ఎంతసేపట్నుంచో వెదుకుతున్నాము. కరణంగారిమాటమీద మీయింటి కెళ్లితే చెరువుక్రిందికి వచ్చినట్లు తెలిసింది. వెతుక్కొంటూ వచ్చాం."

"ఎందుకనీ ?"

"తహశీల్ దారుగారు మిమ్మల్ని వెంటబెట్టుకొని రమ్మన్నారు."

పోలీసునోటివెంట "మీ", "మిమ్మల్ని" అని గౌరవనీయమైన మాటలు వచ్చేసరికి వెంకయ్యకు రవంత భయం తగ్గింది. వెంటనే,—

"నన్నా? ఎక్కడున్నారు? ఎందుకు?"

"మిమ్మల్నే! త్రిపురాంతకంమకాంలో! ఎందుకు పిలిపించినదీ నాకు తెలియదు. అక్కడికి వెళ్లితే అన్నీ తెలుస్తాయి."

అందుమీద ఈసమాచారం ఇంట్లో చెప్పమని యెల్లయ్యను నియోగించి, 'సరే పదండి' అని వెంకయ్య పోలీసువానితో త్రిపురాంతకంమార్గం పట్టాడు. వెట్టివాడూ, యెల్లయ్య వూళ్లోకి మళ్లారు.

3

త్రిపురాంతకానికి పోతూ దారిపొడుగునా వెంకయ్యమనస్సు పరిపరివిధాల పోయింది. తహశీల్ దారుగా రెందుకు పిలిపించివుంటారో యని చాలా దూరం ఆలోచించినా సమాధానం దొరికింది కాదు. బాకీపడివున్న శిస్తుమగురించి అదివరకే ఫైసలా తెలిసి పోయింది. పొలాలు పండినా ఎండినా ప్రభుత్వపు యంత్రం నడుస్తూవుండవలసిందే కాబట్టి, పొత్తిగా పండని సంవత్సరపుశిస్తు సగమాత్రం చెల్లించవలసిందని వచ్చిన సర్కారుఉత్తరపుప్రకారం ఇతడు బాకీపడివున్న వెనుకటిపేటి పన్ను ఈసంవత్సరపుశిస్తుతో కలిపి ధాన్యపు నూర్పిళ్లయినపిదప చెల్లింపవలెనని హుకుం ఇదివరకే జారీఅయివున్నందున ఇప్పుడావిషయమై ఏమీ అయివుండదు. ఇం కెందుకు మరీ పిలిపించింది? పోలీసు జవాన్ను అడిగి తెలుసుకోవలె ననుకొన్నాడు కాని నిజాని కాసంగతి అతనికి తెలియదు. దెబ్బ తగిలిన వాడికి మళ్లీ ఎక్కడ తగులుతుందో అని భయమే కావున పరల తనమీద ఏమి రానున్నదో అని తహతహపడుచు తన్నూ తనవాళ్లనీ రక్షించమని తన ఇష్టదేవతలకూ, దొనకొండ గంగమ్మకూ, వినుకొండ అంకాళమ్మకూ మొక్కుకొంటూ అతనివెంట నడిచిపోతున్నాడు. తుదకు వీరిద్దరూ త్రిపురాంతకం చేరేటప్పటికి రాత్రి ఎనిమిది గంటలు దాటిపోయివుంటుంది. తహశ్శీల్ దారుగారు అప్పుడే భోంచేసి కాంపుడేరాముందున్న మైదానంలో ఒక ఆరాంకుర్చీమీద కూచోని మర్నాడు సర్కీటు పోవలసినగ్రామాలనుగురించీ, అక్కడ చేయవలసిన, విచారింపవలసిన విషయములగురించీ గుమాస్తాతో మాట్లాడుతూవున్నారు. వీ రంతకు ముందే చెప్పివుండడంచేత వెంకయ్య రాగానే అక్కడున్నవాళ్లందరూ ఇతనిని ఒకవేపునకు పిలుచుకొనిపోయి తహశీల్ దారుగారు ఎందుకు పిలిపించిందీ తెలియజేశారు. శ్రీవారు తన ఆవును 'గంగ'ను కోరివున్నారని తెలియగానే ఇతనిమనసులో ఒకవిధమైన వ్యాకులం కలిగింది. ఇవ్వనంటే అధికారికి కోపం. ఇస్తానంటే ఇంట్లో చికాకు. ఇంట్లో చిక్కుమిటి గాని దానిని ఇవ్వడానికి అసలు ఇతనికే ఇష్టం లేదు. పశువు లెన్నో వస్తుంటాయి, పోతూవుంటాయి. ఇవ్వాళ వున్నవి రేపుండవు. రేపటివి ఎల్లుండి వుండవు. ఈరోజు పశువులసంతలో నూరురూపాయలు పోసి ఒకదాన్ని కొంటాం. రేపు మరోపదిరూపాయిలు లాభం చూసుకొని అమ్మేస్తుంటాం. పాలిచ్చినన్నాళ్లూ దూడలనోళ్లు కూడా కట్టి బొందలంటూ పితుక్కొని తాగి, ఎండిపోవడంతోనే ఇంకొరికి తోలిపెడతాము. కొంచెం ముసలి దౌతూవుందని కనుపడగానే ఏ కసాయివాడికో అంటగట్టి వచ్చినమట్టుకు ధనం రాబట్టుకొంటాం. అట్టివిషయంలో ఎందుకు దీనిపై ఇంతవ్యామోహ మంటారేమో! వినండి! ఏదరిద్రపు పిసినిగొట్టుమార్తుల్లో గాని, దయాదాక్షిణ్యాలు కల సజ్జను లెవరూ పశువులయెడల ఇంత నిరోగ్రహులై, ఇంత కఠినులై, ఇంత లజ్జాశూన్యులై, ఇంత రాక్షసులై వర్తింపరు. పశువులను బిడ్డలతో సమానంగా పోషించినవాళ్లు, పాలిచ్చేవాటిని, అందులో ముఖ్యంగా ఆవులను, తల్లులవలె ఆదరించి కాపాడేవాళ్లు వాటికి సమస్తవిధములైన సేవలను చేసేవాళ్లు ఎంతమందో వున్నారు. అవన్నీ అట్లా వుండగా, ఈయావు అతనిఇంట్లోనే పుట్టి అక్కడే పెద్దదయింది. అది జన్మించినరోజుల్లోనే

ఆగ్రామంలో పశువులకు జెబ్బు తగిలి అందులో దీని తల్లికూడా చనిపోయింది. అది మొదలుకొని ఇతనూ, ఇతనిభార్య వెంకమ్మ దీనిని అనిర్వాచ్యమైన అనురాగంతో తల్లి లేనిబిడ్డనులాగే పోషించి పెంచి పెద్దదాన్ని చేశారు. దానికీ వీళ్ల మీద అటువంటి ప్రేమే. పిల్లిదరికీ ఏకపుత్రుడు సోముడికి ఈయావంటే ప్రాణం. పశువైతే ఏం? ఏప్రాణి అయితే ఏం? నిరంతరసహవాసంవల్లా, పెంచి పాలించడంవల్లా ఒకవిధమైన మమకారం ఏర్పడుతుంది పరస్పరం ప్రాణులకు. అందువలన ఈయావును ఇవ్వడానికి ఇతనికి మనస్కరించింది కాదు. ఆవిషయమై తెలియగానే ముఖం చిన్నబుచ్చుకొన్నాడితను. ఏమి చెప్పడానికీ నోరాడింది కాదు. అక్కడున్న వాళ్లంతా ఇష్టం వచ్చినలాగు సలహాల నిచ్చారు. వాటన్నిటి సారాంశం ఆవును శ్రీవారికి ఇయ్యవలసిన దనే. కాని ఇతడు సమ్మతించలేదు. అంత వారితనిసమాచారం శ్రీవారికి తెలియజేయగా వారితనిని ఎదుటికి పిలిపించి, "వెంకయ్యా! నే నా ఆవును పుణ్యానికి తీసుకో నెంచలేదు సరిగదా, ఏదో నాకు తోచింది నీచేతిలో పెట్టి సాగనంపుదామని కూడా కాదు; మధ్యవర్తు లెంత చెబితే అంత ఇస్తాను. ఒక వేళ నేనే మధ్యవర్తుల నేర్పరచేయెడల వాళ్లు నా కనుకూలంగా చెప్పవచ్చును కాబట్టి నీవే నలుగురు పెద్దమనుష్యులను ఏర్పరచుకో. వాళ్లు న్యాయంగా దాని కెంత ఖరీదు ఇవ్వవచ్చునంటే అంత ఇస్తాను. పైగా నీకు ఈనాంకూడా ముట్టచెబుతాను. బాగా ఆలోచించుకో" అన్నారు. అందుమీద నితడు చేతులు జోడించుకొని ప్రార్థనాపూర్వకంగా, "రక్షించాలి ఏలినవారు! దాన్ని సలు నేను అమ్మ తలంచుకోలేదు" అని అన్నాడు. అప్పుడా ప్రక్కన వున్న వారిగుమాస్తా ముందుకు వచ్చి,

"వెంకయ్యా! వారికి దాంతో అవసరం వుందని తెలియంగానే నీయంతట నీవే దాన్ని తోలుకొని వచ్చి వారికి వప్పగించి పోవడానికి బదులు నిన్ను స్వయంగా ఎలిపించి వారంతటివారు నీ కింతగా చెబుతూవున్నప్పటికీ నీ వేమేమో తటపటాయిస్తా వేమిటి? వారు నౌకర్ల నెవరినైనా రవంత హెచ్చరించారా అంటే చాలు, ఎక్కడున్నా దాన్ని లాక్కొస్తారు ఒక్కగడియలో. కాని వారు కేవలం ధర్మస్వరూపులు. వారు తమకున్న అధికారాన్ని దుర్వినియోగం చేసుకొనేవారు కారు. నీ ఇష్టమీ్ద నీ చేతిమీదుగా నీవే ఇస్తే తీసుకొందామని వారు నిన్ను పిలిపించారు మరోలాగైతే ఆవునే తెప్పించుకొని నీకు ఖరీదు పంపేవారు. బాగా యోచించుకో! వారిమాట తీసెయ్యకూ" అని అన్నాడు.

"నా మనవిని ఆలకించి నన్ను కాపాడండి. పెద్దోళ్లం మే మెట్లాగైనా సరిపెట్టుకొంటాం. మాకుర్రవెధవ దాన్ని విడిచి ఒక్కనాడైనా ఉండలేదు. అన్నందినక ప్రాణాలు విడుస్తాడు. వాణ్ణి రక్షించండి!" అని దీనంగా వేడుకొన్నాడు ఇతను.

"నీవే బొత్తిగా పిల్లవాడైపోతున్నావు. మీ నా డేమిటి? కుర్రవెధవ ఆవుకోసం పస్తు ఉండడ మేమిటి? నాకు ఆశ్చర్యంగా ఉంది" అని మరో పెద్దమనిషి అందుకున్నాడు.

"ఆశ్చరం లేదు. నేను పిల్లవాడిలాగు మాట్లాడడమూ లేదు. సంగతి సందర్భాలన్ని తెలిసినవాణ్ణి కాబట్టి మొర పెట్టుకొంటున్నాను. మావాడూ అదీ ఒకరి నొకరు విడిచి వుండలేదు, అదేజన్మసంస్కారమో!"

"నీమాటలు వింటూవుంటే నాకు నవ్వు వస్తూ ఉంది. ఏజన్మంలోనైనా వాడూ అదీ మొగుడూ పెండ్లాం కారుకదా?" అని ఎగతాళిగా నవ్వుతూ అన్నాడు గుమస్తా.

"ప్రభువు లేమన్నా సరి వస్తుంది. నే నేమని జవా బియ్యగలను? ఏజన్మలోనో తల్లికొడుకు లెందుకు కాగూడదూ" అని నెమ్మదిగా బదులిచ్చినాడు వెంకయ్య.

"సింగినాదం కాగూడదూ! వాడికంటె నీపట్టె ఎక్కువలాగుందే" అని గుమాస్తా వెంకయ్యను అధికారంతో చూస్తూ,

"నాలుగుడబ్బు లావెధవచేతిలో పడేస్తే వాడూరుకోడూ? ఈమాత్రానికి నీ వేమో మహా కిందుమీ

దర్యోమాటలన్నీ మాట్లాడుతున్నావు" అని మరింత నిష్ఠూరంగా అన్నాడు.

"దయ వుంచండి, అయ్యా! నే మనవిచేసుకునే వన్నీ బూటకపుమాటలు కావు. కడచిన మూడు నాలుగేండ్ల కాలోపల దాన్ని అమ్మివేయతగిన అవసరాలు ఎన్నిమార్లో వచ్చాయి. కాని ఆపని జరుగనియ్యలేదు. మేం పడుతూవుండిన మహాదురవస్థను జూచి ఇరుగుపొరుగువాళ్లెన్నితడవలో దాన్ని పోగొట్టుమని చెప్పారు. కాని దానిని అమ్మనలచుకొంటేనే మా కెట్లాగో వుండేది. మాకు తినడాని కేమీ దొరకని పాడు రోజుల్లో పస్తుపడుకొన్నాం గాని దాన్ని ఒకరికి ఇయ్యలేదు. అనుగ్రహించండి! అయ్యా! నామనవిని ఆలకించండి" అని మహాదీనంగా వేడుకొన్నాడు ఇతను. అంతవప్పుడు తహశీల్ దారుగారు కొంచెం చిడిముడిపాటుతో, "సరే! ఇతన్నవతలికి తీసుకొని వెళ్లండి" అని అక్కడున్న వారితో చెప్పి, యథాపూర్వం తమ సర్క్యూటు విషయమై పరామర్శించడం మొదలుపెట్టారు గుమాస్తాతో. నౌకర్లూ, చాకర్లూ, అక్కడ వుండడం తటస్థించిన కొందరు పెద్దమనుష్యులు వెంకయ్యను ఈవలికి పిలుచుకొని వచ్చి తలా ఒకవిధంగా ఇతన్ని ఒప్పించాలినని ప్రయత్నం చేశారు. కాని సాధ్యం కాలేదు. ఈప్రకారం వీ రిక్కడ ప్రసంగిస్తూ వుండగానే రాత్రి చాలాపొద్దు మీరిపోయింది. శ్రీవారు గుమాస్తాతో సంభాషణం చాలించి డేరాలోకి పోయి శయనించారు. కొంతసేపటికి క్యాంప్ అంతా నిశ్శబ్దమై పోయింది. వైయక్తికచ్ఛేదాలన్నీ తురీయావస్థలో ఏకీభవించి ఆనంద మనుభవిస్తూవున్నాయి. కాని వ్యక్తిత్వం చాపుకోలేక ఆరాత్రంతా ఒకమూల జాగ్రదవస్థలోనే గడిపింది వెంకయ్య జీవాత్మ ఒక్కటే.

## ౪

అత్యంత ప్రాచీనకాలాన్నుంచీ భారత వర్షం స్వామిభక్తికి ప్రసిద్ధి కెక్కినదేశం. తమకు ప్రియతమాలైనవాటిని, ధనధాన్యరాసులను, ఐహికసర్వస్వంనూ, తుదకు ప్రాణాలను సైతం సమర్పించి స్వామికార్యాలను నెరవేర్చే నిఃస్వార్థ శిరోమణులు, పరాక్రమవంతులు, శూరవీరులు, మేధావులు నైనపురుష పుంగవు లీభారత భూమిని అలంకరిస్తూవచ్చారు. సరే! ఇప్పుడో! ఇప్పుడు మాత్రం మనదేశం చెట్టిపోయిం దనుకొన్నారా ఏమిటి? నేను పూర్వకాలంకంటే వేయిమడుగు లెక్కువ సంప్రవర్ధమానమై, సందీప్యమానమై, ఖండ ఖండాంతరవాసుల చేతనే కాక ఖగోళవాసులచే గూడ జేగీయమానమై, మనుష్యమాత్రులకు ఆశ్చర్యదాయకమై, అనుపమానమై, అనేకప్రవాహాలరూపంగా ఈస్వామిభక్తి మనదేశంలో తాండవమాడుతూ ఉండడం, అధోగతిపాలై, నిర్భాగ్యులమై ఉన్న మన ఏ జన్మ జన్మాంతరసంచిత పుణ్యప్రతాపంచేతనో అయివుంటుంది గాని మరోటి కాదు. ఈకాలంలో స్వామిభక్తికి అధిష్ఠానభూతాలు చాలా ఉన్నాయి. కాని ముఖ్యాధిష్ఠానభూతం రక్షకభటవర్గం. ఈవర్గానికి చెందిన మనభ్రాతృవరులు చూపిస్తూ ఉన్న స్వామిభక్తినిగూర్చి వ్రాయాలనంటే కలానికీ సాధ్యం కాదు, చెప్పాలనంటే నోటికీ సాధ్యం కాదు. జాతికులాభిమానాలకు నీళ్లు వదలుకోవలసి వస్తుంది ఒక్కొక్కప్పుడు, ఈస్వామిభక్తిని ప్రదర్శించుకొనవలసినసంకట సమయంలో. పాప వీావర్జీయు లందులకు వెనుదీయరు. లజ్జావమాన పరిహాసాలకు తలలు వంచవలసివస్తుంది: వెనుదీయరు. మిత్రులను, దూరపుబంధువులనే కాదు, సన్నిహిత పితృమాతృపుత్రకళత్రాదులనుగూడ త్యజించవలసి వస్తుంది: వెనుదీయరు. ఓహో! ఏమి ఔదార్యం, ఏం త్యాగం! ఈ మహాపురుషులు ప్రకటిస్తూ వున్న స్వామిభక్తి సువర్ణకుంచికలతో, స్వర్ణద్రవములో, సువర్ణఫలకాలమీద చిత్రింపదగినది. చూచి ఆమోదింపతగినది. విని ఆనందింపతగినది, ఆశ్చర్యపడతగింది. దూరదృష్టిలేని స్వార్థపరాయణులు కొంద రిట్టిస్వామిభక్తివలన అనర్థాలు కలుగుతా యంటారేమో! కలగనియ్యండి. ఆట్టి భక్తిదేవతముందు ఇట్టివాటి నన్నింటిని బలి ఇవ్వవలసిందే. ఎంతటిఅనర్థాలు కలిగినప్పటికి స్వామిభక్తుడు వాటిని లేశమాత్రం లక్ష్యం చేయకూడదు.

స్వామిభక్తికి సంపన్నుడికీ—పీడికడుపుచల్లగా—ఎప్పుడూ ఒకటే యావ. ఏవిధంగా స్వామికార్యం

సామకూలం అవుతుందా అని అహర్నిశాలూ ఆలోచిస్తూనే ఉంటాడు స్వామిభక్తుడు. త్రికాలావస్థలయందూ ఇతని కిదే చింత ; అది నెరవేరేవరకు అతనికి అన్నపానాలుకూడా సరిపడవు. స్వార్థసిద్ధికి స్వామి ఒక ఉపాయం కనిపెట్టకలిగితే కష్టంమీద స్వామిభక్తుడు వెయ్యి ఉపాయాలను కనిపెడుతాడు, అవలీలగా, ఆదే సమయంలో. తహసీల్‌దారు స్వయంగా అడిగినా, అక్కడున్న వారందరూ అనేకవిధాల చెప్పినా, వెంకయ్య ఆవును ఇయ్యడానికి ఒప్పుకోనకపోవడం మీద ఏలాగైనా దాన్ని తోలుకొని వచ్చి శ్రీవారికి వప్పగించి వారిచేత సత్కారపూర్వకంగా సర్టిఫికేటును పొందాలి అనే ఒక దివ్యమైన ఆలోచన అక్కడ ఉన్న స్వామిభక్తిపరాయణుడైన త్రిపురాంతకపు పోలీసుసార్జెంటు తలలోకి దూరింది. ఇది తనచేతిలో ఉన్నపని కాబట్టి శ్రీవారికి గాని తక్కినవారికి గాని ఎరుకపరచడం, వాళ్ల సమ్మతిని పొందడం అనవసరం అనుకొన్నాడు. అది గాక; ఎవరికీ ఏమీ ఎరుక లేకుండా కార్యం సఫలంచేసి అందరినీ ఒక్కమారుగా చకితులుగా గావించాలని ఇతని అభిప్రాయం. కాబట్టి దీని ప్రస్తావంగూడా లేలేదు ఇతరులదగ్గిర.

మర్నాడు తెల్లవారంగానే తహశీల్‌దారుగారు ఈవిషయమై ఎవరితోనూ ప్రసంగించలేదు. రాత్రి ఏర్పాటుచేసుకొన్నప్రకారం షికారుపోవలసిన గ్రామాలకు బయల్దేరి వెళ్లారు. వెళ్తూ గుమాస్తా మొదలగు సిబ్బందిని ఫలాని గ్రామంలో వచ్చి మకాం చేయవలసిందనీ, అక్కడనుంచి క్రమక్రమంగా దారిలో వున్న గ్రామాలను చూసుకొంటూ ఒక్కవారంలోపల మార్కాపురం పోయి కలెక్టరుగారితో కలియాలననీ చెప్పి వెళ్లారు.

స్వామిభక్త సార్జెంటని ఇంతపొడుగు పేరు తడవ తడవా వ్రాయడానికి నాకూ, చదవడానికి మీకూ కష్టంగానే వుంటుంది కాబట్టి దాన్లోని పొడిఅక్షరాలను మాత్రం తీసుకొని సాభిసాఅని వాడుకొందాం ఇకమంచి. తహశీల్‌దారుగారు వెళ్లిపోవడంతోటే మనసాభిసా ఎవరితో ఏమీ చెప్పకుండా ముడివేములమార్గం పుచ్చుకొన్నాడు. ఆసంగతిని కాంపును ఎత్తివేయడపు పనుల్లో మునిగిఉన్నందున ఎవరూ కనిపెట్టారు కారు. మిగిలిన వాళ్లందరూ వెంకయ్యతో మళ్లీ చెప్పారు ఆవును శ్రీవారికి ఇయ్యడాన్ని గురించి. వారు చాలా సత్పురుషులనీ, వారిని ఆగ్రహపరచడం మంచిది కాదనీ, వారి ప్రాపుదల వుంటే ముందుకు చాల క్షేమకరమనీ, వారి మనస్సును సమాధానపరచి వారిచ్చే ద్రవ్యంతో మళ్లీ ఇంకోదాన్ని కొనుక్కోవచ్చునని తలాఒకవిధంగా ఇతనికి బోధించి చెప్పారు. ఇతడు మౌనభావం వహించి ఇంటికి బయల్దేరాడు. శ్రీవారి అనుచరు లందరూ కాంపు సామానును రెండు రెండెడ్ల బళ్లమీద వేయించుకొని వారు చెప్పిపోయిన గ్రామానికి పయనమై వెళ్లారు.

ఇటువైపు సాభిసా సగందూరం వచ్చేసరికి త్రిపురాంతకం వెట్టివాడు మాదిగ నర్సిగాడు ఎదురైనాడు. మళ్లీ ఇద్దరం కలిసి వద్దామని తనకు తోడుగా ఉండడానికి వాణ్ణికూడా వెనక్కు తిరగమన్నాడు సాభిసా. రాజుగారి ఉత్తరువుకు, తుదకు యమధర్మరాజుగారి ఆజ్ఞకు తిరుగు ఉంటే ఉండవచ్చు కాని, పోలీసువాని హుకుంకు వెనకా ముందాడడం వుండదు. నర్సిగాడు కిమ్మనకుండా వెనక్కు మళ్లాడు. వీరిద్దరూ ముడివేముల వూరిబయట చేరేసరికి మూడునాల్గు గడియల పొద్దెక్కింది. ప్రాణివర్గ మంతా స్వస్వకార్యాచరణంలో మునిగివుంది. గుండ్లకమ్మ ఒడ్డుమీది తోటల్లో కొందరూ, చెరువుక్రింది మళ్లల్లో కొందరూ కృషీకులు వారివారిపనులను చేసుకొంటున్నారు. వారికి చద్దన్నం చల్లముంతలూ అందించడానికి గ్రామ్యవనితలు వేరువేరు బాటలగుండా నడిచిపోతున్నారు. కొన్ని పశువులు వూరిబయటికి చేరాయి ; మరికొన్ని వస్తున్నాయి. మనవెంకయ్యకొడుకు సోముడుకూడా వాడి ఈడు పిల్లకాయలతో వచ్చి గొడ్లను మేయడానికి తోలి కొంచెందూరంలో కూచొని వున్నాడు. తహశీల్‌దారుగా రానాడు ఆవును జూచి ప్రసంగించినపుడు సాభిసా వెంటనే వుండినందున ఇప్పు డితనికి దాన్ని గుర్తించడానికి ఆలస్యం పట్టలేదు. ఇతన్ని చూడంగానే అక్కడ వున్న బాలకు లందరూ మరి కొంతదూరం వెనక్కు పోయి నిలుచొని చూస్తున్నారు.

ఇలో డా ఆవును సమీపించి వెంకయ్యగారి ఆవు ఇదే కదా అని అక్కడవున్న ఒకపెద్దపిల్లవానిని అడిగి, వాడు అవు ననగానే దానిమెడలో వదులుగా చుట్టబడివున్న పలుపును విప్పి పట్టుకోమని నర్సిగాడితో చెప్పాడు. ఈమాట విన్నక్షణమందే సోముడికి భయవిషాదాలు కల్గాయి. ఎటూ తోచలేదు. తెల్లబోయినమొగంతో చూస్తూ నిలుచున్నాడు. నోటివెంట మాట వచ్చింది కాదు. నర్సిగాడు పలుపును పట్టుకోంగానే అనవసరంగా నాజోలి కెందుకు వస్తున్నారని ప్రశ్నిస్తూ ఉన్నట్లు ఆవు మొగం పైకెత్తి తనచుట్టూ ఉన్న వాళ్లను చూస్తూ నిలుచుంది. అప్పుడు సాభిసా దీన్ని తహశీల్ దారుగారికోసం పట్టించుకొని పోతున్నానని అక్కడిగాలకులతో చెప్పి నర్సిగాడితో పదమన్నాడు త్రిపురాంతకం దోవను. వాడు పలుపును లాగుతూ నడిపించుకొని పోతున్నాడు. పిల్లవాళ్లకు ఏమీ తోచక దిగులుపడి చూస్తున్నారు. ఆవు పదిగజాలదూరం పోయి వుండవచ్చు. అంతవరకు లోలోపల ఎంత విలపిస్తున్నాడో తెలియదు కాని, తనఆవు ఆకొంచెందూరం పోవడంతోటే కెవ్వున కేకవేసి ఏడుస్తూ దానివెంట పడ్డాడు సోముడు. ఆవును వెనకాలనుంచి తోలుక పోతూవున్న సాభిసా వీడు రావడం చూసి, "దగ్గిరికి వచ్చావంటే వీపు వాయగొడతా జాగ్రత్త" అని కసరి కొట్టి, "పదరా నర్సిగా, తొందరగా" అన్నాడు. వాడు మరికొంచెం తొందరగా పోవడం మొదలెట్టాడు. సోముడు మరింత బిగ్గరగా ఏడుస్తూ ఆ ఏడుపులోనే మాగంగా అంటూ పలవరిస్తూ వెంట పోతునేవున్నాడు. మరి ఇరవై బారలు కడచాయి. ఇంతవరకు నర్సిగాడు లాగుతూవుంటే, సాభిసా వెనుక తోలుతూఉంటే ఆవు నెమ్మదిగా నడిచిపోతుంది. కాని ఆస్వల్పందూరం గడచినతరువాత దానిమొగం గంభీరమైంది. రోషం ఆవేశించింది. ఒక్క ఝటక్కతో నర్సిగాడిచేతిలోని పలుపును వదిలించుకొని వెనక్కు పరుగెత్తికొని వచ్చి సోముడిముందు నిలుచుంది. దానివంటిమీద చేయి వేసి తడువుతూ సోముడు మరింత బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టాడు. నర్సి సాభిసాలు దానివెంటనే వెనక్కు చూశారు. కోపంతో సాభిసా సోముడినెత్తిమీద ఒకచరపు చరిచాడు. దానితో పీడిఏడుపు మరింత ఎక్కువైంది. ఆచుట్టుప్రక్కల నిలుచున్న పిల్లకాయల్లో ఒకడిచేతిలో ఉన్న మరొకపలుపును లాక్కొని ఆవుమెడకు అంటగట్టి, చూడవచ్చిన ఒక పెద్దమనిషిని ఆరెండోపలుపును పట్టుకోమని ముగ్గురూ మరల ప్రయాణం సాగించారు. సోముడు మళ్లీ వెంటపడ్డాడు. మా గంగా, మా ఆవు—అయ్యో! అంటూ రోదనం చేస్తూ వెంట పోతున్నాడు. ఇంతలో పొలాలలోపల పనులు చేసుకొంటూవున్న కృషకులనేకులు ఈ గలభాను విని బయటికి వచ్చారు. జరుగుతూవున్న సమాచారం తెలుసుకొన్నారు కాని సాభిసాను ఎదిరించడానికి ఒకడికీ గుండె నిబ్బరించింది కాదు. భయవ్యాకులాలతో చూస్తూ నిలుచున్నారు అంతమంది కూడా. ఆవు వెనక్కు లాగడం, సాభిసా మనుష్యులు ముందుకు లాగడం. కష్టంతో నడిపించుకొని పోతున్నారు. కన్నీళ్లు ధారలుగా గార సోముడు ఏడుస్తూ నడుస్తున్నాడు, వీరివెనుక, చాలాదూరంలో. ఒక్క ఫర్లాంగుదూరం పోయివుండవచ్చు; మరల ఒక్కఝాడింపుతో రెండుపట్లనూ విడిపించుకొని పరుగెత్తుకొని వచ్చి సోముడిదగ్గర నిలుచుంది గంగ. ఉగ్రుడైపోయినాడు సాభిసా. అంగలు పంగలు వేసుకొంటూ పరుగెత్తుకొని వచ్చి అక్కడెవరినీ నిలుచోవద్దని చుట్టూ మూగినవాళ్లను తరుమగొట్టి, మరినలుగురు బలిష్ఠులైన రైతుల సేరుకొని, మరినాలుగు తాళ్లను తెప్పించి రెండుకొమ్ములకూ రెండు తాళ్లనూ, వెనుక రెండుకాళ్లకూ రెండుతాళ్లనూ గట్టించి, అదివరకున్న రెండుపలుపులుసమేతం ఒకవేపు ముగ్గురూ, రెండోప్రక్క ముగ్గురూ ఆతాళ్లను బట్టుకొని ముందుకు లాగుతూ ఉంటే, ఆవు ఇటూ, అటూ, వెనక్కూ, ముందుకూ, గింజుకొంటూవుంటే, మహాప్రయత్నంతో నడిపించుకొనిపోవ మొదలెట్టారు. ఈతడవ గుంపును తరుమగొట్టడంలో సాభిసాగారి బలమైన పాదప్రహారమొకటి సోముడికుంటిమీద పడింది. తొమ్మిదేళ్ల కుర్రవాడు దాని కే ప్రకారం తాళుకోగలడు. కింద పడి ఏడుస్తున్నాడు. కాని పునహా కట్టుదిట్టం చేసి తన

ఆవును లాక్కొని పోతూవుంటే లేచి కుంటుకుంటూ మళ్లీ వెంటపడ్డాడు, మాగంగా అంటూ ఆవురావురని ఏడుస్తూ. కుంటిమీద మంచి దెబ్బే తగిలినందున ఈపర్యాయం వీడికి వాళ్లను బాగా వెంబడించడానికి శక్తి లేకపోయింది. అటు గంగకూడా మహాఘోరంగా పెనుగులాడుతునే ఉంది కాని, దానికీ చప్పున సాధ్యమైంది కాదు యమదూతల్లాటి మనుష్యులపట్లనుండి తప్పించుకోడానికి. పాపం, సోముడికి చాల దూరమై పోయింది. చెట్లచాటున కనుపడడంకూడా లేదు. కాని వాడు అదేవిధంగా ఏడుస్తూ కుంటుకొంటూ పోతూనే వున్నాడు. వీడి వెంట వున్న కృషకులు కొందరు వెనక్కు మరలించుకొని పోవాలి అని చూశారు కాని వాడు మరలలేదు. మాగంగ అనే ఏడుపుతప్ప వాడినోటివెంట ఇంకొకమాట రావడంలేదు. అక్కడ వెనకనుంచి ఎవరూ కనుపడనందున ముందుకు లాక్కొనిపోతూవున్న సాధసామనుష్యులు కొంచెం తాళ్లను పట్లువదిలారేమో తెలియదు. అతరుణం గనిపెట్టి రంయ్యిమని గింజుకొని ముందుకు దూకి అసలు దారినుండి ప్రక్కకు చెంగలించి క్షణికాలంలో వెనక్కు మళ్లి నాలుగుకాళ్ల గాలప్పుతో వెనకవాళ్లకు చిక్కక, ముందువాళ్లకు దొరక్క, ప్రక్కలనుండి వచ్చువాళ్లకు పట్టుపడక కట్టుతాళ్ల తాకుళ్ల చేత నేలమీది చిన్నచిన్న కంకరరాళ్లు, మొక్కలు ఎగసి చిందరవందరగా నలుదిక్కుల పడుతూవుంటే, పేరాలు దీసుకొంటూ మేఘాలమీద పారివలాగు వచ్చి సోముడిముందు వ్రాలింది గంగ. ఈతడవ సాధసా హిరణ్యకశిపుడై పోయినాడు. ఏమిటో! పేదకమైన ఆవుగదా, తోలుకొని వచ్చి తహశీల్దారుగారికి వప్పగించి బిరుదు గొట్టవచ్చు ననుకొన్నాడు కాని, ఇంతటి మహా మొండిశిఖండి గడుసుదనపు పెంకె ముదరష్టపు పొగరుబోతు గొడ్డు దాపరిస్తే దానిమూలాన్ని ఇన్ని అగచాట్లు, ఇంత హైరాన్ పడవలసివస్తుందని కలలోనైనా అనుకోలే దితను. ఇక ఇంతవరకు వచ్చినతర్వాత ఊరికే పోనిస్తే నలుగురిలో తనది నవుబాట్లమారి బ్రతుకౌతుందని భయం. రోషం మితిమించిపోయిం దితనికి. ఒళ్లు పొంగిపోయింది. కళ్లెర్రబారాయి. పట్టుకొన్నవాళ్లను తెగదిట్టి వెంటనే మరల పట్టుకోడానికి వెనక్కు తరిమి తాను పరుగెత్తాడు. అంతదూరాన్నుంచే ఎవరికీ పట్టుపడకుండా పరుగెత్తుకొని వచ్చి సోముడిముందు ఆవు నిలుచుండడం చూశాడు. ఇన్నిసార్లు తంటాలుపెట్టినందుచేత సాధసాకే కాక తక్కినవాళ్లకు గూడా ఆగ్రహం వచ్చింది. ఈ తడవ పట్టుకొని ముక్కుకు తాడు పోసి కాళ్లకు బంధకొయ్య వెయ్యాలనని నిశ్చయించుకొన్నారు. వీరిసామ్మేమో పోయినలాగు మహాధాటీగా పరుగెత్తుకొని వస్తున్నారు. పదిగజాలదూరంలోకి వచ్చారు. ఇంకొక్క దూకుడులో వచ్చి కట్టుతాళ్లను లంకించుకొంటా రనగానే రెప్పపాటికాలంలో తోక ఝాడించి మెరుపు మెరిసినలాగు కుప్పించి ఎగసి ఎవరికీ పట్టుపడకుండా పశ్చిమోత్తరానికి కరుగెత్తింది గంగ. ఈ కుప్పించి యెగసిన వేగంలో ఎడంకాలికి కట్టివున్న తాడు ఆప్రక్కనుంచి పట్టుకోవలెనని వచ్చిన ఒక పెద్దమనిషికి ఛళ్లున దగిలి, తెగిలినంత మేర వాతపడ్డట్టయింది. ఆవు మొక్కలమీద ఎగిరి పోతూఉంది దొరకకుండా. సాధసాకు వొళ్లంతా భగ్గున మండిపోయి, ముందూ వెనుకా ఏమీ తెలిసింది కాదు. అక్క డెవరిదగ్గరనుంచో ఒక చాంతాడును లాక్కొని, ఈ పాపిష్టిముండాకొడుకుమూలాన్నికదా ఇంత మూడిందని సోముడిమీద పడి వీపు తాట ఊడేలాగు కొట్టాడు. దాంతో వాడు స్పృహ తప్పి క్రింద పడిపోగా, అప్పుడు వాణ్ణి వదలి మళ్లీ ఆవును వెంబడించడానికి పరుగెత్తా డితను, తనవాళ్లను వెంటేసుకొని. తర్వాత అక్కడ వుండడం తటస్థించిన మనుష్య లందరూ సోముడిచుట్టూ చేరి భయశోకాలు ముప్పిరిగొన కళ్ల నీళ్లు పెట్టుకొంటూ వాడికి ఉపచరించడం మొదలెట్టారు. అటువంటిస్థితిలో చేరాడు అక్కడికి త్రిపురాంతకాన్నుంచి ఇంటికి బయలుదేరిన మన వెంకయ్య. దగ్గరున్నవాళ్లు జరిగిందంతా చెప్పారు. కొడుకును చూసేసరికి కళ్లకు అంధకారం కమ్మింది. ధారాపాతంగా బయలుదేరిన కన్నీళ్లను తుడుచుకొంటూ కొడుకును బుజంమీద వేసుకొని ఇంటికి బయలుదేరాడు.

౫

తెల్లవారినతర్వాత గొడ్లను తోలుకెళ్లడానికి ముందు ఇంత చద్దన్నం తిని ఇన్ని చల్లనీళ్లేం తాగేడో కాని. తక్కినదినమంతా కటికలంఘనం, పచ్చిగంగైనా తాగలేదు, సోముడు. ఎంత పల్లెటూరి మోటుశరీరంకైనా, ఇంకా లేతవళ్లే కదా పాపం! హూనహూనమైంది. వీపూ, ప్రక్కలూ తెగకందాయి. పెక్కచోట్ల నెత్తురు ఓడుతూవుంది. తుంటంతా వాచిపోయింది. తలపోటూ, దిమ్మ. చప్పున మందు మాకూ వేయించి కొంచెం ఉపశమనం కలిగించడానికి, ఆపాడు కొంపల్లో వైద్యుడా వల్లకాడా! లక్ష్మీసంపన్నులకు పెద్దపెద్ద పట్నాల్లో లెక్కలేని ఆస్పత్రులూ, లెక్కలేని వైద్యులూనూ; కాని అనాథలకూ, అనాథుల కొంపలకూ వైద్యులెక్కణ్ణుంచి? ఇటువంటి దేశహితసంస్థలన్నీ దరిద్రులకనే ఏర్పడుతూ వుంటాయి. అనాథలకు ధర్మాసుపత్రులనీ, బీదలకు ఉచితవైద్యాలయాలనీ, దరిద్రులకు యూనానీహోలులనీ ఎన్నో వెలుస్తూ ఉంటాయి. పైకి పేరెట్లా ఉన్నా, ఆపేరును నిలుపుకోడానికి బీదలకు రవంత సహాయపడుతూవున్నా, మొత్తంమీద ఈధర్మార్థ ఉచిత ఔషధాలయాల్లో ధనవంతులకే ఎక్కువ సౌకర్యాలూ, వైద్యాలూ జరుగుతూ వుంటాయి. భాగ్యహీనులకు ఎక్కడున్నా ఒకటే. ఇక ఈక్షుద్రగ్రామాల్లో గ్రామపరిసరాలే ఆస్పత్రులు, ప్రకృతిపరివర్తనమే మందు. భగవంతుడే వైద్యుడు. ఏదో ఈశ్వరానుగ్రహంవల్ల బ్రతుకుతుంటారు, పెరుగుతూ వుంటారు. పరిశుభ్రమైన ఆహారం, వాయుజలసేవనం వలన గ్రామీణులు సాధారణంగా నిరోగులుగానే వుంటారు. కాని ఈలాటి గలభాలూ, కొట్లాటలూ సంభవిస్తే, అందులో ఉపద్రవకరములైన గాయాలేమైనా తగిలితే, అటు మార్కాపురానికో, ఇటు వినుకొండకో తీసుకొని పోతూవుంటారు రోగిని, ఓనులకమంచంమీద వేసుకొని, నలుగురైదుగురు మోసుకొనీ. ఇప్పుడు వీణ్ణి మార్కాపురం తీసుకెళ్లడానికి తహశీల్దార్ పోలీసుల భయం ఇంతవరకు అయింది కాక ఇంకా నెత్తిమీది కేం తెచ్చిపెడుతారో అనీ. సాధిసా ఇంత ఆగడానికి కారణం గాని, తహశీల్దారుకు ఈదారుణ కృత్యంలో జోక్యం ఎంతమాత్రం లేదని ఈయనాథులకు తెలియదు. కాబట్టి వాళ్లూ వీళ్లూ చెప్పిన చిల్లరమల్లర వేపాకువైద్యాలెన్నింటినో చేశారు. తుంటిని కాచి పట్టు వేసి, వీపూ ప్రక్కలంతటా కొబ్బరనూనె పూశారు. రెండుమూడు గంటలవరకు కుర్రవాడికి ఒంటిమీద స్పృహే లేదు. తరువాత కొంచెం తెలివి వచ్చింది మొదలుకొనీ 'అయ్యో! అయ్యో!' అంటూ మూలుగుతూనే వున్నాడు. సాయంకాల మయ్యేటప్పటికి మహాప్రచండంగా జ్వరం పెట్టుకొచ్చింది. రాత్రి మీరినకొలదీ జ్వరం ఎక్కువౌతూ పోయింది. దేహమంతా కాలినపెనంలా గుంది. కొడుకును ఇంటికి దెచ్చింది మొదలుకొని తల్లి వాణ్ణి వదల్లేదు. ఆవేళ ఇంట్లో అన్నపానాలు లేవు సరికదా, వీళ్లదురవస్థకు జాలిపడి పక్కింటమ్మ ఇంత అన్నం నీళ్లూ తెచ్చి యిస్తే వీళ్లకు తాకడానికైనా బుద్ధి పోలేదు. తల్లి వాణ్ణి ఒళ్లో పెట్టుకొని మహాఘోరంగా ఏడుస్తూ ఉంది. "నాయనా! మాటాడవేం? తండ్రీ! నిండుపది నెలలు కడుపున ధరించి నేలమీద పడిన దాది మెత్తని పొత్తిళ్లలో నిడి చమురు రాచి రాచి నే పెంచి పెద్దచేసిన శరీరమా ఇది! అయ్యో! ఎంత కమిలిపోయిందీ! వాడికి చేతు లెట్లాడాయి తండ్రీ, నిన్ను కొట్టడానికి. లేశమాత్రమైనా నీవు వారి కపరాధం చేయలేదే! వాడికి లేరా నీవంటి బిడ్డలు? నాయనా! పరుగెత్తైనా పరుగెత్తక తిన్నగా నిలుచూనే తిన్నావూ దెబ్బలన్నిటినీ. ఒక్కరైనా అడ్డపడడానికి రాలేదా?" అనిఘోరున ఏడుస్తుంది; నెత్తి రొమ్ము కొట్టుకొంటుంది; నేలమీద విసరుకొని పడుతుంది, లేస్తుంది. వాడిచేతు లెత్తి తనమీద వేసుకొంటుంది. ముద్దు పెట్టుకొంటుంది. కౌగిలించుకుంటుంది. నాకడుపులో చిచ్చుపడ్డదే అని వలవల ఏడుస్తుంది. రవంత ధైర్యంతెచ్చుకో అని వెంకయ్యా, దగ్గర ఉన్నవాళ్లూ ప్రయత్నిస్తారు. కాని ఆదుఃఖాన్ని ఆర్పడం వీళ్లతరమా! ఆమె విలాపం జూచి వీళ్లకే దుఃఖం పొంగి పొంగి వస్తూఉంది. ఆమెను ఊరడించబోతే వీరికి నోటివెంట ఏడుపే వచ్చేది. కుర

వాడు జ్వరపుమమ్మరంచేత ఏమేమో వదరుతున్నాడు. ఆ యర్థంలేనిమాటలు వింటే తల్లికడుపు తరుక్కొనిపోతూఉంది. మరింత తలుచుకొని తలుచుకొని విలపిస్తుంది. రాత్రి రెండుమూడు గంటలు దాటుండవచ్చు. ఏడ్చి ఏడ్చి అలసి ప్రక్కను వ్రాలివుంది వెంకమ్మ. హఠాత్తుగా పిల్లవాడు "అమ్మా" యనేసరికి ఉలిక్కిపడి లేచింది, 'ఏం నాయనా? ఏం తండ్రీ!' అంటూనూ. కుర్రవాడు కళ్లు తెరచి వెర్రిగా తల్లిని చూస్తూ, "అమ్మోవ్!...అదుగోనే మనగంగ... అదుగో...అదుగో...దా స్నెవరో పట్టుకపోతున్నారమ్మో...గంగే...నావేపు చూస్తూంది...నన్నా రమ్మంటుందే...అమ్మా! నేనుకూడా పోతా" నంటూనే కళ్లు మూసుకొన్నాడు. జ్వరం వచ్చినప్పటినుంచీ ఏదో అర్థం లేకుండా వదరడమే కాని కుర్రవా డిట్లా స్పష్టంగా మాట్లాడింది లేదు. ఇప్పుడు బాగా మాట్లాడడంచేత జ్వరం కొంచెం తిరుగుమొగ మైందనుకొంది పాపం, వెంకమ్మ. 'ఏం నాయనా! ఎట్లా ఉంది తండ్రీ' అని పలుకరించింది. నోట మాటా లేదు గీటా లేదు. కళ్లు, నోళ్లు, పళ్లు, బిగుసుకొని పోతున్నాయి. 'అయ్యో, నా తండ్రీ' అని నెత్తీ, రొమ్మూ మోదుకొంటూ కొడుకు మీద పడిపోయింది......

ఈశోకవార్త ఘటిల్లిన రెండుమూడురోజులకు ఎర్రగొండపాలెపు అడవిలో పెద్ద చిరుతగం డొకటి ఎక్కడిదాన్నో ఆవును ఒకదాన్ని వేసుకొనిపోయిందని ఫారెస్టుగార్డు ముతరాసిపెద్ద కటారి కన్నయ్యదొర త్రిపురాంతకం వచ్చి చెప్పితే ఆసంగతిని ముడివేములవాళ్లు విని పదిపన్నెండుమంది ఆదొరను వెంటబెట్టుకొని పోయి ఆఅడవిలో వెదికారు. పరుగుధాటిలో ఊడి కాని, తెగి కాని పోయినవి పోగా మిగిలి శిథిలములై పడివున్న తొళ్లను బట్టి అచట ఇటూ అటూ చెల్లాచెదరుగ పడిఉన్న పశుకళేబరావశేషములను గంగవే యని నిశ్చయించుకొని వచ్చారు.

ఏవిషయమైనా మితి మీరిపోయినపుడు పిరికిపందలకుగూడా ధైర్యం వస్తుంది. మితి మించినప్పుడు పిల్లికూడా తిరగబడుతుంది. గందపుచెక్క ఎంత శీతలమైనా అరగదీయడం మొదలిడితే శీతలచందనానికి బదులు అగ్నిని పుట్టిస్తుంది. ఇంటిదగ్గర సోముడి దుర్మరణం అడవిలో నిక్షేపంవంటి ఆవు పులివాత పడి చావడం వినేటప్పటికి ఆవూరివాళ్ల కందరికీ అరికాలుమంట నెత్తి కెక్కింది. అందరూ కట్టు కట్టి తక్షణం మార్కాపురం వెళ్లారు. తాలూకాసమాచారం యావత్తూ కనుక్కోడానికి వచ్చి అక్కడ దిగివున్న పెద్దకలెక్టరు ఎదుటికి నిర్భయంగా పోయి జరిగిన దారుణాత్యాచారం గూర్చి మొరపెట్టుకొన్నారు ఏకగ్రీవంగా. కలెక్టర్ యూరోపియన్ దొర. సాధారణంగా జాతిదొరల స్వభావం ఎట్లా ఉంటుందని తోస్తుందంటే, ఏవిషయాన్నిగురించి అయినా అందరూ కలిసి ఒక్కపర్యాయంగా ఒక్కవిధంగా మొరపెట్టుకొన్నయెడల దానికేదో ప్రతీకారం చేసితీరుతారు. కాని ఒకడో ఇద్దరో వస్తే వీరి కంతలక్ష్యం ఉండదు. గ్రామానికి గ్రామం ఏకమై వచ్చిందని దొరకు తెలియగానే, వెంటనే ఆ తహశీల్దారుకూ, ఆపోలీసుసార్జెంటుకూ, ఇంకా ఆ కేసుతో సంబంధం ఉండవచ్చునని తోచినవాళ్ల కందరకూ అర్జెంటునోటీసుల పంపి పిలిపించాడు.

రెండుమూడురోజులు అఖండవిచారణ జరిగింది. నిజం తేటపడింది. అనర్థాల కన్నింటికీ పోలీసుసార్జెంటే కారకుడని విస్పష్టమైంది. వెంటనే పొడుగుపాటి తీర్పు జడ్జిమెంటు వ్రాసి కోర్టులో వినిపించాడు. ఆతీర్పులోని అంతిమవాక్యాలే

"అధికారులు కొందరు తమ కిచ్చిన అధికారాన్ని దుర్వినియోగం చేసి......" ఇత్యాదులు.

సాధుసామీద కోప్పడేరు సుమీ! ఇకముందు ఇతడు వెంకయ్యకుటుంబానికి పరమాప్తుడౌతాడు. రాబోవుభాగంలో చూడండి.

---

పాయలు గాఁగ నీతనువుపైఁ బడుచున్ జలదాలె గుత్తులై
పోయినవో యనన్ జిలుఁగుప్రోవులు నించిన నీ వినీలకో
ఛాయతకైశికమ్ము జడయల్లితి వేటికిఁ జూచువారి కం
దోయిని బట్టి లాగికొను నూతనమోహనశృంఖలమ్ముగా?
వదులుగ నున్న నీదు జడపాయల యల్లికలోన నామనం
బెదిరెను మనోజ్ఞవాంఛ యుదయింపఁగఁ జిక్కువడన్; విముగ్ధమూ
ర్తి! దిగులు లేక యీతళుకుఁదీవలయందలి పూలతోడ నే
యొదిగి సుఖమ్ముగా వలపుటూర్పులఁ గాలముఁ బుచ్చివైచునో.

బాలిక! నీకనుంగవ కృపాభరితప్రణయావలోకనో
న్మీలితమై యెసంగ, రజనీకబరీభరమున్ మదీయనే
త్రాలకు నడ్డుగా నిడి నిరంతరసంజనితాశ్రుమాలకున్
మేలిముసుంగు సేయుము, నిమేషము మాత్రమె, గ్రుడ్డి నయ్యెదన్.

నీకయి కోర్కె రేఁగ రజనీముఖ మంతయు వేచియుంటి, నీ
చీఁకటిజుత్తునీడఁ గయి సేయుము స్వాగతమున్; ప్రభాతకో
భాకుసుమాల వాసనలు ప్రాఁకని శాశ్వతమైన రాతిరిన్
జేకురఁజేసి యాకసపుఁజిన్నెల నీజడ కప్పు మీఁదెదన్.

ఒకచిరుపూవునై నిముసమో క్షణమో భవదీయసుందరా
లకల వసించి ప్రేమభరలాలనలన్ మురిపెంపు లేఁత కో
రికల సుఖించెదన్; బలుకరింపఁగ, వాడి కృశించిపోయి నే
లకుఁ బడిపోవ జీవితవిలాసము నంతయు ధారవోసెదన్.

నీజడ నామెడన్ మలఁచి నీకనులన్ గరుణాశ్రు వొందు నీ
ర్వ్యాజముగా మదీయహృదయంబునకున్ బలువల్ ఘటింపుచున్
దేజరిలంగఁ, దక్కుమని నీపెదవిన్ జిఱునవ్వు వెల్గఁగా
రాజముఖి! బిగింపు మురిత్రాడుగ స్వర్గసుఖప్రదమ్ముగా.

---

చెఱువు లన్నిట్లో కలిగిరి చెఱువంటే మృగాల్లో మృగరాజులాంటిది; వృక్షాల్లో అశ్వత్థమంటిది. ఆకలిగిరి చెఱువు నడివేసవి కాలాన ఒకసాయంకాలము కడుపునిండ గుడిచిన లేగదూడలాగ గట్లు నాక్కొంటు, తనపై బడే సూర్యకిరణాల గిలిగిలింతలకు మెగిరి గంతులువేస్తూ ప్రకృతితో నాడుకొంటూంది. గట్టుక్రింద తొడలపైకి తన చిఱిగిన చిన్నిచీర నెగగట్టి, చాలిచాలని పవిటను మళ్లించి నడుముకు జుట్టి, మాటిమాటికి కండ్లు కడ్డమువచ్చే కుఱుచ వెండ్రుకల నప్పుడప్పుడూ వెనుకకు దిద్దుతూ, తనలో తానే చిఱునవ్వు నవ్వుకొంటూ, అలల నాదములో తనస్వరమును మేళవించి, నిమ్మళంగా ఒక్కొక్క నుడుగు గొణుక్కొంటూ, గుడ్డ లుతుక్కొంటూంది చెంచి. కొంతసేపటికల్లా, దూరాన కట్టమీద మోజాల కిర్రుశబ్దం వినొచ్చింది. చేతిలోని తడిబట్టను కాళ్ల మధ్య నుంచుకొని, లటాలున పైట విప్పి పండ్లతో బట్టుకొని, రెండుప్రక్కల సద్దుకొని కట్టవైపు చూచింది. చచ్చిన సీపాయిాళ్ల బూడ్సులు, చాకల్వాడి మొగం జూడని బొంతనిజారు, మాసికలు వేసిన చొక్కా, దానిపై నొక అఱచొక్కా, మెడలో నల్లదారం, చేతిలో ముళ్లదుడ్డు కఱ్ఱతోటి తెల్లని కాబూలా డొకడు ప్రత్యక్షమైనాడు.

చెంచికేసి కన్నార్పకుండా చూడడ మారంభించాడు. "బాబో! ఈగుడ్డల్లో దుమ్మంతా దులిపితే చెఱువెల్లా బుఱదలై పోతుందేమో" ననుకొని చెంచి పక్కున నవ్వింది. తన్ను జూచి నవ్విం దనుకొన్నాడు కాబూలాడు. రసికుడు తనభావాన్ని వెలిపుచ్చడానికి, చికిలి చేయని యిత్తడి రేకులాంటి పల్వారసను బయట బెట్టాడు. చెంచికి భయమేసింది. గుడ్డలు జవురుకొని కట్ట దిగి తన గుడిసెవంకకు వడివడిగా నడిచింది. చీకట్లో దయ్యాలభయ ముండే పిల్లవాండ్రలాగా వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ ఊరిబయటనే వుండే గుడిసె చేరి చెంగున లేడిపిల్లలాగ మెగిరి గుడిసెలో బడ్డది. లోపలి నుండి పాముపిల్లలాగ తొంగిచూచింది కట్టవంక. కాబూలాడు మైలురాయివలె నిల్చొని చూస్తున్నాడు. ఆరాత్రి కలలో, కట్టమీది కాబూలాడినవ్వు కనబడ్డది చెంచికి. చెంచి మగడి దగ్గరకు మఱింత జరిగి నిద్రలోనే గట్టిగా వాని కావిలించుకొన్నది. మఱికొంత సేపటికి ఉలికి పడి పెద్దగా కలవరించింది. చెంచుగాడు "పిల్లా! పిల్లా!" అని తట్టి లేపాడు.

"నన్ను కఱుచుకొని పండుకో మామా. కలలొస్తుండాయి. బయమేస్తుండది." అని నిద్రపోయింది మళ్లా చెంచి.

మఱునా డుదయ మయింది. చెంచుగాడు, చెంచి పంతులింటికి పని కెళ్లారు. "నాకేమో

కళ్లు మసకలు గమ్మిన ట్లుండాయి పిల్లా! మంటలంటే ఆ పసురు బోసినా డయ్యోర్రు. అప్పటినుంచి కళ్లొకటే దురద. చీకటి గమ్మిన ట్లుండాయి" అన్నాడు కండ్లు నలుపుకొంటూ చెంచుగాడు, రెండవచేత్తో నీళ్ల కావిడి బట్టు కొని. "నీకళ్లు బాగలేకపోతే నాకన్నొకటిస్తాలే మామా, నీ కొకటి నా కొకటిచాలు" నన్నది పిచ్చినవ్వు నవ్వుతూ చెంచి. ఇద్దరూ నవ్వుకొంటూ మాట్లాడుకొంటూ నీళ్లు దెస్తున్నారు కరణం పంతులికి. కొంతసేపటి కల్లా చెంచుగాడు గబాలున నవ్వు చాలించి, "ఆ వొచ్చే మాసెవరు పిల్లా, బాగా చూడు" అని భయముతో అన్నాడు. చెంచినవ్వు పెదవులపైనుండి పిట్టలాగ యెగిరిపోయింది. యెండు చేతనో శరీరం వడకింది. పైకి మాత్రం గుండె దిటువుతో, "వా డెవుడో సాయిబులే" అంటూ మగడిప్రక్క కొదిగింది. "యెవుడో సాయెబు గాదే. మనకు గుడ్డలిచ్చిన కాబూలాయిన గదో?"

"మన కెప్పు డిచ్చినాడు గుడ్డల?"

"ని వ్వెరగవులే. మన పెండ్లికి ఆయినదగ్గిర తెచ్చినా అప్పుకు గుడ్డలు. వొదిలి పెట్టడు గామాల్నే యెట్టబ్బా!" అంటుండగానే కాబూలాడు కఱ్ఱ నేల తాటిస్తూ సమీపించాడు. చెంచుగాడి కేమి మాట్లాడనూ తోచలేదు. కాబూలాడు కొట్టాడేమో ననేభయాన్ని కప్పిపుచ్చడానికి వెఱ్ఱి చిఱునవ్వు నవ్వాడు పెద్ద కుక్క యెదట కుక్కపిల్లలాగా.

చెంచి నీళ్లకడవతో నాలుగడుగు లావలికి నడిచి తిరిగి కోరచూపులు చూస్తూ నిలబడ్డది. పోవడానికి వీలు లేదని తెలిసీగూడా ముఖం చిట్లించుకొని "రా మామా, యెండబడ్డది." అని పిలిచింది తప్పంతా చెంచుగాడిదైనట్లు. చెంచిగాడు బడికి బొయ్యే పిల్లానిలాగా మొగం వేలవేశాడు. కాబూలాడు వాని చెవ్వు పట్టుకొని "మాబాకీ కట్తావూ లేదురా? యేంజబాబ్" అంటూ చెంచివంక జూశాడు నాటకాల్లో రాజువేషగాడిలాగ. చెంచుగాడికి ముఖం చిన్నబోయింది. "ఒదిలి పెట్టయ్యా! కట్తాం గాని మహాడబ్బు" అని విదళించాడు. చెంచికండ్లు కావుర్లుగమ్మాయి. "నొప్పిగదంటయ్యా చెవు బట్టుకొంటే. ఒదిలి పెట్టు" అన్నది. దానినోటిమాట కానందించాడు కాబూలాడు. వదలిపెట్టి "అయితే నీ మొగ్గి బాకీ నువ్వు తీర్సేమీ, వాడ్కి నెప్పి బొతే" అన్నాడు. చిఱునవ్వుగూడా నవ్వాడు. "తీర్చుకొంటాములే" అని గొణిగింది చెంచి. "సందాల కట్టెయ్యాలబ్బా బాకీ. వాయిదా పొనాదినా ల్లయిపోయింది; ఖబడ్దార్" అంటూ వెళ్లిపొయ్యాడు కాబూలాడు.

"మనపెళ్లికి దెచ్చిన కోకా పంచా అప్పా మామా?" అని అడిగింది కొంతదూరం నడిచి చెంచి. "ఊం" అన్నాడు. మఱేమీ మాట్లాడకుండా నడచిపొయ్యారు ప్రక్కప్రక్కన్నే. ఆ పగలంతా పంతులోరింట్లో తీరనిపని యిద్దరికీన్ని.

చీకటి బడుతోంది. చెంచుగాడు నగ మల్లిన యీతాకుల చాపపాయమీద గూర్చొనిఊోలువాయిస్తున్నాడు మిణుగురు పురువుల్లాంటి చుక్కలజూస్తూ. చెంచి వానికెదురుగ్గా.

"నమ్మదాలు దాటిపోతే
నక్కనైన తోపు లుండయి
నల్లగా ఆచెట్ల నీడల
నరస మాడుదమా! మామా తారి
పోవుదమా "]

అని పాడుతోంది మెల్లగ చిందుదొక్కుతూ. "ఆపదము గాదు పిల్లా! సందమామ పదము పాడు" మంటున్నాడు చెంచుగాడు. కాల యముడిలాంటి కాబూలాడి కాళ్లజోడు శబ్దం వినొచ్చేసరికి అప్రయత్నంగా డో లాగిపోయింది. పదం నిలిచిపోయింది. వెన్నెలల వంటి వాళ్లనవ్వులకి మబ్బు లడ్డమయినాయి. తుపాకిగుండు దూరిన పిట్టగూటిలాగ వారి కుటీరం నిశ్శబ్దనమా ధయిపోయిం దొక్కక్షణములో.

కాబూలా డారంభించాడు : "ఏంరా! ఏయీహూపాయలు".

చెంచుగాడు : "ఎవురిస్తారు సాయిబయ్యా దిక్కులేనోళ్లకు మాకు. నాలుగుదినాళ్లు నిదానించయ్యా, యాడన్నా కుదవుండి నీబాకీ గట్టుకొంటాము."

"అరే! పాప్మని ఇన్నాళ్లింటే యింకా నాల్గుదినాళ్లు? వహ్వా! నాయాన్కి కాలం ల్లేదేరా యిప్పు. కడ్తావా లేదా చెప్పు."

చెంచుగాడు బిత్తరి చూపు లారంభించాడు. చెంచి తల వంచుకొని, "నీబుణాన బోము లేవయ్యా, గొంతుమీద గూసుంటే యెట్ట, యే అయ్యాకాళ్లన్నా బట్టుకోని చాకిరిజేసి దీరస్తాములే" అన్నది దీనంగా. సాయెబు మరొకచిఱునవ్వు నవ్వాడు. "ఔతే మాదుకా నాన్కి పనికి రారాదు. మెవ్వరు అయినా మ్మాత్రం యెక్వా యిస్తారా" అన్నాడు చెంచి నడుమువంక జూస్తూ. "అల్లే వస్తాలేయ్య రేపుటినుంచి; తమురంగటి కొస్తా లేయ్య" అన్నాడు చెంచుగాడు సంతోషంతో.

"నీపెళ్లాంగూడా వస్తే జల్దీగా బాకీ పైన ల్గాదూ ?"

"నేను రాను లేయ్యా! పంతులింట్లో పని జెయ్యాల. కూడుబెట్టే మారాజులు గదయ్యా వోరు. మామామ వొస్తాడులేండి."

కాబూలా డింకేమో అడగదలచికొన్నాడు; కాని మాట రాలేదు. కొంతసేపు నిలబడి "మీాయిష్టం. బాకీమ్మాత్రం మీాహిష్టం" అంటూ తిన్నగా కదలిపొయ్యాడు. వాడు వెనక్కి తిరిగినప్పటినుంచి చెంచికి పట్టరాని నవ్వు. ఆత్రగా డన్నము దురుక్కొన్నట్టు నోటినిండ గుడ్డబెట్టుకొన్నది. కాని కండ్లు నవ్వు లొలుకుతున్నాయి. కళ్లెంబడి పసిమి యెండలో వానచినుకుల్లాగ నీటి చుక్కలు రాలాయి. కాబూలాడు దూరమై పోయిన తర్వాత గుడ్డ దీసి కలకల నవ్వుతూ, "మామా! సాయిబుకొలువుకు బోతే అట్లాంటి సల్లాడ యొకటి దెచ్చుకో. చెటొక కాలిలో బండుకోని దాగుడుమూత లాడుకొందాం"

అంటూ డోలావలికి నెట్టి, చెంచుగాడి ఒడిలో యెగిరి కూర్చుని పదిమార్లు ముద్దెట్టుకున్నది, మార్చి మార్చి రెండు చెక్కిళ్లూ. చెంచుగా డా చెంపా యీచెంపా దిప్పుకొంటూ కూచు న్నాడు అవ్వదగ్గిర ముద్దుగార్చే మొద్దబ్బాయి లాగ.

మఱునా డుదయాన చెంచి పంతులింట పనిచేసి గుడిసె కొచ్చింది. మొన్నడు జంట బాయని దోసాన దాని కా ఒంటిపాటు దుర్భ రంగా తోచింది. విసుగెత్తి చాపకట్ట ముందు వేసుకొని మెల్లగా అల్లుకొంటూ కూనరాగా లారంభించింది. కొంతసేపటికి నిద్ర వచ్చి చెఱగు బరచుకొని నిద్రపోయింది. నిద్రలో మోజాల కిఱ్ఱుశబ్దం వినవచ్చినట్లుండింది. ఉలికి పడి లేచి కూర్చున్నది. కల గాదు. వాకిట కాబూలాడు కూర్చొనున్నాడు తన మంద హాసముతో. "మా మామేడయ్యా ?" అన్నది పాప మాతురతతో. కాబూలాసి చిఱునవ్వు ముదిరి నవ్వయింది, తొండ పూసరివెల్లయిన లాగా. "బలే మొఱునబ్బా మీ మామక్కి సూస్తే నీకు. మామిాందగూడా అట్నే వుం డాడు" అన్నాడు. చెంచి తల వంచుకొన్నది. దేహం కంపించింది. చెమట బట్టింది. "మామా! మామా !" అని కేకలు వేసింది, మామ లేడని తెలిసి గూడాన్నూ. "మాయింట్లో వోడ్లు దస్తా వుండే మామ యిక్డ యెక్డ వుండాడు. పోనీలే. ఈకోక సూడు, నీకు బాగా వుంటా దేమో" అంటూ ముందుకు జాచాడు పసుపు పువ్వుల కోక. "మా కెట్లా వొస్తాయయ్యా పేదోళ్లకు" అంటూ గుడిసెలోనుండి బయట బడి కరణంపంతులింటివైపు పరిగెత్తిపోయింది పిల్లికూనలాగ. పంతులుగారి సందువాకిట వేప చెట్టు నానుకొని కూర్చున్నది చెంచి మగడు వచ్చే దారి చూస్తూ. వాడు రాగానే కాబూ లాడి కథంతా చెప్పా లనుకొన్నది.

మళ్లీ ఆలోచించుకొన్నది. "మామ మాత్ర మేమిచేస్తా డా రాకాసోడ్ని. కాకంటే మొఱునులో మఱీ దిగులుపడతాడు. యెం దుకులే చెప్పేది. దేము డుండాడులే నాయ మన్నాయం విసారించను" అనుకొని పొంగి పొర్లి వచ్చే ఏడుపు నాపుకొన్నది. చెట్టునీడను చల్లగాలికి నిద్రొచ్చింది. పసిబిడ్డలాగ కన్నీళ్ల తోనే నిద్రపోయింది. చెంచుగాడు ప్రొద్దు కొండలో బడేవేళ కొచ్చాడు తూలుతూ సోలుతూ. వాడికూత విని ఉలికిపడి లేచి గుడిసెకాడికి బోయింది.

"గెంజి దాగు మామా! యే మ ట్లుం డావు .ఆడ తప్పడక లాడుతుండావేమి మామా, గుడిసెవాకి లీడుంటే ?"

"నాకు కళ్ల వుపడ్డంలేదు చెంచా! సూ దలు గుచ్చిన ట్టుండాయి. దినమంతా ఒడ్లు దంచి అదిరిపోయినా యబ్బా, అసలే మసకలు గమ్మిన ట్టుండీన కళ్లు. ఈ కళ్లింక అక్కర కొచ్చే దేందో పిల్లా" అన్నాడు బాధతో యేడుస్తూ. చెంచి మగడికళ్లు దడివింది. రేపుటి నుంచి వాడికొంపకు పోవొద్దు లే మామా! యెట్టయితే అట్టవుతుందిలే. పాణం సరిగ్గా

వుంటేగదా మామా, అన్నీ సుకాలు. బాకీలూ" అంటూ చెంచుగాడిచేయి బట్టుకొని మెల్లగా తీసుకపోయింది గుడిసెలోకి. "యే గుంటలో నన్నాపడి సస్తా మనిపిస్తోంది పిల్లా, ఆబాకీ బాద పడేదానికన్నా. నా కీకళ్ల రోగం కుద రదు. యెట్ట దీరుతుందబ్బ యింతప్పు. ఒకటి అర గాదే, ఆరురూపాయిలు. దానికి చణానికి ఒడ్డీగట్టేవా డాపాపిష్టి సాయెబు" అన్నాడు మోకాళ్లపై గడ్డ ముంచి కూర్చొని చెంచు గాడు. చెంచికండ్లనుండి నీటిధారలు కారసా గాయి. కన్నీళ్లు దుడుచుకొని, "దిగులు పడొద్దులే మామా! మా అమ్మగారూరికి పోయి తీసకొస్తాలే మా అమ్మ నడిగి డబ్బు. నన్నుంచి నీ కెందుకు మామా, కష్టం." అన్నది.

మఱునాడు రెండుబారల ప్రొద్దెక్కింది. చెంచుగాడు బాధతో మూలుగుతున్నాడు. చెంచికి రాత్రల్లా నిద్ర లేక మొగం వాడి పోయింది. మొగుడి కండ్ల కేవో చికిత్సలు జేస్తోంది. "మెల్లంగా మెల్లంగా పిల్లా" అంటు న్నాడు పాపం బాధ కోర్వలేక.

"గుడిసెలో చేరుండారే యిద్దూ: పెళ్లాం జోక్లో పని మర్చిపొయ్యా వేంరా? భేష్! భలే నాఖరయిందే మాకు. మీాసుట్టూ తిర్గ తుండడం" అని వినొచ్చింది కాబూలాడికంఠం. చెంచుగాడు నిద్రలో బిడ్డలాగ ఉలిక్కిపడ్డాడు. చెంచికి చిరా కెక్కువైపోయింది.

"తెల్లారకటిలకే వొచ్చి కూసుంటా వేమయ్యా! మాయిమెటుకుపాణాలుగదూ. సావుబతకల్లో వుంటే యేమిపని, పోయ్యా. ఈ యాళ రాడు పో" అన్నది వడకే గొంతుతో.

"రాకపోతే జుట్టు పట్కొని లాక్కపోతాం, వద్దు కొంటాం? వ్వారే! దొంగ చేష్టా ల్మాదగ్గా". అంటూ గుడిసెలోకి దూ రాడు ఆగ్రహంతో. చెంచి పెద్ద పెట్టున యేడ్చింది. నీకాళ్లకి మొక్కతా సాయి బయ్యా! మామాము నేమనొద్దు. బాదతో వుండాడు మాతండ్రీ!" అంటూ వాని దుమ్ము నిండిన నల్లమోజాలపై వ్రాలిపోయింది. మోజాలపై బడ్డ కన్నీటిబొట్లు చారలుగ క్రిందికి దిగజారకం ప్రాణములేని చెప్పులుగూడ కంట తడిబెట్టిన ట్లుండినది.

కాబూలాడి కాగ్రహ మాగిపోయింది. వంగిన చెంచి నల్లని మెఱుగువెన్నుపై చేతితో తిన్నగా దిగచఱిమాడు. పందెపు పావురాన్ని బట్టుకొన్నట్టు దాని సన్ననినడు మొకతుణము బట్టుకొని వదలేసి లేవాడు. "రేపుయెల్లుంట్లో కట్టండబ్బ. ఆనాక అద్గో యిద్గో అంటె పరోయ్జనం లేదు" అంటూ వెళ్లిపొయ్యాడు కాబూలాడు.

చెంచి కీమాటు నవ్వు రాలేదు. ప్రక్క లెగరవేస్తూ తనలో తానే కుములిపోయిం దేడుపుతోటి. చీర చెఱగు తడిసిపోయింది వేడికన్నీళ్లతో. మగడి మెడ కావిలించుకొని యేడ్చింది. "మామా! మా అమ్మగారూరికి పోయి డబ్బు తెస్తా. మళ్లీ వస్తా. నేను లేనని దిగులుపడొద్దు మామా! బాకీ దీరినపాట

సుగంగా వుందాములే. నీకళ్లకు మందు రాసుకోని తెప్పన బాగుజేసుకో. చూపు లేకపోతే మన మెందుకు పనికొస్తాము మామా, పని పాటలు జేసుకొని తినాల్సినోళ్లము, పచ్చు ల్లాంటోళ్లము." అని వెక్కి వెక్కి యేడ్చింది. చెంచుగాడి చీపురుకళ్లనుండి కన్నీటి బొట్లు చాపపైకి జారినాయి. చెంచిని ముద్దిడుకొన్నాడు. మాట రాలేదు. దాని దేహమంతా తడవినాడు.

"తెప్పన రా. అమ్మగారియిల్లని అట్లనే కూర్చోవద్దు. నీవు లేకుంటే నే నుం......" అని యేడ్పు మింగినాడు. "ఊర్కో మామా! మామా, ఊర్కో" మంటూ చెంచి పెద్ద పెట్టున యేడ్చింది. కండ్లు దుడిచికొని బయటి కొచ్చింది గుడిసెలో నుంచి. రెండడుగులు బెట్టింది. చెంచుగాడు, "చెంచా! చెంచా! పిల్లా" అని పిలిచాడు. తిరిగివచ్చింది. "...... యేమో చెప్పాలనుకొని మఱచిపొయ్యాను... పోనీలే పిల్లా! యెదురెండ తే పెప్పుడైనా బోదువులే" అన్నాడు దీనంగా.

"కాదులే మామా! అప్పుడీ త్రే మన ల్నడిగేవాళ్లు లేరు. పోయి మా అమ్మను బతిమాల్తా. తెప్పన వస్తాలే మామా. నిన్నుజూడకుండా నే నుండేదాన్నేనా" అంటూ నాలు గడుగులు నడిచింది. కాళ్లు తడబడ్డాయి.

"మామా! యేమంటే......" అంటూ మళ్లా గుడిసె దూరింది. "ఏమోమాట జెప్పాలనుకొని యింతలో కేమఱుపొచ్చింది మామా" అంటూ చెంచుగాడి వాడిన కడుపువంక జూచింది. బోరని దుఃఖము చలిజ్వరములాగ వచ్చింది. మగడి ప్రక్కన బోర్లబడి, "నేను బోను మామా, పోతే నీకు గెంజినీ ళ్లెట్లా? నేను బోలేను మామ. అప్పలో డొచ్చి సంపితే సంపుతాడు లే" అన్నది.

"నీవు పోనేవద్దు లే. అస్తమాన మైనాక పంతులో ర్నడిగి చూదాములే".

సూర్యుడు కాషాయాలు గట్టుకొని అడవులు కొండలు దాటి వెళ్లిపోయాడు. చెంచుగాడిచేయి బట్టుకొని మెల్లగా నడిపించక పోయింది పంతులోరింటికి చెంచి. కరణం వీధి గుమ్మం దగ్గర గూర్చొని చుట్ట గాలుస్తు న్నాడు. చెంచి పంతులెదుట చేతులు గట్టుకొని తన సవిస్తారమంతా చెప్పుకొన్నది. చెంచుగా డప్పుడప్పుడు అందుకొని ఒక్కొక మాట జెప్తుండేవాడు. డబ్బుమాట వచ్చేటప్ప టికి కరణం పంతులు రూపమే మారిపోయాడు. చుట్టపీకి ఆవల పారవేశాడు. "మీా ధా ళ్లెట్ల యినా తెంచుకోండి. ఈ వెధవవేషాలు నాకు బనికిరావు. ఇంట్లో అంట్లు దోమడానికి దోవ లేదు గాని, డబ్బట డబ్బు! వెళ్లండి వెళ్లండి" అంటూ లేచిపోయాడు తుఱ్ఱున, అత్తమీాద అలిగిన అల్లునిలాగా. చెంచి చేతులు పిసుక్కుంటూ నిలబడ్డది.

ఆలుమగలు సందువాకిట్లోకి పొయ్యారు. పంతులుభార్య చేత గరిటె బట్టుకొని వంటింటిలోనుండి యెవరంటూ బయట కొచ్చింది.

చెంచి గబాలున ఆమెకాళ్లమీద బడి, "రచ్చించమ్మా, లచ్చిమి దేవమ్మా, రచ్చించు" అని యేడ్చింది. కాబూలాని గుండె గరిగించిన తన యేడ్పు పంతులుభార్యకు కరుణ బుట్టింపదా అనుకొని మఱీ యేడ్చింది. లచ్చిమి దేవమ్మ చెంచి నెత్తిన ఇనుపగరిటతో ఒక్క మొట్టు మొట్టి, "మడి గట్టుకొని వంట జేస్తుంటే వళ్లు తెలియక తాకుతావా వెధవా?" అంటూ లోపలి కెళ్లింది. పంతులుకూతురు, యేదో నవల జదువుకుంటుంది, యేమిటోనని కిటికీ దీసి చూచి, "అయ్యో, పాపం" అంటూ మఱల కిటికీ గట్టిగ మూసివేసింది.

దిక్కు లేని దంపతులు గుడిసెవంకకు నడిచారు, బిడ్డను బూడ్చి వచ్చేవారిలాగా. కొనవఱకు ఒకరి నొకరు పలుకరించుకొనైన లేదు. చూపుచెడిన మగణ్ణి గుడిసెలో వదలి చెంచి బయట నిలబడ్డది. "మామా, నీ కాకలి గదా! వుండు. బిఱాన నాలుగిళ్లకు బోయి కవళం దెస్తా" నని నిట్టూర్పులు విడుస్తూ వూరి వంకకు వెళ్లింది మళ్లా చెంచి. "అనాదవచ్చి నమ్మా! ఒక్క కవళ మేయండి తల్లే" అంటూ ఒక్కొక వాకిటా కేకలేయ సాగింది వేదనా మృదులమైన స్వరముతో. కొంత సేపటికే జోలె నిండిపోయింది. ఆరాత్రి మగడు పెండ్లము కడుపునిండుగ దిన్నారు. మిగిలినకూడు ఆవూరి కుక్కలకు వేశారు.

మఱునాడు చెంచుగాడికండ్లు పోటెక్కువై పోయింది. తెప్పలు తెఱవడ మసాధ్యమై పోయింది. దినమంతా పడకే. మూలుగులు హెచ్చినాయి. చెంచి తహతహలాడుతోంది. చేతనైనా వైద్యాలన్నీ చేసేసింది. "నాసూపు దీసుకొని నాపెనిమిటి సూపిచ్చేయి దేముడా" అన్నది సూర్యుడివంక జూస్తూ. చెవిటిసూర్యుడికీ దీనాలాపాలు వినరాలేదేమో, వానికి చూపు రాలేదు. దానిచూపు పోలేదు. సాయంత్రము వరకు తంటాలుబడ్డది చెంచి. యెంతమాత్రం నయము గనుపించలేదు. "పాణంబోతే బాగుండును రామా, ఈబాదకన్నా" అన్నాడు వెఱ్ఱి స్వరంతో చెంచుగాడు. జ్వరంగూడా ఆరంభమయింది. చెంచి యేడుస్తూ పరుగెత్తుకపోయి పరిచేలల్లో కావలియుండే ముసలివైద్యుణ్ణొకణ్ణి బ్రతిమాలి పిలుచుకొచ్చింది. "మామామకు సూపు దెప్పించు తాతా! నీపేరు చెప్పుకొని బతుకుతాము" అన్నది. "బయపడొద్దులే అమ్మా, పొద్దటికి ఆకలిగిరమ్మ దయవొల్ల బాగవుతాది. చెంచయ్యకు కూడు బెట్టు" అన్నాడు ముసలాడు. "బద్రంగా జూసుకో తాతా. కబళము దెస్తాఘణంలో" నంటూ జోలె బట్టుకొని బయలుదేరింది.

చిమ్మచీకటి. పుటపుట చినుకులు రాలుతున్నాయి. ఆకసమువంక జూచింది నడుస్తూ. చిన్న తెల్లమబ్బొకటి కుందేలిలాగ గునగున బోతోంది. దాన్ని తరుముచున్నట్టు కారు మేఘ మొకటి వెంబడిస్తోంది. త్రుటికాలములో తెల్లమబ్బు మాయమయింది. కారుమబ్బుల్లో మిళితమైపోయింది.

చెంచికి జాలేసింది. పాప మా చిన్న మొబ్బును మింగేశింది గావాల ననుకొంటూ

అడుగుబెట్టింది. కాలిక్రింద చిన్నకప్ప బడి కీచుమన్నది. దేహం జలదరించి విడిసి ఆవల బడ్డది చెంచి. చీకట్లో నిదానించి చూచింది. కప్ప కొంత తెప్పరిల్లి ఆలస్యంగా ఆఫీసుకు బొయ్యే గుమాస్తాలాగా గంతులువేస్తూ బోయింది. వెనకన్నే వాయు వేగముతో మఱొక పెద్దకప్ప దానిమీావికి పోతోంది. తెప్పపాటులో చిన్నకప్ప నేల గఱచుకపోయింది. దాని చిన్నమూలుగు పెద్దకప్ప బెకబెకల్లో లీనమైపోయింది. చెంచి కేహో విపరీత భావాలు స్ఫురించాయి. విషాదపు చిఱునవ్వుతో వెళ్లిపోయిం దూళ్లోకి. కరణంపంతులింటి వాకిట చీకట్లో నిలబడ్డది. గదికిటికీలోనుంచి పంతులు కూతురు ఆవలితట్టున యెవరితోనో, "ఈమాటల కేమిలేండి. పైనెలలో మీాకు వేసవికాలపు సెలవు లయిపోయి మద్రాసుకు బోతే నామాటే జ్ఞప్తికి రాదు. మీాలోకంలో మీా రుంటారు. ఇక్కడ నా అవస్థ..." అంటోంది. చెంచికి తన దుఃఖములో నవ్వొచ్చింది. అణచుకొని, "అనాదపచ్చినమ్మా" అన్నది. పంతులు కుమార్తె చివాలున తిరిగి, "వచ్చేవా ళ్లెవరు లేరు పోవే" అని మఱల కిటికీవంకకు దిరిగింది.

చెంచి చీకట్లో వీథిన బడి పోయింది. దాని కేకలధ్వని దూరానకు జడకొనలాగ సన్నమై పోయింది. నాలుగువీథులు తిరిగింది. జోలి సగమైన నిండలేదు.

ఒక సన్న గొందెలో ప్రవేశించి ఒక యింటివాకిట "కబళ మెయ్యండి తల్లే, అనాద పచ్చికి" అంటుండేసరికే మెలుగుబంటిలాంటి కుక్కొకటి గుఱ్ఱుమని పైన బడిపోయింది అమాంతంగా. పాపము చెంచి చేతిలో జోలె జారిపోయింది. "అమ్మో" అని పెద్ద కేక పెట్టింది. ఇంతలో యెవరో యింటిలోనుండి వచ్చి కుక్కను పట్టుకొన్నాడు. "కట్టెయ్యయ్యా, పాడుకుక్కని; నాపాణా లెగిరిపోయి నాయి నాయినా." అన్న దింకా వణుకుతూ. చీకట్లో దానిముఖంవంక పారజూచాడు, కుక్కనొకచేత బట్టుకొని. చెంచి! కాబూలాడు రెండవచేత్తో చెంచిచేయి బట్టుకొని "కర్నిందా" అన్నాడు. చెంచికి కుక్కభయానకన్నా మనిసి భయ మెక్కువయింది గుర్తించింది. "కరవ లేదులే సాయబయ్యా; చెయ్యి విడిపించయ్యా. తెప్పన బోవాల. మామామ కొళ్లు నిమ్మళంగాలే" దన్నది. "పోతువ్లే, రా" అంటూ యింటిలో కీడ్చుకవెళ్లా డొకచేత చెంచిని, ఒకచేత కుక్కని. చెంచి యేడ్వలేదు; అరవలేదు. గుమ్మము దాటేటప్పుడు, మామ, మబ్బు, కప్ప, పంతులోరిపిల్ల, అప్పు—అన్నీ తలలో గిఱ్ఱున తిరిగాయి. మేకపిల్లలాగ వానివెంట బోయింది.

తూర్పురేకలు మైలయిడుస్తోన్నాయి. సంధ్యామబ్బు లెట్టో లేచిపోయినాయి. ఆకాశమంతా తేట పుల్లనీళ్ల కుండలాగ నిర్మల మైపోయింది. ఒక్కొక్క మూలనుండి అప్పుడప్పుడు కోడికూతలు మాత్రం వినోస్తున్నాయి.

చెంచి అడుగుల్లో అడుగులేసుకొంటూ, బాటనేళ్లు చూసుకొంటూ వీథిగోడల ప్రక్కన రాచుకొంటూ పోతూంది. దానిభావ ప్రపంచము తారుమారయిపోయింది. తనకు తానే అసహ్యకరమైన వ్యక్తిగ కనుపించింది. మాటిమాటికి ముందుకు వంగి తుప్పతుప్పన తన పొట్టమీదనే ఉమ్మివేస్తోంది. తన శరీరాన్నప్పుడప్పుడు పట్టి గట్టిగ చీల్చుకొంటోంది. ముంజేతులు పండ్లగాటుకు గాయాలైపోయినాయి. తల వెంట్రుకలు సగము తెగి దానివేళ్లకు జుట్టుకొన్నాయి. మాసిన నీలిపవిట చీరికలై నేల వ్రేలాడుతోంది. రాతిగోడలకు రాచుకొన్న లేతభుజములు నెత్తుటిగుజ్జయి పోయినాయి. తనలో తానేమో గొణుక్కొంటూ, నవ్వుకొంటూ, మాట్లాడుకొంటూ పోతుంది వీథిన బడి చెంచి. వేకువన పాఠాలు వల్లించను లేచిన కుఱ్ఱవాడెవడో వాకిటనుండి దాన్ని జూచి, "అమ్మో దయ్యమే" అని అరుస్తు తల్లి నానుకొని దుప్పటి గప్పుకొని పండుకొన్నాడు. చెంచి విన్నది. "దయ్యాన్ని, దయ్యాన్ని, భూతాన్ని, రాచ్ఛేసిని, పంతుల్ని, కాబూలోణ్ణి, లచ్చిమిదేవమ్మను" అని పెద్దగా అరుస్తూ, అరచే కుక్కలను దడిపిస్తూ పరిగెత్తిపోయింది చెంచి వూరు దాటి.

చెంచుగాడికి బాధ తగ్గి నిద్రబొయ్యాడు. వైద్యుడెళ్లిపొయ్యాడు. జ్వరబాధలో వాడికి చెంచి బోయిందే తెలియదు. తెల్లవారి మెళకువొచ్చింది. చెంచికోసం చెయిజాపాడు. తవుడు కాడాడు. కొత్తయీతాకులచాప ముళ్లుమాత్రం చేయి దగిలాయి. చెంచి లేదు.

"చెంచా, చెంచా! పిల్లా" అని కళ్లు నలుముకొంటూ మెల్లగా పిలచాడు నిద్రలోలాగ. గుడిసెంతా తడవుకొన్నాడు, నిక్షేపానికి చీకట్లో తవ్రడుకాడే లోభవానిలాగా. చెంచి లేదు.

కొంతసేపటి గ్రామతలారొక డొచ్చి, "చెంచుగా, బయిటికి రారా! పోలీసులు మునసబుకరణాలు చేరి వుండారు చెఱువుకట్టమీంద. చెంచిని దేవి బయటేశారు, రారా" అన్నాడు. చెంచుగాడి గ్రుడ్డికళ్లలో మెఱుములు మెఱిసినట్లయినాయి. "మాచెంచినా నారయ్యా? మాపిల్లనా నారయ్యా? ఇంకే ముండది దేముడా" అంటూ గుండెలు బాదుకొంటూ కలిగిరి చెరువుకట్ట యెక్కినాడు. వాని వెఱ్ఱికేకలకు దూరాన పశువులు మేత మాని నిట్టూర్పులు విడువసాగాయి. గ్రామస్థులు "ప్రాణం బోయినా కళ దగ్గలేదు చెంచికి" అని తల లూపారు. పోలీసాయన బుఱ్ఱమీసాలు దువ్వుకొంటూ చాలాసేపాలోచించి, "అయితే నివ్వేనంట్రా దాన్ని చంపి నీళ్లల్లో వేసింది?" అన్నాడు చెంచుగాణ్ణి. "నిజం చెప్పు చెంచుగా, నిన్ను కొట్టడులే అయ్య" అన్నాడు మునసబు. కరణంపంతులు "జాతి తక్కువ వెధవలు లెండి. అదేమో పోకిరిపని జేసి వుంటుంది. ఈకుంఖ దానిగొంతు నులిమివుంటాడు" అన్నాడు. "సోముల్లారా! దణ్ణం

దేముడా! రాత్రికి రాత్రి వాళ్ళమ్మగారింటికి బోయి బాకీ గట్టను రూపాయలు దెచ్చింది. గామోా సయ్యా మాచెంచి. వొచ్చేటప్పుడు చీకట్లో నేమో పడిపోయిందయ్యా నాయిల వేల్పు" అంటూ పాప మేడ్చాడు. కొందరు గ్రామస్తులు చూడలేక తల లావలికి దిప్పు కొన్నారు. పోలీసాయిన చెంచి శవాన్ని కాల్తో యివతలికి మళ్ళించాడు.

"కేసు పెట్టాం, రిపోర్టు రాయండి" అన్నాడు మునసబుతో. మళ్ళీ బుట్టమీాసాలు

డాం. యేం హాశ్చర్యం" అని గొణుక్కొన్నాడు.

చెంచుగాడు, "నా బంగారు చెంచా! మీా అమ్మగారింటికి పోయినావా, నాకు జెప్ప కుంటా, మానాయినా" అంటూ దానిపై బడి గొట్టుకొన్నాడు. కరణంపంతులు మునసబువంక జూచి, "చేసి ;వారికి చేసినంత" అంటూ తలూపాడు.

మఱి చెంచి యేమనుకొన్నదో.



సహదేవ సూర్యప్రకాశరావు గారు

# కాళి*

ఆ జగన్మాతఁ బరికించినంత ఎడఁద
కలఁగిపోయి వడఁకిపోయె, జలదరించె
మేను, ఉన్మత్తగాఢతమిస్ర భయద
పిశునకాండశేఖాలి ప్రాపించె కనుల.

బ్రదుకునం దేదో పరితాపరక్తశిఖల
రేఁపె, నిలువఁగా నీడేని లేని విహాగ
మటుల నారకయాతన ననుభవించి
నాయెడందను పూత మొనర్చికొంటి.

ఆకరాళమధురమూర్తి లోకమాత
కాంచె నన్ను క్షమాలోకనాంచలముల;
ఎగసిపడిలి, చెమర్చిపోయినది బ్రదుకు,
నన్నగిలె గొంతు కన్నీటిజడులఁ దడిసి.

చిర్నతగాలి రెపరెపని చెదరి చోరని
యా నితాంతజీమూతగర్భాలయమున
కొనలు కర్పూరఖండశిఖాలి, విరతి
లేని నిట్టూరుపులకే చలింప సాగె.

ఎవరో నాప్రకృతావస్థ యెల్లఁ గాంచి
నన్నుఁ గాంచి, జాలి నొకింత నవ్విపోవ.
అపుడు తెరలుతెరలుగా నవ్యక్తలజ్జ
శుష్కజీవితమందుండి సోనవారె.

ఎవరో

"ఇది నఖంపచరుధిరవాహిని స్రవింప
దినముదినము పునీతమయిన తలమ్ము.
ఓయి సుకుమార, కవికుమారా, యిదేటి
వనట, ఇచటనా నీ శోకమునకు తావు."

నేను

"బాష్పధారామలినమైన పతితజీవి
వలపుతడిజీర నును రేక పదనుపోయి
నవ్యపరితాపభారవినమ్రమ యగుట
కిదియె మొదలాయె నోయశరీరవాణి."

అంబికాపాదలాక్షారుణాంకభాగ
ములకు జోహారు పెట్టి చేతులు తమంత,
"ఈనిరాశానిబిడవేదనానుతప్త
హృదికి శాంతి చేకూర శాసింపు"
మనుచు.

అశ్రుపీతాంచలమ్ముల నట్టె మోడ్చ
జ్యోతిరానందశీలవై సొగసి నీవు
శిథిలహృదిని తేజస్సు వర్షించినావు;
విశ్వమపుడు ప్రేమైకరూపిణిగఁ దోఁచె.

---

* కాళీఘట్టమున కాళీమూర్తిని దర్శించి వ్రాసినవి.

# ఒక్క దెబ్బకు రెండుపక్షులు

ఆలూరి రామకృష్ణరావుగారు, బి. ఎ., యల్. టి.

అనగనగ ఒక రోజు సాయంత్రం ఒక ప్లీడరు, ఒక డాక్టరు కలిసి షికారువెళ్లారు. దారిలో ఒకరైతును కలిసి కొన్నారు.

ప్లీడరు, డాక్టర్లు ఉన్నచోట కబుర్లకు తక్కువా! ఇహాయిద్దరు మొదలు పెట్టారు వారి అనుభవములను గురించిన కథలు, ప్లీడరు ప్రతికథలోను, రైతులు, వాళ్ల తెలివితక్కువ తనమునుగూర్చి తప్పక ముచ్చటించేవాడు. డాక్టరు కోతల్లో ప్లీడరుకు తీసి పోతాడా, మనకు తెలియదూ. విప్పాడు ఈయన గ్రంథం. ప్రతికథలోను రైతులు, వాళ్లఅజాగ్రత్త, వాళ్ల అనారోగ్యమువిూద నొక్కేవాడు. ఇట్లా ఇద్దరూ ఒకరు చెప్పేటప్పుడు రెండవవాడు పొట్ట ఉబ్బ నవ్వుచూ రైతును హేళన చేశారు.

మన రైతుకు వాళ్లిద్దరిని మింగేంత కోపం వచ్చింది. ఆఖరుకు అన్నాడుగదా, 'నేనొక కథ చెపుతావినండి: మావూళ్లో కరణంగారి పెద్ద బ్బాయికి అకస్మాతుగా శిరస్సులో రోగం పుట్టింది. వెంటనే పదిమంది వైద్యులు పోగయి, రోగంచాలా అసాధ్యమైంది. ఆసుపత్రికి తీసుకెళ్లమన్నారు. అట్లాగే అబ్బాయిని ఆసుపత్రికి తీసుకెళ్లితే అక్కడుండే పెద్దడాక్టరు మత్తుపెట్టి మెదడుకోసాడు. పాపం! నెత్తురు చూసేటప్పటికి కళ్లు గిర్రునతిరిగి డాక్టరు క్రిందపడ్డాడు. ఎట్లాగో తెప్పరిల్లి చెడిన భాగాలు తీసివేసి, మంచి భాగాలుపెట్టి మళ్లీకుట్టాడు. కాని గాభ్రాలో, కోసి బయిటకు తీసిన అంతరాత్మ(Conscience)ను మరల లోపల పెట్టడం మరచి పోయాడు. ఆకారణంచేత, రోగం నయమైనా, అబ్బాయి ఏఉద్యోగానికి పనికి రాకపోయాడు. అందువల్ల ప్లీడరు పరీక్షచదివి, కరణంగారి అబ్బాయి యిప్పుడు ప్లీడరైనాడు."

ఈకథ ముగిసే టప్పటికి ప్లీడరికి, డాక్టరికి మొఖము ముడుచుకుపోయింది. అయితేలోపల లోపల 'అరే, రైతు ఒక్క వేటున మన లిద్దరిని కొట్టాడు; మనకంటె గొప్పవాడ్రా' అని అనుకొంటూ, షికారు చాలించి యింటి కెళ్లారు.

---

# శోకదేవి

శ్రీరంగం శ్రీనివాసరావుగారు

[హరీంద్ర చట్టోపాధ్యాయుని గీతమున కనువాదము]

జ్వలియించు పూగుత్తి, పరిమళించెడుమట్టి
దుఃఖితప్రణయినీ! తొలగిచను నన్నియును;
సాంధ్య నిస్తబ్ధ తేజస్సు శాంతించు,
విలపించగా మానివేయును గాలి,
బ్రదుకొక్క కల్పనాకథవోలె ముగియు.
జీవితంపు గులాబి కావిరేకుల నడుమ
సరళానిలముగాగ మరణ మెప్పుడు వీచు,
బాధావిలానేకవర్షముల్ కడువ
శాంతి నెచ్చెలియట్లు సముఖాన తోచి
జాలిహస్తాల బాష్పమ్ముల తుడుచు.
మృతిలోన విధికృతప్రతివస్తువును ముగియు-
ఆశయు, వలపు, ఈఅలతిమనుజశ్వాస,
కాంతాధరములు, సిగ్గరి సందెచుక్క,
ఇకముందు మడిసిన విపుడు జీవించి
వరమనోజ్ఞములైన వస్తువు లెల్ల
ఒక తెల్లనగుమంట, ఒక కెంపుమంటయును
శాంతి వేదనల ప్రోజ్జ్వలకీల, లానడుమ
వస్తువుల్ కడచనును వచ్చినదారి...
ఇవియెల్ల నడచిపోయిన అనంతరము
ఆత్మ స్వీయమహస్సునందు జ్వలించు.

ఎరుపుమంటకు పైన, తెలుపుమంటకు పైన
నీడయేలేని ఉన్నత జాతి తేజమ్ము
మనుజఘోషల కందుకొనరాని నిబిడ
నిశ్శబ్దమున నున్న నక్షత్రవేది
నేకాంత రాజ్యమ్ము నేలు సమ్రాట్టు.
దుఃఖితప్రణయినీ! తొలగిచను నన్నియును
నాతీవ్రభారపుం జ్వలిత ప్రసూనమ్ము,
నీయక్షీణశోకమువు తీయనిమట్టి,
మనప్రేమ దేనికొమ్మలు కాంచెనట్టి
మనకయా జీవనోన్మాదంపు తరువు.
తొలగునన్నియు ఒక్కతుదిఅరపులోన;
నీరమ్ము, హరిణమ్ము, నీవు నేనునుకూడ,
అలసముల్ ప్రాకు నీడలు మనమీద!
కలలెరుంగని, అమోఘము, మగాధమైన
ఒంటరి నిద్రలో నురలును బ్రదుకు.
నిష్ఠురా హతహృదీ! నీ కేడ్వ నిక నేల?
బేలకనులార! మీ కేల అశ్రువులు, మీ
బాధారహస్య గహ్వరములందుండి?
ఆనంద మికమీద! వానవిధాన
గతియించి మగిడి రాగలుగరు మీరు.

---




## ధనము—మోక్షము

శ్రీమతి కల్వాకిం త్రిలోకసుందరమ్మగారు

ఒకానొక వూరిలో ఒక బీదబ్రాహ్మడు నివసించుచుండెను. అతనికి చాలామంది బిడ్డలుండిరి. సంపాదించి వారిని పోషించుట కతనికి చాలా కష్టముగానుండెను. అతను యెన్నివిధముల పాటుపడినప్పటికిన్ని ధనము చిక్కనందున, విసుగు చెందిన వాడై భగవంతుని ప్రార్థింపనారంభించెను. యిట్లుచాలాకాలము ప్రార్థింపగా ఒకనాడు భగవంతుడు దర్శనమిచ్చి, 'నీవు కోరిన కోరిక యెద్దియో చెప్పు' మనెను. అంత ఆబీద బ్రాహ్మణుడు నాభార్యను, పుత్రులను కాపాడుటకుగాను ధనమును యివ్వమని ప్రార్థించెను. అంతట భగవంతుడు 'నీకీజన్మమునందు ధనప్రాప్తి లేదు. మరు జన్మమునందు నీవు కోరినదానికి పదిరెట్లధికముగా నిత్తు' నని చెప్పి మరిగి పోయెను. అంత ఆబీద బ్రాహ్మణుడు అధిక చింత చెందిన వాడై తన యాలుబిడ్డలను వదలి అడవులలోనికి వెళ్లి ఒకమ్రాను క్రింద కూర్చొని మోక్షము కొరకై తపస్సును చేయ నారంభించెను. ఆతని తపస్సును మెచ్చినవాడై భగవంతుడు తననిజస్వరూపముతో దర్శనమిచ్చి "ఓ తపస్విశ్రేష్ఠుడా, నీకీజన్మమునందే మోక్షమును, ముందుకోరినధనమును యిచ్చితి" నని చెప్పి తాను మరిగిపోయెను. అంత నాబ్రాహ్మణుడు ఆధనమునంతయు పౌరులకు దానముచేసి తాను దేవలోకమునకు పోయి చేరెను. కథ కంచికి, మనం ఇంటికి.

---

## యుక్తితో ముక్తి

శ్రీమతి వింజమూరి అలిమేలమ్మగారు

అనగా అనగా ఒక ఊరు. ఆఊళ్లో సుబ్బిశెట్టి అనేకోమటి చిల్లరదుకాణవ్యాపారం చేస్తుండేవాడు. ఇలా ఉంటుండగా ఒక నాడు యమధర్మరాజు సుబ్బిశెట్టిని పిలుచుకు రమ్మని భటుల కాజ్ఞాపించాడు. భటులొచ్చి సుబ్బిశెట్టిని రమ్మన్నారు. గుండెగుభేలంది సుబ్బిశెట్టికి. ఎలాగురా నరకం తప్పించు కోడం అని ఆలోచించడం మొదలెట్టాడు. ఆఖరు కొక

యు_క్తి పన్నాడు. ఎవరు నిమ్మిల్ని పంపించింది? పాతయముడా, కొ_త్తయముడా? అని భటు లు హడిలిపోయేట్టు అడిగాడు.

అడిగి కనుక్కొ_స్తామని వెళ్లి యమధర్మ రాజుతో చెప్పారు జరిగిన సంగతంతా భటులు. కొ_త్తయముడనే మాట వినేసరికి గుండెల్లో రాయిపడింది యముడికి. తనకి తెలేకుండా ఒక వేళ బ్రహ్మ ఇంకోడ్ని కొ_త్తగా సృష్టిచేసుండ చ్చని బ్రహ్మదగ్గర కెళ్లాడు కనుక్కో_డానికి. నా కేం తెలేదన్నాడు బ్రహ్మ. విష్ణుమూ_ర్తేమన్నా ఈయేర్పాటు చేశాడేమో కనుక్కుందామని ఇద్దరూ వెళ్లారు. ఎక్క_డికి? విష్ణుదగ్గరకి-నా కేం తె లేదన్నాడు విష్ణువు. సరే ఇంకేం, ముగ్గురూ కలిసి సుబ్బిశెట్టి దగ్గరకొచ్చారు కనుక్కుందా మని. ఏమిటని అడిగారు సుబ్బిశెట్టిని. 'ఆఁ ఊఁ' అనలేదు సుబ్బిశెట్టి. విష్ణుమూ_ర్తి రెండుపాదా లూ కటికి్క_న పట్టుకొని రక్షించమన్నాడు. విష్ణుమూ_ర్తి పాదస్పర్శయితే మోక్షమేగామరి. సుబ్బిశెట్టికి మోక్షం కలిగింది. వైకుంఠాని కెళ్లాడు.

అంతా భ_క్తితో ము_క్తి పొందుతూంటే సుబ్బిశెట్టి మాత్రం యు_క్తితో ము_క్తి సంపా దించాడు.

కథ కంచికెళ్లింది, మన మింటికొచ్చాం.

---

# నెచ్చెలీ!

పురిపండా అప్పలస్వామి, (కవితాసమితి)

వీరురాలవు గదవె నీవెడలు దారి
స్వర్గవాసులు సుమములే చల్లినారు
నామనోహారి! నీనీడ నడువలేక
నేను మాత్రము పేదనై నిలిచినాను.

ప్రేయసీ! నిన్ను నాకౌగిలింతనుండి
లాగికొని పోయినారు క్రౌర్యమున నెటకొ
పంజరనిబద్ధ కీరమ్ముభాతి నపుడు
జాలిచూపులు నామీద చల్లినావు.

నెచ్చెలీ! నెచ్చెలీ! యెటు నీప్రయాణ
కఠినదృశ్యమ్ము సైచికోగలను? ఎటులె
ఆరనిదవాగ్ని నాహృదయము దహింప
ఈయభాగ్యజీవమ్ము భరింపగలను?

---




కో. నరసింహాచారిగారు

## రాటము ౧

౮ అంగుళముల పొడవును, అంతియు వెడల్పును గల ఒక గట్టి అట్ట చతురమును (A B C D చిత్రము ౧) తీసికొనవలసినది. మరియొక పెద్దగట్టిముక్కను దీసికొని దానిని ౧౨" వ్యాసము (Diameter) గల వలయముగా కోసికొని దానిమధ్య ఒక అరయంగుళపు రంధ్రమును చేసికొనవలెను. (చిత్రము ౨).

పిమ్మట మఱియొక అట్ట ముక్కపై (చిత్రము 3) o a అను అర్ధ వ్యాసముతో (Radius) o a e అను ఒక వలయ భాగమును వేసి, దానిని a b, b c, c d, d e సమభాగములుగ జేసికొన వలెను. దానిలో, అతికించుటకు f, g, h, i, j అను తునకలను వదలవలెను. o వద్ద నల్లగా జూపబడిన భాగమును కత్తిరించి పిమ్మట o b, o c, o d రేఖల వెంబడి మడుచుకొని గోపురాకారము (Pyramid) గా జేసికొని f అను అతుకుతునక (flap) ను o a అను అంచుకు లోప్రక్క అతికించవలెను. ఈగోపురమును, ౧-వ చిత్రపు అట్టపై, ౪-వ చిత్రమునందలి విధముగ నిలువబెట్టి అతికించవలెను. g, h, i, j అను అతుకుతునుకలు లోప్రక్కగా నుండవలెను.

౫-వ చిత్రముననుండునది ఒక పేము తునక. ఇది సుమారు ఒక అడుగు నిడివిగను, లావుగను ఉండవలెను. పేమునకు బదులుగా సన్నని వెదురుముక్కయైనను చాలును. వెదురుముక్కలో a, b, c, అను చోట్ల సన్న చీలలు గ్రుచ్చుటకు రంధ్రములు చేయవలెను. పిమ్మట వెదురుముక్కను ౪-వ చిత్రమునందలి విధముగ గోపురములో నిలువబెట్టవలెను. దానిని కదలనీయక b, c అను చోటులలో గోపురముగుండానున్ను వెదురుగుండానున్ను పోవునట్లు చీలలు బిగించవలెను. వెదురు పైకొనయందు ఒక దారపుబండీని పెట్టి దానిని క్రిందికి జారనీయకుండుటకు a వద్ద నొక చీలను గ్రుచ్చవలెను.

### రాటపు గుజ్జములు

౬, ౯, చిత్రములయందలి విధముగ గుజ్జుపుతోకయు, తలయు గట్టి అట్టముక్కల కత్తిరించికొనవలెను. తర్వాత ఒక పొడవైన కార్కు (cork) ను (చిత్రము ౭) తీసికొని దానికొనలందు చిన్నకోతలు చేసి వాటిలో తలను తోకను, బిగించవలెను. (చిత్రము ౧౧). ౧౦-వ చిత్రమునందలిరీతిగ నొక జంట




రూపముగల మనిషిబొమ్మను కత్తిరించుకొని, దానిని a, b రేఖ వెంబడి మడిచి గుఱ్ఱముపై కూర్చుండబెట్టి దారముతో కుట్టిగాని, గుండు సూదులతో గ్రుచ్చిగాని, దానిని బిగించవలెను.

ఇట్టి గుఱ్ఱములను, మనుష్యులను ఆఱింటిని జేసికొని, వాటిని ౩-వ చిత్రపు అట్టవలయమునకు a, b, c, d, e, f, అను చోట్లయందు దారములతో వ్రేలాడగట్టవలెను. పిమ్మట ఆ అట్ట వలయమును, ౪-వ చిత్రము నందలి దారపుబండిపై పెట్టినయెడల ౧౨-వ చిత్రము నందలి విధముగ రాట మేర్పడును.

ఈచక్రమునకుగుఱ్ఱములనేకాక, పూర్వ వ్యాసమునందలి ఆనందచక్రమునకు కట్టబడి నట్టి తొట్లనుగూడ వ్రేలాడగట్టి వాటియందు చిన్న బొమ్మలను ఉంచవచ్చును.




## ౨

## చదరము

పై చదరమున 'ర' గురుతుంగల ముక్క-వంటివి రెండును, 'చ' గురుతుంగల ముక్క-వంటివి నాలుగును, 'ద' గురుతు ముక్క-వంటివి నాలుగును, అట్టముక్క-లు కత్తిరించుకొని మరల ఆ పదిముక్క-ల నమరిచిన పై చదరము వంటి చదర మేరుపడునా? ఎట్లు ఏరుపడునో ప్రయత్నముచేసి చూడుము.

## 3

## సిపాయి

ఈ సిపాయి బొమ్మలో ఆరుచోట్ల గీతలు ముగియుచున్నవి. వానిలో ప్రతిదానిచివర చుక్క- ఒకటి ఉన్నది. సిపాయి టోపీపయిన ఒక పెద్దచుక్క- ఉన్నది. దానిక నుండి దానితో కలిసి ప్రతిగీతచివరకుగల చుక్క-లను ఎంచిన ఇరువదియైదుమాత్ర ముండునట్లు ఎన్ని విధముల ఎంచవచ్చును? ఏయేత్రోవల ఎంచవచ్చును?

[పై వానిని (౨-3) సాధించువిధము ముందు సంచికయందు ప్రకటితము కాగలదు.]



---

# జీవప్రబోధము

బాలాంత్రపు వేంకట్రావుగారు

జీవప్రబోధనామక
భావానందప్రబంధబంధురభాషా
ప్రావీణ్యము వెలయించిన
దేవిఁ జగదంబ భారతిని సేవింతున్

౧

అంటఁగా రాని మాయాంచలం బంటి,
పిన్నవై పెద్దవై ప్రేమభావమున,
పాలనోటనె పెద్దపలుకులు పలికి,
పాలపాపలఁ గాంచి, ప్రకృతి మోహించి,
నాచెలి, నాబిడ్డ, నాప్రాణ మనుచు
విశ్వకుటుంబంబు వింతగాఁ బెంచి;
ఆశానుబంధపాశార్తికిఁ జిక్కి,
ఆద్యంతశూన్యుండవై యున్న నీవు
తుది యేది మొద లేది తోఁచకున్నావు.

తుది దాఁకఁ బోదు వాదోసంబు లేదు;
మొదటికే పోదువా మోసంబు లేదు;
అది గాక యిది గాక యంతరాళమునఁ
దుది మొద లెఱిఁగి ప్రస్తుతిఁ గాంతువేని
నడిమింటి చిక్కులు నాఁటనే తీరు.

జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా, యనిపించు తెలివి యున్నదిర!

౨

కొడుకులసంపదఁ గూర్చియే చింత;
కూఁతుండ్రసుఖమును గూర్చియే చింత;
యిల్లాలిపెత్తనం బెంచియే చింత;
మనుమల కమ్మనిమాటకే చింత;
తనవారి కని యిట్లు తలపోఁతలాయె;
తన ముందుగతిఁ గూర్చి తలఁపలేదాయె;
తన కనిత్యంబైన ధనరాశికొఱకు,
తన కనిష్టంబైన తగులంబుకొఱకు,
తనుఁ గానివానిఁ జిత్తంబున వలచి,
తన కదియే ధన్యతమమని తలఁచి,
ఆత్మానుబంధంబు లన్నియు మఱచి,
మోహానుబంధ మేమో నిజంబనుచుఁ
తనకు మాలినయట్టి ధర్మంబుకొఱకు
పరమార్థ మెఱుఁగక పరువు లెత్తెదవు.
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

3

వింటివే యేశాస్త్రవిధులలోనైనఁ
గాలంబువెనుకకుఁ గాంచినయట్లు.
కంటివే యేలోకకథలలోనైన
వాహిని వెనుకకు వచ్చినయట్లు.
కాలంబు నీగట్టు కదలిపోయినది;
వాహిని నీవంక వదలిపోయినది,
నీకన్నవారికి నిలుకడ లేదు.
నిలుకడఁ గనియున్న నీజీవనమునఁ
గన్నవారికి నీకుఁ గలియనియపుడు

నీ నాత్మగతికిఁ జింతించుట మాని
వారికై నీకన్నవారికై యిట్లు
కన్నీరు విడుచుట కళవళపడుట
తాపలంబు గూర్చిన తటమట గాదె!
మోహంబు పేర్చిన ముచ్చట గాదె!
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

౪

జీవితంబే తనచేతఁ బెట్టితివి;
మూలంబు వానికే మూటఁగట్టితివి;
పెళ్ళిలేదని యేడ్చు పెండ్లాముఁ జూచి,
పెంచలేదని యేడ్చు బిడ్డనిఁ జూచి,
యిల్లెలఁ దనదని యేల యేడ్చెదవు?
ఇహా మెల్లఁ దనదని యేల యేడ్చెదవు?
ఇదియె సత్యంబని యేల యేడ్చెదవు?
ఇదియె నిత్యంబని యేల యేడ్చెదవు?
తనశక్తిఁ గానక తలరుట గాక;
తనముక్తిఁ గానక తలపోఁత గాక;
యిహలోకసామ్రాజ్య మెడసిన వేళ
పరలోకయాత్రకై పరుగిడు వేళ
సత్యమై తన వెంట జాయ రాఁగలదె?
నిత్యమై తనయుండు నీ వెంటఁ బడునె?
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

౫

చిమ్మచీఁకటిలోనఁ జిక్కిన నీకు
మిణుఁగురుపురు వేమిమేలు చేకూర్చు?
పొలి యేటిలోఁ బడి పోయిన నీకు
శీర్ణతృణం బేమి సేమంబుఁ గూర్చు
కార్చిచ్చులోఁ బడి కందిన నీకుఁ
బల్వాలం బేపాటిభద్రంబుఁ గూర్చు?
సుడిగాడ్పులోఁ బడి స్రుక్కిన నీకుఁ
దిరిగెడి యా కేమి తేకువఁ గూర్చు?
జ్ఞానసాధనల కంజలిజలం బిచ్చి
మాయాప్రకృతిఁ జిక్కి, మమతలోఁ జొక్కి
సంసార మెల్ల నైజంబైన దనుచుఁ
బామరత్వంబునఁ బ్రాఁకులాడెదవు
పరమాత్మవయ్యు నుపాధిభేదమున
వగచుచున్నావు జీవభ్రాంతి నిట్లు
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

౬

త్రావియుఁ దనతృష్ణ తఱుఁగని యప్పు
డమృతవిభ్రాంతి లో నందంగ నేల?
పలికియుఁ దనమది పట్టనియపుడు
సత్యకల్పభ్రాంతిఁ జరియింప నేల?
ఎఱిఁగియుఁ దనమోహ మెడలనియపుడు
సుప్రబోధభ్రాంతిఁ జూడంగ నేల?
కలిసియు నైక్యంబుఁ గాంచనియపుడు
మోక్షవిభ్రాంతిలో మునుఁగంగ నేల?
అది యమరత్వమే-యది బ్రహ్మపదమె
అది జ్ఞాననిలయమే-యది ముక్తితెరువె?
భువనముల్ శాసించుపురుషోత్తమునకుఁ
బ్రకృతిరాగంబునఁ బ్రజ్ఞాన మడఁగె;
తా నెవ్వరికిఁ గాక, తన కేరుఁ గాక,
వసియించు తనకు విశ్వభ్రాంతి యేల?

జీవుఁడా ! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!—

౭

అణువు బ్రహ్మాండమై యలముకొన్నపుడు
అణువులో బ్రహ్మాండ మడఁగియున్నపుడు
అణువుగా నీ వుండునది నిజంబైన
నంతట నీ వుండు వను టసత్యంబె?
పిన్నకుఁ బిన్నవై పెంపొందినావు;
పెద్దకుఁ బెద్దవై పేరుఁ గన్నావు;
మానాభిమానాల మఱుఁగనినాఁడు,
కష్టసుఖంబులఁ గలఁగనినాఁడు,
వెలుఁగుచీఁకటులకు వెఱవనినాఁడు,
జీవవిశ్వభ్రాంతిఁ జెందనినాఁడు
తగఁలంబు నీ కేల-తాటోటు గాని,
మోహంబు నీ కేల-మోమోట గాని
ప్రకృతిఁ బాలింపఁ గాఁ బలికితి వేమొ?
మాయ నేలింపఁగా మఱచితి వేమొ?
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర!
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!

౮

జ్ఞానభాస్కరకిరణప్రసారమున
మోహానీహారాంబుముగ్గాల ముడిపి,
సత్యబోధానందచంద్రోదయమున
మాయాంధకారంబు మాయంగఁ జేసి,
ఆత్మతత్త్వానుభవాధారనౌక
సంసారగంభీరజలనిధి దాఁటి,
అన్యదుర్లభపరమార్థమై యొప్పు
నిత్యసత్యబ్రహ్మనిలయమై యొప్పు
నీపురాణానంద నిలయంబుఁ జొచ్చి
ధ్యానయోగారూఢతత్త్వంబుఁ గాంచి
పరుసకుఁ బరుఁడవై బ్రహ్మానుభూతి
విజ్ఞానమూర్తివై వెలుఁగుదు గాక!
ఏకైకమూర్తివై యొసఁగుదు గాక।
ఘనయోగముద్రలోఁ గనుమోడ్తు గాక!
జీవుఁడా! నీలోనఁ జిక్కుకొన్నదిర,
దేవుఁడా యనిపించు తెలివి యున్నదిర!



# మాటకారి లయకాఁడు

ఆదిభట్ల నారాయణదాసుగారు



ఇరువదినాలుగేండ్లయీడున
అజ్ఝాడాదిభట్ల నారాయణదాసుగారు

తెలిసినపెద్దలు గొప్ప కొల్వుమాటముల వేళఁ గొలందిం బిన్నపెద్దలు హాయి నోలలాడునట్లు మాటాడవలయుఁ దీయఁగా గొంతెత్తి, పాడవలయు నొయ్యారముగా మువ్వడివరుస తప్ప కాడవలయును మరియుం బలు తీరుల మొదలి కదలికయందములఁ జూపరకున్ దీపు లూదవింపవలయును. ఆట పాట మాట మీటల వింతవింత తెన్నుల నెప్పటికప్పు క్రొత్తపన్నికల నోరులయొద్ద నేర్చుకొనకయే తనంతటఁ దా నేర్పరచుకొన్న చొప్పున లాతివారల కలవికాని చందమున నడివడల సొగసుల నెల్లరి వీనులకు న్గూనులకు న్గూడ విందుకావింపఁ జాలనివాఁడు మాటకారి లయకాఁడు కానేకాఁడు. ఆట పాట మాట మీటల నారితేరిన వాని కొక్కనికే యొచ్చటనైన న్దాఁ గోరుకొన్నట్లు హాయిగా బ్రతుకు కొనసాఁగఁగలదు. సొగసుగా నాడఁజాలనివాఁడు పాడఁజొచ్చు; సందముగాఁ బాడనేరనివాఁడు మాటాడఁబూనుకొను; మాటాడఁ జేతకానివాఁడు చదువును; జదువలేనివాఁడు వ్రాఁతకలవడును; వ్రాయనోపనివాఁడు మీఁ-లం బల్కించును. ఆట పాట మాట మీట చదువువ్రాఁతల న్గోరగాని సోమరిపోతులుంచ, యొరుల న్దూలనాడు చెందైన న్బని కిరాకంటు తెవులుకలె నెల్లరిచే నేవగింపఁబడును. మంచి యాట పాట మాట మీటల నేర్పున్నసుఱుకు వేవవేల న్గిక్కిరిసిన విందుకొల్వుల నెంతోనే పొడల్లు మఱపించి వేడ్కనోలలాడింమటరే. దుడ్డు కూర్చుకొను కోర్కతో నాడినదాటకాదు పీఁకులాటకాని; పాడినది పాటకాదు చెడుపాటగాని. మీఁటినది మీఁటకాదు చేతిత్రీఁటగాని; చదివినది చదువుకాదు గొడ్డుపాదువుగాని; వ్రాసినది వ్రాఁతకాదు చెఱుపునేఁతగాని ; కట్టినది పేళ్ళముకాదు గందరగోళముగాని. ఊపిరి తీసికొనుటవలె నాట పాట మాట మీట చదువు వ్రాఁతల తెల్విదేటలు పుట్టుకతోడనే తమంతట న్దామబ్బవలయున్గాని నేర్చుకొన నేరితరము. ఒకరి యాయువు మంచిచెడ్డ లింకొకరికి రాన ట్లొకరి యాటపాటల తెల్విదేట లింకొకరికెంత దేవులాడినప్పటికి స్నేనమాను పోల్కగానైన న్మమ్మాత్రికిం బట్టుపడనేరవు. ఆట పాట మాట మీటల తెల్వియో పసిక ల్లేర్పర్చువారలలో వొకవంతు ఖిల్లివారు. తొంబది తొమ్మిదివ్వ అవంతు లొంటెత్తు కొంటెటకటాంకులు న్గాకతీరదు. పెండ్లి పేరంటకములు, హెచ్చు తగ్గు పర్వులు, చదువు సందెలు, వ్రాఁత కోఁతలు, కుడి యెడమలు, మడి మైలలు, క్రిందు మీఁదులు, పొట్టి పొడవులు, లావుసన్నములు, కొద్ది గొప్పలు, తూర్పు పడమరలు, డా వలపైపులు, వినిక చూపులచవివెగటులు, మఱియు నన్నితీరుల మంచిచెడ్డలు న్నిక్కముగా నున్న దినుసులంబట్టి కావుగాని యెవరెవరెట్లెంచుకొని యలవడెదరో వారివారి యాయాతలంపులకొలంది న్దేలుచుండును. పుట్టు తెల్విదేటలు గల మాటకారిలయకాం డ్రెయ్యదియు నేవగింప కన్నిట న్మిగులఁ దన్విగొని పండొలిచి లోనిగుజ్జురు తినునట్లు నేరము లవలఁద్రోసి తప్పు లొప్పులు కావించుకొని తమ

తోటిపాటివారలందఱికి న్నేళే చేయఁనెంచి తాము పదుపాటంతయు వ్వొగసగు నాటయే, తీయనిపాటయే మంచిమాటయే, మేల్మిటయే యిరుగుపొరుగు లందఱి చేత నారాయని మెప్పించుకొని నెమ్మదిగా నే కొదుక యున్నేని మంచికాఁపురమును నొడలువంది పాటుపడుట కంటె వెల్లడింపఁదగు నాట పాట మాట మీట చదువు వ్రాఁతల వేఱ్కౌయింకెద్ది? ఎవరి యాట పాట మాట మీటలు వారికింపు. మెచ్చనీ లేక తిట్టనీ, యెవరేమను కొననీ గాని గాలిగాని యాటపాటలు గాలిగానివే, మరి పోలిగాని యాటపాటలు పోలిగానివే. పైవారు తిని త్రాగినంత నెవరికైనఁ దమ యాఁకలి దప్పికలు తీరునా? చుట్టాలేర్పఱచిన పెండ్లికొడుకు తావలచిన మగఁడు కాఁగలఁడా. కాకిపిల్ల కాకికి ముద్దుగా. మెడకట్టవచ్చు గ్గాని యెడకట్ట నేరితరము. తమంత ద్దామెట్లో పుట్టి గిట్టువారి కోరుల పడికట్లు మెడపట్టని మేఁనరికమువలెఁ గిట్టునా? పలుతెగల వంగడములు, నావివరుసలు, మాటి కసూర్కైత్తి బావిసకొలుపులు, లేనిపోని మోమోటములు, కల్లలిచ్చకములు, చాటుమాటలు, సందుగొందులు, కల్మి లేములు, పొంగుకుంగులు, కొద్దిగొప్పలు, తెప్పతిరు నాళ్లు, వేల్పుముచ్చట, వెనుకటివారి వెఱ్ఱి గొల్లసుద్దులు, మింటిమిద్దెల సొగసులు, పుట్టకముందు గిట్టినపిదప నయి కాఁబోవు మంచిచెడ్డల కవిలకట్టలు—వేయేల నూపిరితీసి కొనుట, యాఁకలి డప్పికలు తీర్చికొనుట మొదలగు నొడలిపనులకువలె నాట పాట మాట మీట చదువు వ్రాఁతకూటములు తానెంచుకొన్న వే తనకుసరిపడునుగాని యొరులబల్మి పనికట్లకు లోఁబడిన యతుకు మెతుకు కతికిన బ్రతుకు కుత్తదండుగే. కట్టులకు లొంగినపుడెంతవారైన నాల్మిగ లొండొరులతో నిచ్చకమాడుకొనక తీరునా? పెండ్లికిముందున్న వలపువేఁడి పిదప నావాఁటికిఁ జల్లారకుండునా? క్రొంగ్రొత్త వింతవింత చవులు కోరని నాలెక్కేదీ? పండుగవాఁడు న్యాఁతమగఁడేనా యన్న ట్లీ కొద్ది బ్రతుకునందు పాడినపాటే పాడురా పాచిపండ్ల దాసరీ యన్న పాటెతగాఁ దన కోరిన ట్లాట పాట మాట మీట చదువు వ్రాఁత నడువడు లేల జరుపుకొనకూడదో! తమ యిరుగుపొరుగుల కొక్కింతయేని గీడొనరింపకుండుటకన్న నెవ్వరికైన గ్గయికొనఁదగు కట్టుపాటింకెద్ది? నేలయందన్ని నోట్లవారు-నాడువారుకానీ, మగవారుకానీ గాని యొండొరుల పొత్తుగొని యొండొరుమీకు చెడని చొప్పున నెవరెవరు కోరినట్లు వారు వారాట పాట మాటలు మొదలగు వేడ్కల నోలలాడవచ్చును. నడుమఁ బ్రాఁతపనికట్ల గొడవ యెందుకు? తన బ్రతుకు హాయిగా జరుపుకొనుటకై తానొరులపొత్తు గొనక తీరదు. కాఁపు లేకున్నచో వంగినకొమ్మపండును నెవఁడు చేయి చాఁపకుండును? మొత్తముపై కట్టుబాట్ల లొంగినవారు తాము కోరుకొన్నట్లు హాయిగా బ్రతుకు గడుపుకొననేరరు. ఓర్పులేని యొంటెత్తుటక్కరి తాటోటు కట్టనిపనికట్లకు లోఁబడక పిచ్చినమ్మకముల ముక్కుమొనలేని ప్రాఁజదువు సోదెలకు లొంగక తోటిపాటివారితో సరిగాఁ బంచుకొని కూడు కుడువఁగల యొర్పరులే యాట పాటల హాయిగాఁ దమ బ్రతుకు గడుపుకొనఁగలరు. బాపండ్రఁట, దొరలఁట, చేరులఁట, కాఁపులఁట, మఱి యంటరానివారఁట, నీర్నిప్పు మడిమైలలఁట, చదువుసందెలఁట, వ్రాఁత కోఁతలఁట, చావు పుట్టు లూపిరితీసికొనుటలు, మిన్ను, మన్ను, నీరు, నిప్పు, గాలు లెల్లరికొక్కటే కదా—యొండొరులు హాయిగాఁ గలిసిమెలసి తమతమ కోర్కెలు నెరవేర్చుకొనఁజాలని యీడుముదిరిన వారికెల్ల నాట పాట మాట మీట చదువు వ్రాఁత నడువడి సొగసు చెడక తప్పదు తప్పదు. నంజాదు జ్ఞేపలు న్నమలకే యొసుఖులనైన నొప్పింప కెవ్వరికి జ్ఞేటుకోర కందఱను మిగుల హాయిగానుంటకే యెల్లపుడుం బ్రొద్దు వేల్పున కొక్కయదలందే మ్రొక్కుచుండువార లొక్కరే యాట పాట మాట మీటల గ్గడదేరి హాయిగా బ్రతుకఁజాలెదరు. తా సేవలు చేయునపుడు తనకు న్దన తోటిపాటివారికి గూడ నొడలెడదలు రెండింటికి న్గూడ మసుఱున్నంతవఱకు హాయి కొనసాగుచుండునో యా పనులకే యాట పాట లను పేరు నిక్కముగాఁ దగియుండును. వేయేల? యాట పాట మాట మీట చదువు వ్రాఁత కూటమి మొదలగు సేవనల కైనప్పటి కొంటిగాఁ బుట్టిపెరిఁగి యొంటిగా గిట్టకతీరని యే మైత్రాల్పునకైన నొరుల పడికట్లతో నిసుమంతయుం బనిలేనే

లేదు. కాని యొకప్పుడు తన తోటివారు చెప్పినట్లు తనకోర్కె నెఱవేర్చుకొనుటకొఱకే తాను నడుచుకొనక తీరదు. తమ మేలుకొఱకే యొరుల కెవరైన నేమైన కావించుచున్నారుగాని తా మొనర్చిన మంచికి మాఱు చెడ్డ తప్పక వచ్చునని తెలిసికొన్నవారు నూతఁగూలిన బెబ్బులికి నగయితో డీవెఱచున, ట్లాఁకటనొప్పిగలు పామునోటఁ బాలుపోయు వొల్లని తెలుఁగున, తమ తోడివారలకుఁ గలనైన నేమలుచేయ దొరకొనెదరా? ఏపని చేయుటచేతఁ దనకు నవతోటిపాటి మైతాల్పులకున్గూడ హాయి కలుగునో యాపనియెల్ల నాట పాట మాట మీట చదువు వ్రాఁత కూటమి మొదలగు వేడుకలలోఁ జేరినవే. కావున నాట పాట మాట మీట మెలపుల నవమకుగాని, తమ తోటిపాటి కేని తాల్పులకుఁగాని కీడుకావింపని తీరున న్నడుపుకొనుటకన్న మేలయిన పడికట్టింకెవ్వియు న్గానేరవు. తన యూపిరి మెలఁపుకొను కుళువు తనపుట్టుకతోనే తన కలవడియుండఁగా నాయూపిరి తీసికొనువరకెఱుంగుటకై ప్రాఁజదువులం బిక్కపెట్టి పల్లించవలయునా? యెల్ల నాకన్న వారల కాల్లంపి సుకవలయునా— డబ్బుకక్కుర్తిబడి గుడుల వడలవలయునా — దిమ్మదిరిగి యొల్లెడ నేర్లఁ జెఱువుల నూతులఁ ద మ్మునిగి కొఱడువారవలయునా? మగవాఁడు మగవాని వాఁడు దాఁడుదాని నగలియుఁగోరరుగా కనుక మగవాని యాట పాట లాఁడుదానికి నచ్చఁ యాఁడుదాని యాట పాటలు మగవాని కింపుగాక మానవు. మగవానికొఱకాఁడు దాఁడుదానికొఱకు మగవాఁడు నడుపుకమానరు. ఎవరి కట్టుపాట్లు వారికొకరి యింకొకరికి సరిపడవు. సిగ్గుమాలి మాటకారి నమకొని మగవాఁడు పురిటాలి కాన్పునొప్పు లుగ్గడింపుచుఁ జీపర పాపరతీఁగలఁ జేపలబుట్టల్లినట్లు పనికిమాలిన పన్నికనగి తము కలము సిరా దండుగ వ్రాఁతల నెల్లడించనీ మఱియు నాఁడది మగవాం డ్రను గూర్చి తనకుఁ దోఁచినట్లు కొరగాని వ్రాఁతకూఁతలం బన్ననీ గాని, మగవారైన నాఁడువారేని తమ్ముం దామే తెలిసికొనఁజాలరుగా. ఇఁక నొండొరు గడింపఁగల్గుటెట్లు? నిజముగా నాలూ లేదు చూలూ లేదు కొడుకు పేరు కోటయ్యయను సామెతగా నోటికివచ్చిన కూఁత చేతికివచ్చిన వ్రాఁత డబ్బుకక్కుఱితి మాటకారితనము. తనబొమ్మ నద్దా వ్రాసికొనలేఁడుగాని యొరుల యుచ్చుమచ్చు వ్రాయుచెంగలి; తన్నుఁ దా బ్రతికొంచుకోలేఁడుగాని యొరుల యుసుఱుగావఁబూను వెకలి; పుట్టుకముందు నిట్టిన పిదపనుగూడఁ గడచిపది కాఁబోవుపదియు నుగూడ లెక్కింపదొరకొను వెడఁగు; తాఁగోరుకొన్న కలయైన నగఁజాలక తన తలిదండ్రు లెవరో తనంతఁదాఁ దెలిసికొననేరక వేల్పున్గూర్చి యెద్దియో సోదచెప్పఁ ద్రాబ; యేనాఁడో చెల్లిపోయిన మా తాతగారు వ్రాసిన ముక్కలు వారి నోటవచ్చినట్లే నేవచ్చుముగాఁ బాడఁగలనను తక్కులాడు; ఒకం కెవేసి పదివేల సున్నలుచుట్టఁగా నెంత లెక్కవచ్చునో యన్ని వేలేండ్ల క్రిందట నీనేల పుట్టియుండక తప్పదు లెక్కలం బేరెక్కె డెబ్బదేండ్లు మాపుఁ బవలనక పలుచోట్ల నెలకొన్న పెక్కుమంది పేరువేరుగా లెక్కించిన పు డందఱికిన్నరిగాఁ దేలిన లెక్కంబట్టి మింటం జందమామకు వెనఁదట్టు తొమ్మిదివేలతొమ్మిది వందల తొంబదితొమ్మిన మ్మప్పావంత మొత్తముచే హెచ్చవేయఁగా వచ్చినన్ని యామడల మేరఁదప్ప కొక యొజ్జీమలబారు వంకర టింకరగాఁ బ్రాఁకుచున్నదని నిక్కముగా నొక్క వక్కాణింపఁగలనను టక్కరి; నే నెవరికిఁ బుట్టితినో నాకుఁ దెలియదుగాని ప్రాఁత వ్రాఁతలం బ్రాఁజదువుల నారితేరినవాఁడ నామాట నమ్మకతీరదు; వేల్పునోటినుండి బాపఁడు, రెబ్బలనుండి కేఁడు, తొడలనుండి కోమటి, యడుగునుండి కాపు పుట్టినారు. కనుకఁ గ్రిందినుండి మీఁదివఱకుఁ గల్గినవారు వరుసగా నొకరికన్న నొకరు గొప్పవారు. గొప్పవారికిఁ గొద్దివారు తప్పపట్టరాదు. మఱియొండొరు తెగలవారికిఁ గంచము మంచము పొత్తులు పనికిరావను పలువ; కట్టు బొట్టు, జుట్టులంబట్టి వేనవేల తెగలయి యొండొరున్దమ్ముకొని తెగటార్చుకొనఁబురికొల్పు వెంబఱి, తప్పులెన్ను వారు తమ తప్పు లెఱుఁగరన్నట్లు రచ్చకెక్కి కూటికక్కుర్తి నగవుచెప్పు తంటాలముచ్చు; మొత్తముపై నిండ్లు వాకిళ్లు కూడుగుడ్డ లొరుల నెట్లయినఁ జెఱచి తాబాగుపడుటకై దేవులాడు తులువ. మొదలుగాఁ జెడుగొట్లెట్లో కొంకెతనమునఁ దాము పన్నిన కుట్రయంతయు నొల్లీటిపెద్దలు చేసినపడికట్లనిచాటుకొనుచుందురు. మగవార లాఁడువార

అందఱున్నూడ నెచ్చోటనైన నొండొరులమికతోఁ బొంది పొసఁగి హాయిగాఁ గలసిమెలసి తమతమ బ్రతుకులు గొప్పగాఁ బొడిగించుకొనఁదగు వెరవెఱిఁగి సరిగాఁ గూడుగుడ్డలు వంతు పంచుకొని కుడువ నెంచుటకన్న మేలగువడువడి పడికట్టింకెద్దియు మన్నాటికి న్లేనేలేదు. తొల్లింటి పెద్దల పడికట్లన్నియు నందఱు నొండొరులమిక న్నొత్తుగొని కలసి మెలసి హాయిగాఁ దమతమ బ్రతుకు కొనసాగించుకొనుటకే కదా హెచ్చరించుచున్నవి. గాలి, నీరు, నిప్పు, మిన్ను, మన్నులవలనఁ గలుగు చావు ముప్పెవ్వరికైన దప్పించుకొనఁ దరముకాదుకదా! అది యట్లుండఁగాఁ గోరి లేనిపోని తంటాలు తగుల్చుకొని యొండొరులం జంపుకొనుట యెుక తగవగునా! యెుగులల జంపి తిన నలవడిన కట్టిఁడు లొండొరుల నదమలోఁ దమ్ము జంపుకొనక మానరు. కనుక చేఁపలన్నంజాడు ద్దినవొల్లని జాలిగుండియ లొక్కరే యెవ్వరికైన నెన్నలొనర్పఁదగియుందురు. ఆట పాట మాట మీట చదువు సందె లట్టి జాలిగుండియలకే నిక్కముగాఁ జెట్టని సొమ్ములగును. మఱియు నెల్లపుడు దమతోటిపాటివారికి మేలే తలంచు మాటకారిలయకాండ్రు కొరుల పడికట్లతోఁ బనియేలేదు. కలనైన న్నంజాడు నమలనొల్లక తమ తోటిపాటివారితో సరిగా వంతులు పంచుకొని యొండొరులమికతోఁ గూర్కి తిండి కూటమి హాయిం బ్రతుకు పొడిగింప నెంచుకొను మంచి వారికిఁ బ్రాఁజదువు సందెలుగాని, గుడి బడి మడి మైలలుగాని, పలుతీర్ల కట్టు, బొట్టు, జుట్టు, వాలకములుగాని వెక్కిరింపు టక్కులుగాని, బాపన, దొర, కోమటి, కాఁపు, మాల మాల తెగలవాసిగాని, మఱి యేబూటకపు కటికిపడికట్లుగాని కసింతయు న్గొరకానేకావు. ఒకరికన్న నొకరుహూను గుడ్డలెక్కువగాఁ గూర్చుకొనఁగోరిన ములుచలే తనకట్టింకొకరికి ముక్కు యను సామెతగాఁ బైవివరించిన కట్టడిపడికట్లం బన్నుచున్నారు. నిక్కముగు మాటకారిలయకాఁ డొరుల కట్టుబాటున కొకింతయు న్లోఁబడనొల్లఁడు. మఱియు నిక్కముగు మాటకారిలయకాఁ డొక్కఁడే తన తోటిపాటివారికి మేలు చేయఁగల మగవాఁడు. తోటిపాటివారందఱు నెన్నచ్చుకొనుతీరున నాఁడుదిగాని మగవాఁడుకాని యేనాఁటివారుగాని మఱెట్టివారైనగాని వెల్లడించు నడవడులన్నియు న్మంచి యాట పాట మాట మీట చదువు వ్రాఁతలే— ఒకరిపాట యింకొకరికి మెుత్తి; మఱియు నొకరియాట యింకొకరికిఁ జిత్తి. మంచిచెడ్డలు తలంపులకొలంది న్దాటుమా అగుచుండును. పనిలేనిపాటుగాని యాటపాటలు వేరే కొని తేవలయునా—తన పిల్లల ముద్దుముఱిపెములు తన యిల్లాలి నర్మిలి సొలపుచూపులకన్నఁ దాఁ గని విని యుప్పొంగఁదగు నాట పాట లింకెవ్వి—డబ్బుదండుగ నెమ్మదిచెఱుపు తప్పఁ బలిమి నేర్చుకొని యంటించుకొన్న బూటకపుటాట పాట మాట మీటలవలనఁ గాసింతయు న్మేలు చేకూరదు. డబ్బు కక్కుర్తితో నాడిన యాఁటగాని, పాడినపాటగాని, నుడివిన నుడువుగాని, మీటినమీటుగాని, వ్రాసినవ్రాఁతగాని, చదివిన చదువుగాని, చేసిన మఱేచేఁతగాని పూటకూళ్ల తిండివలె, వెలయాలికూటమిలాగు, చెడిపె నోముమాడ్కి, చేటు తేకమానవు. తన తలిదండ్రులెవరో తనకూర్కుననఁ దా నెట్లుండెనో కుంతయు నైలిఱుఁజాలని వెంగలి తాఁ దెలిసిన చదువరి, మాటకారిలయకానివలె లేనిపోని సొరకాయలు నఱుకుటెంత దుండగము? ఎంత తెలిసిన వారంత తెలియన ట్లడఁగి యుందురు. మఱియుం దమ తప్పులు వెల్లడిగా నొప్పుకొందురు. దమురులేని పెంకె ప్రేలి పడునన్నట్లు వెలితికడవతొణుకు హెచ్చన్నతీరున, డబ్బరిపాటకుఁ దలద్రిప్పుటలు మెండన్న సామెతగా, సదవుటెక్కుల చక్కదనము చూపు మాలకాకులవలెఁ టిక్కుపెట్టి వల్లించుకొన్న నాలుగింగిలిముక్కుల డాబు చేయు వెకలి కక్కుర్తిటక్కరి కొంటె పొగరుఁబోతుల యాట పాట మాట మీట ప్రాఁతప్రాచి బూటకములకుఁ దగు కొల్వుకూటముల న్నందిరాదు. డాఁపల నొడ్డులు మఱిపల పలనరవలు ద్గాడి నేలవేము చిన్నిపూఁదేని యన్నవలె సెగతెగు లిసురుఁబోఁడిన్లాగు, లేటతీయని తెలుఁగాట పాటయందము న్వెగటు కావించుచున్నారు. గుండె నిబ్బరములేని బోటు యరవబయకాండ్రు సివమెత్తినట్లు తలకాయ లూపుచు, ముక్కుపాట పాడుచు, మెత్తని తెనుఁగుపలుకుల మూతిబిగించి, దొడలాడించి నమలుచు సరిగా నొంతెత్తి యందము ల్గురియింపఁజాలక

మువ్వడిరవళుల పడికట్లు నడుపు నేర్పున మిసులఁ గొఱఁత పడి వెక్కిరింపు వెలితి మెట్టులిడు లొడబిడకుఁ గనిక రమే డాలుచేయ నేరని మంచి తెలుఁగునాటువారు వింత పడి తెలిసీ తెలియక తఱచుగా మోసపోవుచున్నారు. కన్నడము కస్తురి, తెలుఁగు లేట, యరవ మద్దానము, హిందూస్తాన్గర్, తా నను సామెతకుఁ దార్కాణ ముగాఁ—నవ్వులో గవ్వలు గిలకరించునట్లు—చెంబునీ రొలకఁబోయున ట్లొక్కింతరైన నానికలేని మోటయరవ మాట పాటలు—చదువరి మాటకారి తెలుఁగునాటి మేటి లయకాండ్రు పాటింపనొల్లరు. పాట కరవము పనికిరా దనియేకదా యరవలు తమ నాటుపల్కులు మాను కొని తెలుఁగు దర్వులు మరుగవలసివచ్చెను. బాపురే! యింటికుడుపు సరిగాలేనపుడేకదా వెలిచవిన్దగులుట కల వడకతీరదు. ప్రాఁజదువులు పిక్కపెట్టి పల్లించి వల్లె వేయునట్లు పలువురుకూడి యెక్కపట్టిన అచ్చుకెక్కి యంటించుకొన్న యెరవుటెక్కుల బడాయిచూపు బొంతకాకులవలె నరచు కఱుకుటరవమోటకఱబయకాం డ్రకల్ల పల్కుల కుబ్బుదేబల నేమనవలయును? నేలయం దెల్లఁ దూర్పుఁగడలి, పడమట గ్గడప, డాపల వొబ్బిలి, వలపైపు నెల్లూ రెల్లలుగా నడుమఁ జెన్నకటియేలు,— గోదరి, నాగేళ్లు, నాల్గు వ్వలపైపునుండి దాపలిపైపున నలరారునో టంతయు ద్దెలుఁగువాడే. యెల్ల తెఱంగుల పాడిపంటల ద్దెల్వితేఁటల న్వన్నెవాసుల గ్గన్నకల్మి చెలి నలువరాణు లిరువురికిం బుట్టిల్లయి, చదువరి మాటకారి లయకాండ్ర కన్నతల్లియై, యెదురులేని మేటిజగజెట్టి దొరల కాఁపురమై, యెప్పటికి స్వేరుపెంపుల నీడుగాన కొప్పారుచున్నది. ఒడళ్లు గ్గారునలు పెక్కించి నడను డుల నిల్కడ సెడలించు సెండసెగ తెసులుగాని, యెగ్గె త్తనీక మేనుకొఱడువారించి వడవడ వడఁకించు మంచు పాటుగాని, యొక్కింతయు గ్గానక, పాళమగు చలి యెండల హాయికావించు తెమ్మెర—తెనుఁగునాటునకుఁ జెట్టనిసొమ్ము—కనుకనే వేనవేల పిన్నపెద్దల గ్గిక్కి జెసిన గొప్పకొల్వులం బూటలకొలఁది గ్గొండలమాఱు ప్రోఁగింపఁజాలు నందములఁ గురియింపఁగల మేటిచదు వరి మాటకారి లయకాండ్రను — నిల్కడగల తొల్కరి మెఱుపులవలెఁ జూపఱకుఁ దీఁవులొదవించు నాటకత్తె మిన్నలను—విడిచేతుల గ్గొప్పిల్పులలనైన ద్దెగటార్పఁ దలకొను వేఁటకాండ్రన్—దురమున నెట్టయిన నెమకా డని పోటుబంటులన్—ప్రాఁజదువుల నాటితీరి మంచి నడువడి నసుఱున్న దమక నొక్కింతయు ద్దప్పని గొప్ప వారును వేయేలా నేలయందెల్లఁ దెనుఁగునాఁ డన్ని తీరుల వన్నెవాసుల ద్దక్కినచోట్లకన్న మిన్నగా పెన్నుకొనఁ దగినది. తెనుఁగునాటినుండి వందలయేండ్లకుఁ బైఁగా జరు గుబడి గ్గొఱవడి కొలఁదిమంది వెలనాడు మురికినాడు మొదలగు తెగల తెలుఁగుబాపండ్రు ఱెండ్రు కోమటులు కాఁపులలవనాటునఁ గాఁపురముచేయుచుఁ—దమ తెలుఁ గుపలుకు నింపు సొంపు పెంపులా యఱవగొడవ నేమఱి— తెనుఁగరవముల పలుకుల రెంటిని వెక్కిరించు చూఱఁ బందియు గ్గా కడవిపందియు గ్గా కిబ్బంది యను సామె తఁగా—నరవయేఁచతోఁ దెలుఁగుదర్వులల్లి—తమ తమ తల్లిమాట పర్యేతీయుచు ద్దప్పఁబొడుచు—సిగ్గుమాలి నిక్కపు మాటకారిలయకాండ్రవలెఁ గూటి కక్కుత్తి ద్దేవులాడుచున్నారు. పరువైన బాపఁడు తురకవాని పోల్కిగాఁ దనకుఁ గొడుకుపుట్టెనంచునా - తగిన తెలుఁగు లయకాఁడరవతురకలు మొదలగు లాఁతిబయ కాండ్ర యేఁచం బట్టఁదలంచునా - తెలుఁగువారుగాని యరవలుగాని వారివారి పల్కులు వారివారి తల్లియేఁ చలంబట్టి తమతమ యాట పాట మాట మీటలు పెల్ల డింప నొప్పనుగాని - యొకరిలా గింకొకరు పనిచేయఁ బూనిన నయ్యవారిం జేయఁబోయిన కోఁతిచందమయ్యె నను సామెత కాదా.

నిక్కముగా నాఁడువారికి మగవారు మ్మగవారి కాఁడువార లాట పాటల గ్గసులకతీరదు. మగవాండ్రు మగబాండ్ర చాఁడువా రాఁడువారల గ్గవయుతీరున వారిని పీరు వ్వీరిని వారు గ్గసులు కొంత నసుబాటో - తెల్ల బియ్యము పాటె మానిక - వడ్లగింజలో బియ్యపుగింజ - యనెడు రెఱుఁగరు? మగవాఁడు నీళ్లాడఁగలఁడా లే కాఁడుది చూల్గావింపఁగలదా? మొగము మన్న చేసి కొన్నఁగాని దొరను జూడరాదఁట. మీసల ద్దీయించి కొని గాజులు తొడిగించుకొని పైటవేసికొని మగవాఁడు

తైతెక్క లాడినఁగాని యాఁడుది మెచ్చదఁట. యే మీ వెఱ్ఱి-యీ వాలకము! మగవాం డ్రాడువారివలె, మఱి యాఁడువారు మగవాండ్రవలె - బాపఁడు తురకలాగున, మఱి తురక బాపనివలె-వాలకము వేసికొన్న దప్ప నాట పాట మాట మీట లేపాటియుం బాటికెక్కఁ జాలకుంట నీనాల్గుతెగల యేర్పాటు నెంతయో తొల్లి వన్నెవాసులు గొన్న యీ నాటిపర్వపు డిట్లు పదటఁ గలియవలసివచ్చెనా? నోటిపలుక్కలే నిక్కములు గాని వేల్పు మదులం బ్రాఁజదువులు, వ్రాఁతకోఁతలు మింటి మిద్దెలం, గుడిబొమ్మలు, తెప్పతిరునాళ్లు, శివమెత్తుటలు, టక్కరి యెఱుక సోదెలు, పెక్కల తాను ద్దనతోటి పాటి వారికెల్ల హాయిగా బ్రతుకుటకై నొసటిచెమ్మట నూడ్చి పాటుపడి కూడుగుడ్డల న్గూర్చుకొనఁదగి యెల్లరు న్మెచ్చుకొనఁజాలిన పనులు తప్పఁ - దక్కిన వెనుకటి పుట్టుకలు రాఁగల పుట్టువులఁ గూర్చి కాని-మింటిపాలదారి పలురు చుక్కల లెక్క న్గూర్చికాని-తాము పుట్టకముందు గాని చెల్లినవెనుకఁగాని యయి కాఁబోవు పనులఁగూర్చి కాని, వ్రాసిన వ్రాఁతలన్నియు మత్తకోఁతలే-బొత్తుగాఁ జెఱుపు చేఁతలే. టక్కరి ముచ్చు సోమరిపోతు పెంబఱితొత్తు దబ్బర పన్నికలే. మింటి మంటిదినుసు లన్నింటి న్పుట్టించుచు నెంచుచు న్దనలోఁ గల్పుకొను వేల్పు, మైతాల్పులకెల్లఁ గావలసిన యాట పాట మాట మీటలవేడ్క వారి వారి బ్రతుకులందు నడనుడుల నిమిడ్చి యేయున్నాఁడు. లాతివారు తమ్ము మెచ్చి తనకోర్కు లిచ్చుటకుఁగాని మ ఱేకట్టుబాటులకై లొంగవలసి వచ్చుటచేతఁగాని యెట్టి మలివైనన్గాని మఱి వెల్లడింపక తీరని యెట్టియొడలికదలికయైనన్గాని తనకుఁగాని, యొరు లకుఁగాని, నిందుతనివి, హాయి మేల్లెప్పటికైన నిడఁజా లవు. నిజమైన మైతాల్పు పోడిములం బన్నినవేల్పు న్గొని యాడఁబో కెంతయో దుడ్డు వెచ్చపెట్టి మెఱుఁగుబొమ్మ న్గొని తెచ్చుకొని డబ్బుకక్కురితితో నాబొమ్మనుం దాని జొక్కిన టక్కరి న్గూడ మెచ్చుకొను వెంగళులవలె బొమ్మ లాటలు, కోయ్యమీటుచప్పుడు, మగయాఁడు వాలకముల పోకళ్లు, పిక్కపెట్టి పల్లించుకొన్న లాతిపలుక్కలు వెక్క రింపునడనుడులు, పిచ్చినమ్మకముచేఁగాని కొంటెసెపము నఁగాని తాము చదువరి మాటకారి మిన్నలుగా మఱి యీవి కాండ్రుగా నోరులు తమ్ము మెచ్చుకొనఁగోరి శివమెత్తి నట్లు వణఁకు తెగులు తగిలిన తీరునఁ దలలూఁపుచుఁ జెవులు జిల్లులువడఁ జప్పట్లు చరచుచు, వెకిలినవ్వులు నవ్వుచు లేనిపోని గోలపెట్టు దెశల కీ మప్పుడు మెప్పులు తప్పవు. తుమ్ము వినవొల్లక బిగ్గఱగా పరచుటయు, డొక్కలూడుటయు, బ్రాఁజదువుల మొఱ్ఱపెట్టుటయుఁ గూలికఱచు దుమ్ముకేఁగ న్గాళ్లకు జంగెలు కట్టుకొని వెలతొత్తులచిందులు క్రొక్కుట మొదలగునల్లరులన్నియు న్గొంటెసెపము పన్నికరయొత్తులుగాని నిక్కమైన యాట పాటలు కానేకావు. ఆట పాట మాట మీటలచవి గుఱ్ఱ తెఁగిన మాటకారిలయకాం డ్రొకరిద్దఱికి మించి యెందైన నంట కడునఱుదు. మిగిలినవారందఱు న్గొడ్డళ్లే. కొందఱు నానవేసిన గొడ్డళ్లు, మఱికొందఱు నానవేయని గొడ్డ ళ్లంతే యీ రెండు తెగలవారికి నాసి. ఆటపాటలు తెలిసిన ట్లెద్దియో మూల్గుచు వెడవెడనవ్వులు నవ్వ చిడ్డదిడ్డ ముగాఁ జరుపుచుఁ దోఁచినట్లెల్ల నఱచుచు న్దెలిసీ తెలియక కొందఱిన్మెచ్చుచు న్గొందఱి నేవగించుచు—మువ్వడిఱవ ళులు కనిపెట్టఁజాలినట్లు తలలూఁపుచు, జేతులాడించుచు నుడినడల గుట్టెఱిఁగినవారివలెఁ గొందఱియెడఁ జెవులుం బిఱుచుచుఁ దనవారు కొనియాడిరను నెపమునఁ గొం దఱి న్గొండాడుచుఁ జప్పట్లు చఱచుచు లేనిపోని పిచ్చి యెఱుఁగువారే నానవేసిన పాటగొడ్డళ్లు. నిజముగా నా కాట పాట లొక్కింతయు న్సరిపడవుసుమా; దొమ్మతెగు లంటినట్టి లేఁకుట్టిన వేపిలాగు గోలపెట్టు చొక యోడలు విఱుచుకొని యెద్దియో యఱచుట విన నోప; నెందుకు పనిచేటు, డబ్బు దండగ, పనికి మాలిన దేబఱ దుడ్డు పాడుచేసినకొననీ పనిబాట్లకుఁ జెడనీ, నేనుమట్టు కే మాటకారిలయకాండ్రనైన నా గుమ్మ మెక్కుటకుఁ గసింతయు నొప్పుకొందువా యని గోటుచూపు కొంటెతంటాలముచ్చు నానవేయనిపాట గొడ్డలి. మొత్తముపై నెవ్వరో తప్ప నెందైన నంద ఱున్గూడ నీరెండు తెఱఁగుల గొడ్డళ్లలోఁ జేరినవారే. ఆట పాట మాట మీట నడిఱవళుల న్నిండుకొలువుల వేడ్కఁ జొక్కించఁగల చేవ న్గొఅవడిన వారే యిట్లుబుసుమాలిన

ప్రాంతకోఁతలకు దిగవలసివచ్చును. నిక్కమగు మాటకారి లయకాఁడాడి పాడి నిండుకొలువులఁ దన యాటపాటల మెలఁపు వెల్లడించుచుఁ దనంతఁ దాఁ బన్నుకొన్న యాటపాటల చెలువు గుర్తించుకొనుటకొఱకే గొప్ప వ్రాయసకాఁడై యాటమాటల స్వేల్పములన్గాడ వేర్వేఱుగా వ్రాసి వెల్లడించుచుండును. లయకాఁడు కాని వాఁడు మాటకారి కానేరఁడు.

మఱి మాటకారికాని వాని యాట పాట మాట మీటలపని కొల్వునకుఁ బనికిరాదు. కావున మాటకారి యున్నలయకాఁడున్గాడ నొక్కఁడే కాక తీరదు. బొంత కాకివలె నఱచుచు నెన్నియో మాటలఁ గొలఁకువాఁ డెల్ల మాటకారి కాఁడు. సంగీతము న్దన యాట పాటలలో గుట్టెఱుంగని మొజ్జ లయకాఁడు న్గాఁడు. మాటకారి యున్నలయకాఁడున్గాడ నొక్కఁడేయై యెవఁడైన నెప్పుడేనిఁ జక్కందనాల హాయిబ్రతుకుఁ గల్గుట యొక్కడనయిన నిక్కలి యెఱుఁగరు. ఆట పాటల చవి కని విని హాయిఁ గొనసేరని మూఁగలు వ్రాఁతగుర్తులు చూచుకొని యేమో తమకుఁ దెల్వి తేట లబ్బె ననుకొని యుబ్బు మూఁచలను రెడలినవారి మెచ్చటించు వెంబడులుకారే. తేల్పవన్నిక లను కుత్తుకపల్కులు నృత్తి యొడలి కదలికలే నిక్కముగా నాట పాటల వెల్లడింపఁ గలవుగాని తక్కినవారు పన్నిన డొక్కల వ్రాఁతలు మొదలగునవి యాట పాటల నీడలు, వాలకములే కాని నిక్కములుకావు. పిల్లకాయలు తెల్వితేటలులేని వెంగళులు న్దుంటరులు తప్ప మనసులేనిపనిముట్లు కూఁత వ్రాఁత చేతలఁ బుట్టు చేవగల మాటకారిలయకాండ్రను సరకు చేయనొల్లరు. పెండ్లికూఁతురుం బెండ్లికొడుకు లొండొరులకువినిపించి యగపరచుకొను మనసనదల చెలువముకన్న నిక్కముగ నాట పాట మాట మీటల వేడ్క యింకెద్ది? బడులంట, గుడులంట, పడికట్లంట, యూపెరిత్తీసికొను నేర్పు మప్పుటకుం జదువు వ్రాఁతల పెరవు నేర్పుటకు నెలసంబళము కొల్వుగోటులంట. పెరికొలఁదిఁ జన్నెలు మగనికొలంది న్వన్నెలు. నూనూఁగు మీసల మగవాఁ డెదిగిన పదుచు న్పచరించు కులుకుపలుకులకంటెఁ గని వినఁదగు నాట పాటలు వేఱేవి? పదునాలుగేండ్ల యీడు మీటారియు బదునెన్మిదేండ్ల కోడెకాఁడాడినదే యాట; మఱియుం బాడినదే పాట, యన్నదే మాట, మెలఁపినదే మీట, కాని—యాపిదప నాఁడుదిగాని మగవాఁడుగాని యీడుముదిరినకొలంది వారివారి యాట పాటలు నవకముచెడి పెంకుకట్టిన తాటిముంజవలెఁ దీయఁదనముఁ గొలఁదివడక తప్పదు — మొత్తముపై ముప్పదియేండ్లు దాఁటిన యీడునఁ గాఁపురపుటిడుమలు హెచ్చినకొలఁది నెద్దియో నెపమునఁ గక్కుఱితిగా నాడి పాడి నోడవలసివచ్చును—గనుక—నొరులపడికట్లకు లొంగినకొలఁది నాటపాటలు చప్పఁగాక తీరదు. అంటించుకొన్న రంగులవలె, నెరువు తెచ్చుకొన్న సొమ్ములతీరున, దబ్బుకొఱకై కాని పేరు గడించుకొనుటకై గాని, యెన్నియో లేనిపోని వాలకములుచేసి — టక్కరియెత్తులు పన్ని డాలుచేయువారల యాటపాటలు — వెఱ్ఱినీళ్లవలె నప్పటికిఁ గొంచెము వేడ్క నొదవించియుఁ దుదకు మంచికి మాఱు చెడ్డ చేయకమానవు—ఎచ్చోట నెల్లవార లొండొరుల పొత్తునఁ గూడు గుడ్డల కల్మి సరిగాఁ బంచుకొని కుడుచుచుందురో—యచ్చట నాఁడువారుగాని మగవారుకాని యేయీడువారైనగాని యెవరిమట్టున వారు హాయిగాఁ దమతమ కోరినట్లు వేడ్కతో నాటపాటలు వెల్లడించుకొని యొరుల న్దనియించి తాము తనియఁ గలరు. ఒకొక్కరిదొకొక్క గొంతు — మఱొకొక్కరిదొకొక్క యొడలికదలికతీరు కొకరిసొగసింకొకరికెంత తన్నుకొన్నను మఱెంత నేర్చుకొన్నను రాదు, రాదు. అలవాటు మచ్చికల కొలఁది నెవ్వరికైన న్దమవికాని పైవారివికాని యాట పాటలు చవిగొల్పక మానవు. ఒకొక్కనాటున కొకొక్కయోఁచ — ఆట పాటలపట్ల చిన్నప్పటినుండియు నేర్యోఁచ కలవడిన వారి కాయోఁచయే చవిగొల్పి వేడ్క పుట్టింపఁగలదు. ఒకరి యోఁచ నింకొకరు—కుత్తుకలు మఱి యొడళ్లు తీర్లు పలు తెరగులు కనుకఁ—బట్టుట కుంకించు నెడల—నాయాట పాటలు వెక్కిరింపు వేళాకోళము—లరవబయకాండ్రకు వలెఁ గొంతవింతచవిమాఱుపు పుట్టించినప్పటికి—నిట్టక కడకు వెగటువిసుకులఁ బుట్టింపకమానవు. పుట్టుచేవ

తల్లిపాలవంటిది. మరియుఁ బెట్టుచేవ పోతపాలవంటిది— తన కన్నతల్లిపాల్ద్రావి పెరిఁగినబిడ్డవలె యే దాదిపాలనో యెదిగినబిడ్డ తనకన్న వారిపరువు నిలఁబెట్టుకొనఁజేరదు— మిక్కిలి శ్రేష్ఠి కలవోటఁ బుట్టిపెరిఁగినవారల గొంతులఁ గాని పడుచుబడ్డిన్నాని తలంపులన్నాని నెమ్మది నిలుకడలు గొనసాగఁజాలవు. అందు కరవలే వల కడలిదాపునఁ దారాక్కాణము. నిక్కముగా నరవనాటివారికి ముత్తముపైఁ గోతివడలతీరులు తోఁబుట్టువులు. కనికర మామాటనోషపాట టక్కరి పెంకెయరవలు తమవలె నీమెత్తని తెలుఁగువారు సొగసుగా వాడి పాడఁజాలరని చాటుచాటున వదరుచు — మాటకారిలయకాంద్రవలె నోటికివచ్చినట్లనుచుఁ — జేతికి వచ్చినట్లెల్ల నచ్చు వ్రాఁతలు వెలిపుచ్చుచుండురు. పుట్టుచదువరి మాటకారులయకాఁ దీదుముదిరినకొలంది న్దోటిపాటివారలకు సరిపడునట్లు పూలాపులు, మగఁటిమి, సెనరు, పగపు, వెర, యుబ్బరము, కినుక, యేవ, యను తోమిక్కుడిచదువుల చొప్పునఁ దవ పుట్టుతెల్వితేటలంబట్టి యాట పాట మాట మెలపులన్వెల్లి గురియుచు—నోరులకు హాయిగొల్పి తా నిండుతనివిం జారగొనుచుండును. కాని యొంటెత్తు టక్కరి సోకె ముచ్చు తుంటరి వెంబరి విత్తులు, వారికంటె పేరుగొప్ప వీరికంటె వారు తక్కువవా రని — కొంటెతనమునఁ గొండటీఁ బొగడుచు— మతికొందలిం దెగడుచు—నెవ్వరేమైనన్నరే తమకు దుష్ట సమపూరినఁ జాలునని తలలూఁపుచు—దగవరులవలెఁ దమతప్పులుమాటు పరిచి యొరులదోసఁగు లెగ్గించుచు— లేనిపోని పాఁతకవితెకట్టు బొంతకాకులవలె చెవులు చిల్లిపడ నఱచుచుఁ బదివేలయేండ్లక్రిందట చేనాఁడో చెల్లిపోయినవారి పేరుపెట్టి యడ్డదిడ్డపడికట్లు కొన్ని యేర్పరిచి తమకుఁ బనికివచ్చిన తీరునఁ గొన్నిసామెతలు విప్పిచెప్పుచు—నివి తొలుచదువు లివ్వి వేవేలయేండ్లక్రిందటఁ జిమ్మచీఁకటితప్ప మరేదినుసైనను లేనపుడు తవంతఁ దాఁబోడమిన వేల్పు మడులని వాడుకలో లేని నోటఁబట్టని కఱకువ్రాలను—ముక్కుమూఁతులు బిగించి యేమేమో తడిపొడి తొరుమాఱుదుపులు—నడునడుమఁ దెచ్చుకొన్న కట్టుబాటు గోఁటుల వాలకములతోఁ దమవలె చాటుపాటుల టక్కు లగపరచనే

రని మంచివారల నృవికిమాలిన మొద్దులని తూలనాడుచుఁ దమ యిరుగుపొరుగులకన్న నెక్కుడు కల్మిపూర్చుకొను టాటోటులు—పుచ్చిన గొజ్జెమంద నంతయు నైఱచునట్లు—తాముచెడుటయేగా కొరులన్గూడఁ జెఱచుచున్నారు. మైతాల్పు లంద ఱెవరియంతవారు వారెట్లో పుట్టి పెరిఁగి గిట్టకదీరకుగా. తన మేలుకొఱకే తనతోటిపాటివారితోఁ దాఁ బొత్తుగా మెలంగవలయు ననుపలు కొక్కటియే పెద్దలవలనఁ బిన్నలు తప్పక నేర్చుకొనవలయును గాని—యూపిరితీసికొనుటయు నగ్గిక్కి మెలపుకొనుటయు నగలకొనుటయుం, బండుకొనుటయు, మేల్కొనుటయుం, బల్కుటయు, నాడుటయుం, బాడుటయుం, దలంచుటయు మొదలగు నొడలికదలికలు—పుట్టుకతోనే యబ్బవలసినపోడిమి యెవ్వరికైన తనంతటఁ దాఁ బొడగట్టవలయున్గాని — యొరులయొద్ద నేర్చుకొన్నపుడు సొంపుచెడుటయే గాక బ్రతుకునకుఁగూడఁ జేటు లేక మానదు. సిరి యబ్బదు కాని చీడ యబ్బునన్నట్లు తెల్వితేఁట లబ్బవుకాని వెక్కిరింపు చదువువ్రాఁతలు—పనికిమాలిన బూటకపు టక్కరివాలకములే పట్టుపడక తప్పవు. ఒరుల చెడ్డపనులు నేర్చుకొనవచ్చునుగాని మేలుచేయుట కొకరి కొకరి కొండొరుమిక్కన్న సులువిఁ కెద్దియు నమ్మించి మప్పఁజాలరు. తనయెడల నొరులెట్లు నడువఁగోరుదురో తా నొరులయెడల నట్లు నడుచుకొనక తీరదను మంచిదారి నొక్కటియే పిన్నలకుఁ దగిన పెద్దలగపరుచఁగలరు. బాపండ్రఁట, దొరలఁట, చేరులఁట, కాపులఁట, మాల మాలమాదిగలఁట, యెన్నెన్నో తెగలఁట, యంటరాదఁట, ముట్టరాదఁట, యొండొరులఁ దన్నుకొని క్రొవ్వి కోరి యొండొరుల బొలయునట్లగ్గిబుగ్గి గాలి నీళ్లకు — మడిమైలలం దన్నుఁ గట్టఁ బ్రాల్లు తాఁ దెచ్చుకొన్నట్లు తెలిసీ తెలియని కట్టడము లాహా! యొకరి యాటపాట లింకొకరికిఁ గిట్టక యొండొరుల సేవగించి, నిండుతనివి యోర్పులపై నెల్లెడ న్నిండుకొన్నవేల్పుం దమతోటిపాటి వారి నద్దమ్మునవలె నెమ్మినము తెమ్మనఁ గొలువనొల్లని పొగరుఁ బోతుల బ్రతుకు పోకళ్లు నిక్కముగా నెల్లెడ నల్లుకొని యొగ్గ్రాఁకు నంటుతెవుళ్లే—నంజుడు నమల కేయొనలి



3. విష్ణువు

అయిదవ శతాబ్దమునాటి మధురాశిల్పచిత్రము.

(కుడిప్రక్కది సింహము తల. ఎడమప్రక్కది వరాహముతల.)



౮. బేరాముగూర్

(సింహములను చంపు.)

'షానామా' లోని వర్ణచిత్రము నకలు. పదునాఱవశతాబ్దమునాటిది.

తాల్పులనైన స్తంపనొల్లక—వెఱ్ఱినీళ్ల ద్రెళ్ళిమాలి తూలి పడక—యిరుగుపొరుగులతో సరిగా వంతు పంచుకొని కూడు గుడుచుచు, నొడలువంచి పాటుపడి, యించుకేనియు నెవరినైన నొప్పించక, లేనిపోని గోటుఁజూప కండకెరొద్దఁ బెగు వడఁకువతోఁ దిరుగనేర్చినవా రెట్లు పాడనీ యాడనీ పల్కనీ మహోపనులైన జేయనీ యెన్నేండ్లయిన బ్రతుకనీ యట్టిచదువరి లయకాండ్ర యాటలే పర్యాటలు. పాటలే తేనెయూటలు; మాటలే ముద్దులమూటలు; డబ్బు గడించుకొనుటకై లేనిపోని వాలకములు వేసికొని విఱ్ఱవీగరాదు. చెట్టు పేరు చెప్పుకొని కాయ లమ్ముకొనవేల? తన తాత గడించిన దుప్పటిం దా గడించినట్లు డాబుచేయఁ జెల్లునా? యొరుల యాటపాటల పరువుతీసి చచ్చి చెడి సున్నమై తమవలె నేర్చుకొన్న దేబెల స్వీకరింపఁ జాలివంతనే తా మెంతో చదువరి నెఱజాణ మిన్నలవలె నెరవుసొమ్ముల నగయిచేసికొని గోటుమాపు బూకరి ముచ్చుల కూరేమి పేరేమి? అయిదుబడులు నేర్చుట తన తలంపుల వెల్లడించుతీరున వ్రాయఁగల్గుటకుఁ గాని కొల్యుకూటములఁ బానొక వ్రాయసకానివలె నెప్పటికా యయిదుబడులే వ్రాసి చూపించుటకుఁ గాదుగా. తొల్లింటిపెద్దలు వేలువేలు తెన్నుల నమతోటిపాటివారెల్ల నాఁడువారుకాని మగవారలుకాని తమతమబ్రతుకుల గ్గొరఁదగిన నింకుతనివి చేకూరుటకుఁ గావలసిన యొండొరుమీకం బండించి వేడ్కతేనియ యూట లూరించు కూర్మి యోర్మి పేర్ముల జతగూర్చి వనువను పడికట్లన్నియు నప్పటప్పటి యదను పదనుల కొలంది నేర్పరిచిరికాని—యప్పటి కప్పుడు నెవరుమైఁ బాఁడిపంటలు గొనసాగించుటకై ప్రొద్దువేల్పు కురియించిన వాననీ రెక్లెట్లు మిఱ్ఱుపల్లముల సరిచేసికొని యే యే చెరువులేయే పొలముల కాయాపంటలకుఁ దగునట్లు మలఁపుకొనవలయునో యా తెరవెఱఁగి తెల్వితేఁటలు కలవారు తమ కోరినపంటలు పండించుకొనఁగల్గిన తీరున— నెల్లవారలు తరుణమునకుఁ దగునట్లెల్ల పనిబాటుల నేర్పుతోఁదమలోఁ దాముపొత్తుగొనియప్పటికప్పుడుతగినదారులేర్పరుచుకొని యే నెపమునసైన నొండొరుల నేవగింప కేయుసుఱులనేనిం జంపనొల్ల కేవంజూడునైనఁ జవిచూడ దొరఁకొన కన్ని తెవుళుల వ్యాప్పఁదగు కాయగూర పాల్పెరుగు వెన్న జున్ను మీఁగడ నేయి మజ్జిగల పెంపందించు వాలమందల గాపాడుకొనుచు మంచినీట నగదీర్చుకొనుచు నెట్టి యిడుములైన నోర్చుకొని పదినెలలు కడుపునమోసి పిల్లలగ్గాంచి పెంచి తమ యొసుఱులకన్న నెక్కువగాఁ గాపాడు నొప్పులకుప్పలగు నిల్లాండ్ర నే నెపమునైన నొప్పించక, కీఁదు చలసి మున్గిపోవుచున్నవారి చేతిపట్టున కందీయందకే యొడ్డునకు నెట్టి బ్రతికించు నేర్పరులవలె జెపరిన గుఱ్ఱములనెక్కలఁపున దిప్పుకొను రౌతులలాగున మచ్చికనొకువ కావించుకొని పొరపాట్లు సైరించుకొని యిరుగుపొరుగు లోరాయని మెచ్చుకొనుతీరున తమ మంచి నడువడిగ్గాంచి తమంతఁ దమ తప్పులు దిద్దుకొని పరువుల గొప్పకాఁపురము నొనసాగించుచుం జెద్దపేరెక్కిన మగవారలు గూడ నాడినదే యాట మఱి పాడినదే పాట వేనవేలు పిన్న పెద్ద లుల్ల పిల్లనట్లుడుగుకొల కట్టింపువడి నేర్పుమై నాడుచు నదనతలంపుల పొడిమిం బాట మాట కూర్పుల గనుపండువు సీవముల విందు న్మాతి మాటకి గ్గొత్తచవులు వెల్లిగురియింపఁజాలక వల్లించుకొన్న తెలిసీ తెలియని వాలు గెంగిలిముక్కల న్వాడిన పాటబాడురా ప్రాచిపండ్ల దాసరీ యన్నట్లు లాఁతిపన్నిన పా[illegible] మాట కూర్పుల నదనొటికివచ్చినట్లు కూటికమ్ము వేషగాఁడు నిజముగా నొరుల మాట మోయు కుంటి గాలిగాఁడే. మఱిట్టి చిలుకపలుకుల యెక్కిరింత పిట్టన్నిందు కొల్యుగద్దియ నెక్కించి మెచ్చుకొనువాఁ డొక నాఁడైగాఁడే. తనయొక్కచ్చిపోలికకొలంది నదనతలంపుల నగడు వింత వింత యాట పాట మాట మీట చదువుసంబెల పొకడల నెప్పటికప్పుడే క్రొంగ్రొత్త చవులూర నచ్చనాటు తేటమడుల న్గాని లేకొక్కవేల్పు నొడువుల న్గాని వెదచల్లి వేలకొలందిఁ బిన్న పెద్దల నేడ్క నోలలాడింపఁ గలవాఁడే నిండుగొల్యుగద్దియ నెక్కఁదగిన చదువరి నెఱజాణ మాటకారి లయకాఁడు గాని యద్దెకెద్దు నరవ పెక్కరింపు టక్కరివేషగాఁ డెల్ల నుత్త తిండిదండుగ కొఱగాని కొం బెగాఁడే తనగొంతురవళిపడి యేర్పరుచుకొనఁజాలని ముచ్చటకుఁ గొయ్యదుక్క వ్రేఁత యొకకొంత యూఁత

కై పనికివచ్చినప్పటి కాఁడొక్కరొద నిక్కముగా నొక నోటిపాట కాఁగల్గునా? కొమ్మవలె న్గొయ్యబొమ్మ కాఁపురము చేయఁగలదా? ఒకఁ డెద్దియో చదివి చెప్పుచున్న ముచ్చట న్దెలిపికొనఁజాలక యాతాటాకుకట్ట న్వ్రేలాడు నులక త్రాడ న్జూచి తనమగని మెలత్రాడు న్దలంచుకొని వెక్కివెక్కేడ్చు తెంపితిమ్మక్కవలె “యెందుకు పెద్దలవలె” అను పాటయొక్క సొగసం తయు నద్దానివ్వన్ని పాడిన లయకానితోనే చెల్లిపోయె.. నా మేటిమాటకారి కుత్తుకరవళిచేడ్క—యా గొప్పచదువరి తోడనే సమసిపోయె—నా మేలుబంతి పాడినతీరి దేయని సిగ్గరి నేటి టక్కరి కొయ్యకీలుద్రన తోఁచినట్లు చప్పుడు చేయుచు—నోహో, యెంత వెల్లడిగాఁ గొంచెపైనఁ గొంతెత్తఁజాలక వ్రేలాడించునలవాటుతో వచ్చినయంద ము రానీ కెట్టు మొజ్జరొద దంచి పచ్చడిచేయుచున్నాఁడో—యే మా జా డే మా యొరయి కే మాయురు కే మాలా గే మా యో గే మా కచ్చుబడి యే మా పంపకే మే మా అవ యే మా పాడి యే మా లేఁతదన మాపోకడ లేమారాకడ లను తెలిసీతెలియని వెఱ్ఱి మొఱ్ఱిమెప్పురులఁబట్టి కట్టెమ్రోఁతలు పేరెక్కవలసి వచ్చెను. వాఁడు మీసలు గొలిగించుకొని పైటవేసి కొని యాఁడుదానివాలకముగైకొని కొల్వునాడునవు డే నిజమైనయాఁడుదికాని పనికివచ్చునా? వాడు బానంత డొక్కకడుపు తగుల్చుకొని పురిటాలినొప్పులు పడున ట్లే నీళ్లాడునాడుది పడఁగలదు? బాపురే వీఁడు కొయ్య యాఁడుట—వీఁడు డోలువొత్తుట—వీఁడు డొక్క తట్టుట—వీఁడు తాళము కొట్టుట—వీఁడు తీఁగఁ బ్రా ముట—వీఁడు కట్టెచాటుట—మీటుట — గీయుట— రాయుట లోహో వేయేల—యే నోటిపాటయైనం బనికి వచ్చునా— అదేమోకాని యే నోటిపాటయైనన్గాని నా చెవికి గిట్టనేగిట్టదుసుమా — నేఁటి కొల్వంత యొక్క గొట్టమూదుట కే యేర్పాటు కావించితిని—నీడ పిడికిటఁ జిక్కనీ మాననీ కాని — యానీడవ్వట్టుకొనుట కీతఁడు తన తెలివితేట లెంత వెచ్చఁబెట్టుచున్నాఁడో — యా తంటాలుపడుటకే నూటపదాఱు లీఁదగు—నాహా, వాఁడు పాడినట్లే వీఁడు పాడఁచున్నాఁడు — తలయూఁచుట, మూతి ముక్కులు త్రిప్పుట, దొడలాడించుట, మాటలు నమలినమలి పెదవులు బిగించి ముక్కుపాట పాడుట, తన పాడు పాట తలంపులెట్టియున న్వ్యల్లడించనీ కాని—చేతు లెట్లో యాడించుచు గింజుకొంట—యోహో యెరువు వెక్కిరింపు మాపు డాట పాట నాట మీట చదువుల వంకర టింకర యొడలి కదలిక లద్దిరా వెఱ్ఱివెంగ ళాయలకుఁ దప్ప సరియగు చదువరి మాటకారి లయ కానికి న్సరిపడునా? తన తలంపుల న్దనతోటి పాటివారి కెవరెవరి కప్పు డప్పు డెట్లెట్లు తెలుపవల యునో యా తీరు పెద్దలవలన నేర్చుకొన్న న్దప్పఁ దమకుఁదోఁచిన ట్లెవరైన మాటాడఁగూడదు, చదువఁ దగదు, వ్రాయరాదు. మరియు న్గాడుగుడ్డలు కూర్చు కొనుటకు నిండ్లు వాకిళ్లు, తోఁటలు న్దొడ్లు కాల్వలు బావులు చెఱువులు మొదలగు బ్రతుకునకుఁ గావలసిన వెరవులెల్లమందు మ్రాఁకు లదనుపదనులు దొట్టి యన్ని పనిపాట్లు నెరవేర్చుకొను సుళువులు తగినపనివాండ్ర వలన నేర్చుకొనక పట్టుపడనేరదు. వేయేల? యాట పాట మాట మీట మెలఁకువలు తప్పఁ దక్కినపనులన్నియు నొరులయొద్ద నెంతనేర్చుకొన్న నంత మంచిదేకాని— నిజముగా నాట పాట మాట మీటల తెల్వితేట లెవ్వరి కైన న్దమపుట్టుకతోనే యబ్బవలయున్గాని యొరుల యొద్ద నేర్చుకొని యొకరిలా గాడుటకున్గాని, పాడుటకుఁ గాని దేవులాడిన కొలంది నొరుల యాట పాటల సొగసు తమ కబ్బదు సరేకదా యదివఱకుఁ దమకుఁ బుట్టువుతో వచ్చిన సొంపున్గూడ మొదలుచెడి మనువు ద ప్పిఁగి యెవ్వరికైన న్గన విన నింపుగా కొకటికోయఁబోయి యింకొకటి కోసినట్లొరులకు వెగటుపుట్టుటయేకాక పై పెచ్చు చీవాట్లున్గూడఁ దప్పక లేకమానవు — ఆటపాట లీడుమదిరినకొలంది నొకనాఁటి కొకనాఁ డలవాటు పెంపారినకొలఁది న్నునుపెక్కి పుట్టుతెల్వితేటలు కొనసాగి — నిండుకొల్వు కూటముల వేలకొలందిం బిన్నపెద్ద లందఱికి న్దప్పక మిక్కిలి హాయి కావిం పఁగలుగును. తినక, చవిచూరక లోఁతు తెలియరా దనునట్లు పుట్టాటపాటల సొం పాడి పాడినకొలంది న్వన్నెవాసుల నెన్నిక న్గనుచుండును. తనకుఁ

బుట్టినవాఁడు నిక్కముగాఁ దన కన్నకొడుకని పరువైనవాఁడు వెల్లడించుకొనఁ జెల్లుఁగాని యొరులకుఁ బుట్టినవాని న్దాఁగన్నట్లు చాటుకొనుట నగుబాటు కాదా! తన పుట్టుతెల్వితేటలంబట్టి తనగొంతు రవళి నృత్తియుఁ దనయొడలి కదలిక నెల్లడింపనోడి— డబ్బు లంకించుకొను టక్కరితనమున నొరుల వెక్కిరింపుల కుబ్బు ములుచల న్లోఁగొనఁగోరి—లేనిపోని వాలకిములువేసి తలకు మించిన పరువులిడు పలుఁగాకులారా యాట పాట మాట మీటల పరువుతీయుచున్నారే. తమతమ తోఁచినట్లు తమపుట్టుచేవ న్నెలకొల్పి—యెడ తెగని గొప్ప యలవాటుకొలంది—నెవ్వరి కెద్ది యింపగునో యాగుట్టు తెలిసికొని—తమంతటఁ దా మొరులు కోరిన ట్లెల్లఁ బలుపోకల నాట పాట లెవ లేని నేర్పరితనమున — నప్పటి కప్పుడు వింతవింత తీరుల న్గొండనెలయేలు భాంగిపాఱలి పిన్నపెద్దయలల న్మిన్నుముట్టి కుత్తుకబంటి తీయని తేట నీటి న్వెల్లిగొల్పు చందమున—గొప్పకొల్వుకూటముల నలరింపఁగల చదువరి మాటకారి లయకాండ్రొక రిద్దరికి మించి యెన్నఁడైన నెందైన నానాఁటికి కన్నెవాసుల నీఁబుచుఁ, దమ వలచి నన్నిఁటేం ట్లోడలి బింకమున నెట్లయిన నేకొఱంతయు గానక—తోటిపాటివార లందఱికి న్నానాఁటికిఁ దమపైఁ గూర్మికెట్టింప—సాటిలేని పేరుపెంపునం బోటికెక్కఁగల చూపరి పేల్పుంతు లీ నేలయం దెల్ల నందురేమో? ఒరులయొద్ద నీవు నేర్చుకొని యలవాటు చేసికొన్న వెక్కిరింపులు మా కక్కఱలేదు — నీయంత న్నీవు నీ పుట్టుతెల్వితేటలకొలంది న్నీ తలంచినట్లు పన్నుకొన్న యాట పాట మాట మీట మెలఁపులే మాకుఁ గావలయుఁ గాని యొరుల యెంగిలిముక్కలు కతుక కెరవుసొమ్ముల న్దాల్చి గోటుచేయు కొరుల పోల్కి మచ్చు నొక్కింతయు నెల్లడింపక నీపుట్టుచేవ యెద్దియో తెల్పఁ గల్గదవేని యీ నిందు కొల్వు గద్దియ నెక్కుమా—యని తెగిన చదువరులు నొక్కి వక్కాణించినపుడు—దొరకొల్వున నిలిచి తన యాట పాట మాట మీట మెలఁపుల న్గంటలకొలంది గ్గమపండువుగా వీనులవిందుగాఁ బెక్కువేల పిన్నపెద్దల న్గోరిన ట్లెల్ల హాయిగొల్పి కొల్వుఁ జూరగొనఁగల మగవాఁడేఁడీ—కచ్చకట్టినదెల్లఁ బప్పువండ నేర్చునా? కోరిన ట్లెల్ల నొక్కవేల్పు మడిగ్గాని లే కొక్క నాటుమాటగ్గాని వలచిన చవులు వెల్లిగురియఁ గుత్తుకరవళి గ్గాని—వడిగ్గాని — హెచ్చుతగ్గు లెట్టింపుకొల నొకింతయు దప్పక—మొక్క మొలచిన ట్లాటపాటలం బెక్కువేల పిన్నపెద్దల హాయి న్జొక్కించువాఁడే నిక్కమగు చదువరి లయకాఁడు. మఱియొక్కచేతఁ దిరుగ మొదలిడిన గడియారపుముల్లు వడకవడిగ గడియకు మెల్లమెల్లగా నామరయొక్క వదలి బిగి తగ్గినకొలఁది సరిగా నొక తీరు కొలత ద్దామగూడఁ దగ్గుచుండియును దన యడుగువడి తగ్గుదలమేర దెవ్వంతయేని నెవ్వరు గ్గనిపెట్ట నలవికానట్లు తుద కాఁగిపోవును. మొదటి గొంతురవళి గాలివడి రానురాను లావుసన్నములు కాకతీరదు. మఱియు న్నడక కొల నింపాది కాకమానదు. కొఱవి మొనయందలి చిచ్చు మెఱ పాకొఱవి కదలికన్బట్టి తాఁగదలుచున్నట్లు— మఱియుఁ బలుతీరుల నెట్లగపడునో—యట్లే రవళి కదలికంబట్టి యద్దాని హెచ్చుతగ్గులకొల తోఁచుచుండును. తలంపుకొలంది న్నలివుపొడమించు పనిముట్లగు కుత్తుకనరముల లావుసన్నములంబట్టి రవళి వడి హెచ్చుతగ్గు లేర్పడుచుండును. కొఱవికొనయందలి చిచ్చు కొఱవి కదలికన్బట్టి పలుచెల్వములన్దోఁచునట్లు గొంతునరముల కదలికంబట్టి నలివు పెక్కుతెఱఁగుల హెచ్చుతగ్గు రవళివడుల న్వివపడును. ఎట్టి కదలికయైనఁగాని మ కేవంకయుఁగాని లేకయే కొఱవి కదలికవంకలంబట్టి యద్దానికొనఁగల మెఱపు కదలిక చెలువులఁజూపట్టున ట్లీకుత్తునరములకదలికంబట్టి నలివు పలుతీరుల హెచ్చుతగ్గు గాలిపోతలవలనఁ బలుతీరులఅవళివడులన్వివనగును.కనుక నాటపాటల మంచిచెడ్డలన్నియు నెవరెవరికెట్లెట్లనుకొనెదరో యాయాతీరులనొప్పెడఁగట్టుచుండును. మ రెవరెవగు తలంచుకొన్నట్లు వారివారికాయాటపాటలు తోఁచుచుండును. నిక్కముగా నేయే పడికట్లంబట్టి యెవరికిలంపు లెట్లెట్లొదవుచుండునో యా యాయిపడికట్లకన్న నేర్పర్చఁదగిన కట్టుబొట్లాట పాటల కుమఱివే తేవవఁగా నాటపాటలన్గూర్చి యెవరిపడికట్లు వారివి కనక మాటకారి లయకాండ్రెందఱు నెవరంతవారు

లములు లేకుండపోవును; విదేశాంగవ్యవహారములను చక్కబెట్టుటలో స్థిరత్వము లేకపోవుట తగ్గిపోవును. ఒక ప్రభుత్వము రాజీనామా యీయవలసిన పరిస్థితు లేర్పడినప్పుడు పరిపాలనాచక్రమున కేవిధమైన అడ్డంకియు లేకుండ ఇంకొక ప్రభుత్వము ఏర్పాటు కాబడుటకు దానివలన కల అవకాశము లే దీనికి కారణము.

ఇంగ్లండునం దుండుచుండిన* ద్విపక్షపద్ధతికి వ్యతిరేకముగ యూరప్ ఖండమందలి దేశములో వివిధ పక్షపద్ధతి అమలునం దున్నది. దీనిప్రకారము ఆయా దేశముల పార్లమెంటుసభలలో భిన్న రాజకీయాభిప్రాయములు కల అనేకములగు పక్షము లుండుటయు, వాటిలో కొన్నిటిసమన్వయమువలన ప్రభుత్వ మేర్పాటుగాబడుటయు, ఆయాపక్షములమధ్య సంయోగము తెగ్గిపోయినప్పుడా ప్రభుత్వము పడిపోవుటయు, మరల అట్టి అస్థిరమగు ప్రభుత్వమే దానిస్థానమందు పరిపాలన నడపుట కేర్పాటగుటయు జరుగుచుండును. ఫ్రాన్సు, జర్మనీ మొదలగుదేశముల రాజకీయపక్షములచరిత్ర మనము గమనించినచో అచ్చట పక్షప్రభుత్వ మెంత అస్థిరమగు పునాదులపై ఏర్పాటుకాబడినదో తెలియగలదు. వివిధ పక్షవిధానమునందలి లోట్లను కొన్నిటి నీక్రింద పొందుపరచెదము:—

(i) ప్రభుత్వవిషయములలో సమత్వము, ఏకత్వము లేకుండపోవుట. ఒక ప్రభుత్వమువారు కొంత పనిని చేసి విడిచినచో ఆపనిని గురించి వేరొకవిధానము నింకొక ప్రభుత్వమువారు ప్రవేశపెట్టుటకు ప్రయత్నించినప్పు డీలోటు బాగుగ స్పష్టపడును

(ii) ద్విపక్ష పద్ధతియందుండు ప్రభుత్వముల యొక్క స్థిరత్వ మీపద్ధతిలో నుండదు. కొన్ని పార్టీలు కలసి ప్రభుత్వము నేర్పాటుచేయుటకు పూనుకొనినచో, మరికొన్ని కలసి ఆప్రభుత్వమును త్రోసివేయుటకు ప్రయత్నములు చేయుచుండును. ప్రభుత్వస్థిరత్వము ప్రతి చిన్నపక్షముయొక్క అభిప్రాయములపైనను, చర్యలపైనను ఆధారపడియుండును. ప్రజాసమూహమునం దల్పసంఖ్యాకులుగా నున్న పక్షమువారు ప్రభుత్వముల జీవితములనుగూర్చి నిర్ణయించుట కవకాశములు కల్గియుందురు.

(iii) ప్రజాపరిపాలనావిధానము (Democratic Government) నకు ప్రధానమగు ప్రజాసమ్మతము ననుసరించి పరిపాలన జరుగుట యనుమాత్రము ఆచరణలో నుంచుట కవకాశములు దీనివలన చాల తక్కువగ నుండును.

పైన చెప్పిన దానినిబట్టి రెండు రాజకీయ-పార్టీ లుండుటవలన అంతయు లాభమే యనియు, ఆపద్ధతి యందు లోపము లేవియు లేవనియు తలంచుట పొరపాటు. ద్విపక్షపద్ధతియందలి గొప్పలో టొకటి కలదు. అది ఏదనగా:—ప్రజాస్వామ్యపరిపాలనాపద్ధతి ప్రకారము దేశమం దున్న వివిధపక్షములవారికిని, వివిధాభిప్రాయములవారికిని, వారివారికి ప్రజాసమూహమునందు గల బలముప్రకారము చట్టనిర్మాణసభయందును, పరిపాలనా విధానమునందును తగుప్రాతినిధ్య ముండవలెను. అనగా ప్రతి అల్పసంఖ్యాకపు పక్షము, అభిప్రాయము కూడ ప్రభుత్వవిషయములందు పాల్గొనుటకు, తమయభిప్రాయములను వెలిబుచ్చుటకు తగునవకాశములు కల్పింపబడవలెను. ఇట్లు అల్పసంఖ్యాకుల అభిప్రాయములను వ్యక్తీకరించుకొనుట కవకాశముల నొసంగని ప్రభుత్వవిధానము ప్రజాస్వామ్యపరిపాలనా మాత్రముపై నాధారపడియున్నదని చెప్పుటకు వీలు లేదు. ద్విపక్షవిధానము ప్రకారము అల్పసంఖ్యాకుల యభిప్రాయములకు మన్నన దొరకకుండుట చాల తక్కువసందర్భములలో జరుగువిషయము. సర్వసాధారణముగ పక్షనాయకులు, పక్షమునం దధిక సంఖ్యాకులుగ నున్నవారు ఏవిధముగ చేయుమనిరో దనో ఆప్రకారమే పక్షమువారందరును చేయవలసియుండును గాని సొంత యభిప్రాయముల ప్రకారము

* ఇంగ్లండులో కార్మికపక్షము ఏర్పడి పార్లమెంటునందు బలమును సంపాదించునంతవరకు ద్విపక్షపద్ధతియే ఆచరణయం దుండుచుండెను. కాని తరువాత మూడుపక్షము లేర్పడి బహుపక్షపద్ధతిలో నుండు కొన్ని లోట్లు ఇంగ్లండుదేశరాజ్యాంగవిషయములలో కూడ ప్రవేశపెట్టబడెను.

వడుచుకొనుటకు వ్యక్తుల కవకాశ ముండదు. ఇట్లు వ్యక్త్యభిప్రాయములను, అల్పసంఖ్యాకుల యభిప్రాయములను తెల్పుడుచేయుటకు అవకాశములు నీయకుండుటయు, వాటి నంతమాత్రము గణింపకుండ నుండుటయు నే ప్రజాస్వామ్యపరిపాలనా సూత్రమునందును, పార్లమెంటరీవిధానమునందును ప్రధానమగు లోపములలో నొక్కటనియు, వాటియందు ప్రజలకు నమ్మకము క్రమక్రమేణ తగ్గిపోవుటకు ముఖ్యకారణమనియు మనము గ్రహింపవలసియున్నది.

కాన ద్విపక్షవిధానమునందుకూడ కొన్ని లోపములు కలవనియు, బహుపక్షవిధానమునందుకూడ కొన్ని లాభములు లేకపోలేదనియు జ్ఞాపక ముంచుకోవలెను. ఇప్పుడు ఈ రెండుపద్ధతులలో ఏది హిందూదేశమున కెక్కువ లాభదాయకము, ఎక్కువ అనుకూలమైనదియు మన మాలోచింపవలసియున్నది. ఇప్పటిపరిస్థితులలో హిందూదేశమందు మత సాంఘిక భేదముల ననుసరించి పక్షము లేర్పడుట ఆచారముగ నున్నదనియు, రాజకీయవిభేదము ననుసరించి పక్షము లేర్పాటుకాబడుట ఎక్కడనో కాని జరుగుటలేదనియు, దేశీయ రాజకీయ పరిస్థితులను గమనించు ప్రతివారికిని తెలియనగును. ఈ మతవిభేదములపై నాధారపడియుండునట్టి పక్షములు సాధారణముగ జాత్యైక్యమున కడ్డంకులనియు, జాతీయ భావములను, సంఘీభావమును పురికొల్పుటకు బదులవి జాతియందు పరస్పర విరోధములను పెంపొందించుననియు కూడ ఎల్లరకును తెలియును. దేశమునంతను జాతిమతవిభేదములపై నాధారపడియుండు చిన్నచిన్న చీలికలుగ చేసి ప్రభుత్వమును సరియగుపద్ధతులపై ఏర్పాటు చేయుటకు ఇవి వీలు లేకుండ చేయును.

ఇన్ని లోపములు మతము ననుసరించి ఏర్పడుపక్షము లుండుటవలన, అందరకును తెలిసినప్పటికిని కలవనిఈ ఆగష్టు 8-వ తేదీని బ్రిటిషు ప్రభుత్వమువారు తయారుచేసి ప్రచురింపజేసిన, మత సాంఘిక నిర్ణయమునందు (Communal Award) కూడ ఈ భేదములను పెంపొందించుట కనుకూలముగ నుండునట్లు ప్రత్యేకసాంఘిక నియోజక వర్గములే ఏర్పాటుచేయబడుటకు నిశ్చయింపబడినది. ఈ ప్రత్యేక నియోజకవర్గములు ప్రతి అల్పసంఖ్యాక పక్షమునకును ఏర్పాటుకాబడవలెనని దాని ప్రకారము నిర్ణయముకాబడినది. హిందూదేశమందలి వివిధ మత సాంఘికకక్షలును తమలో తాము ఈ సాంఘికసమస్యను పరిష్కరించు కొనలేకపోవుటయే బ్రిటిషుప్రభుత్వము వారీవిధముగ నిర్ణయించుటకు ముఖ్యకారణమని ప్రచురింపబడినది. పైన చెప్పబడిన ప్రభుత్వనిర్ణయమే అమలులోనికి వచ్చు సందర్భము లేర్పడినచో హిందూదేశమునందు పార్లమెంటరీపద్ధతులు ప్రవేశపెట్టబడినప్పటికిని ఆవిధానము వివిధపక్షసూత్రముపైననే ఆధారపడి ఆచరణలో నుంచబడునని తలంచుట కవకాశములు కలవు.

కాని నిజముగ మనదేశములో ప్రజాస్వామ్యపరిపాలనసూత్ర మాచరణయం దుండవలెనని మనకు నిశ్చితాభిప్రాయము కలదేని, దానికి ప్రధానమగు మార్గము ప్రజలలో జాతీయైక్యభావములను పురికొల్పుటయు, మతసాంఘిక విభేదములతో సంబంధము లేకుండ సరియగు రాజకీయాభిప్రాయ భేదముల ననుసరించియే పార్లమెంటరీపక్షములు ఏర్పాటగునట్లు చూచుటయుచాల ముఖ్యము. ఈ ఉద్యమములు రెండును ఒకదానిప్రక్కనింకొకటి పనిచేయును, మత సాంఘిక విభేదములు తగ్గిపోవుటయు, రాజకీయములపై నాధారపడియుండు పక్షములు ఏర్పాటుకాబడుటయు, ఒక్కసారిగ జరుగవలసియున్నది. కొంతకాలమువరకు మతవిభేదములపై నాధారపడియుండు ద్విపక్షపద్ధతియే జరుగుచు వచ్చినను, తరువాత ఎప్పటికైనను ఎంత తక్కువకాలములో ఈపని జరిగిన అంత శ్రేయోదాయకము. దేశక్షేమము స్వపక్షపద్ధతిపైననే ఆధారపడియుండునట్లు చేయుటలోనే ఇమిడియున్నదని గ్రహింపవలెను. అప్పుడుకూడ పార్లమెంటరీ బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Parlimentary Governmet) జయప్రదముగ నుండవలసివచ్చినచో, అల్పసంఖ్యాకులుగా నున్న వివిధపక్షములవారి యభిప్రాయములకు సరియగు గణన నిచ్చుట అవసరము. లేకపోయిన ఇప్పుడు యూరప్ ఖండమం దంతటను ప్రబలముగ నున్న ప్రజాస్వామ్య పరిపాలనాసూత్రమునకు ప్రతికూలాభిప్రాయములు మనదేశ

ముందుకూడ ప్రవేశించి దేశమును డిక్టేటరు ప్రభుత్వము నకు గురిచేయుననుట నిశ్చయము.

ఈవిధమైన భయమును తొలగించుటకు ముఖ్యముగ వెంటనే చేయవలసిన పనులు రెండు కలవు:—

(i) శాసనసభలకు సభ్యుల నెన్నుకొనుసందర్భములో సంయుక్తనియోజకవర్గముల నేర్పాటుచేసి వాటిలో అల్పసంఖ్యాకులకు స్థానములను ప్రత్యేకించి నిర్ణయించుట.

(ii) ప్రపోర్షనల్ రిప్రజెంటేషను అనగా ఏపక్షమున కెంతబల మున్నదో దానినిబట్టి ఆపక్షము వారికి తగినట్టియు, సరిపోవునట్టియు ప్రాతినిధ్యము నేర్పాటుచేయు పద్ధతిని ఎన్నికవిధానమునందు ప్రవేశ పెట్టుట.

ప్రజాప్రతినిధిసంఘములద్వారా పనిచేయుప్రజా స్వామ్యసూత్రమునందు ప్రజల కనిష్టత హెచ్చకుండ చేయుటకును, వాటిపైననే ఆధారపడియుండు ప్రభుత్వ పద్ధతికి వ్యతిరేకముగ నుండకుండు పద్ధతు లేర్పడ కుండ కాపాడుటకును, ఇవియే లాభకరమగు మార్గములు.

పైన సూచించినవే కాక వేరు రెండుమార్గముల వలన కూడ అట్టిఫలితమును పొందుట కవకాశములు కలవు:—

(i) ప్రజాసామాన్యమునందు ప్రత్యేకజాతీయ తనుగురించి మాత్రమే అభిప్రాయముల నెక్కువగ పెంపొందించుటకు మారుగ అంతర్జాతీయభావములు, అంతర్జాతీయసౌభ్రాత్రము మొదలగు విషయములను గురించి ప్రచారము చేయవలసి యుండును. ప్రజాస్వామ్యప్రభుత్వ మీకాలమున అంతర్జాతీయమాత్రముగ మార్చి ప్రజాహృదయములందు విశాలభావములు ప్రవేశించునట్లు చేయుటలోనే ప్రపంచోద్ధరణమార్గ మిమిడి యున్నది.

(ii) హిందూదేశములో ప్రాచీనకాలములో ఎక్కువ అభివృద్ధిగా నుండినట్టి గ్రామపరిపాలనాసంఘములు (Village Assemblies), ప్రాంతిక ప్రజాసమ్మతముపై నాధారపడియుండునట్టివాటిని, పునరుద్ధరింప వలసియున్నది. అనగా గ్రామములను పరిపాలనాపద్ధతికి పునాదిగ దిద్ది ఏర్పాటుచేసి, గ్రామపంచాయతీసభలను అభివృద్ధిపరచి, అవి గ్రామముల పరిపాలనావిషయము లన్నింటికిని బాధ్యత కల్గియుండునట్లు చేయవలెను. హిందూదేశమునందు ప్రజాస్వామ్యప్రభుత్వ సూత్రము చిరస్థాయిగ నుండవలెననిన, ఈవిధమైన సంస్కరణమును ప్రవేశపెట్టుటయే దానికి మార్గము. పునాదులయందు బల మున్న, పైఅంతస్థులలో బలము దానివెంబడినే వచ్చును. కాన గ్రామములలో ప్రజాభిప్రాయము ననుసరించి ప్రభుత్వవ్యవహారములు సాగుచున్నప్పుడు పెద్దరాజ్యభాగములలో కొంతవర కానూత్రము కొరతపడినను అంతనష్ట ముండదు. సాంఘిక, మతవైషమ్యములకు గ్రామములో ఎప్పుడు అవకాశ ముండదో (పైన చెప్పిన మార్గమువలన ఆవైషమ్యములు చాలవరకు తగ్గిపోవుట కవకాశము లేర్పడును), అప్పుడే ఇతరచోట్లగూడ వాటికి స్థాన ముండదు. అప్పుడే ప్రాంతిక రాజకీయవిభేదములే ప్రధానముగాగల రాజకీయపక్షము లేర్పడుటకు అనుకూలపరిస్థితు లేర్పడును.

---

# భారత కార్మికోద్యమము

ఎస్. పి. శర్మ గారు, 'సోషలిస్టు' సంపాదకులు

భారత కార్మిక మండలమునకు సన్నిహిత గ్రామ జీవన సంబంధ ముండుట గమనార్హము. లేని యెడల వారంత తక్కువకూలికి పనిచేయగలుగుటకైనను, చాలకాలము సమ్మెకట్టి యుండగలుగుటకైనను వీలుండదు. సాధారణముగ పని యెప్పుడల చేయబడినంత నే కర్మాగారము కార్మికుడైనను, గనిపనివాడైనను, తన స్వగ్రామమున కేగి పని మరల ప్రారంభింపబడునంతవరకు వచ్చుట ఇతరములగు పనిపాట్లను చూచుకొనుచుండును. అందువలన కార్మికసంఘములు తగిన ధనవసతి యేమియు గూడ లేకుండ సమ్మెకట్టుట కెంతయు సులువగుచున్నది. అంతియె గాక, అసలే కిటకిటలాడుచున్న నగరముల యందు వారు పనిపాట్లు లేక తిరుగులాడుచుండుట కవకాశముసైత ముండదు.

భారతకార్మికోద్యమము ౧౮౫౦ సంవత్సరమున సమారంభమయ్యెను. అప్పటినుండి భారతదేశమున పరిశ్రమ లభివృద్ధి పొందదొడగెను. ౧౯౧౪ సంవత్సరము వర కీయుద్యమము శైశవావస్థయందుండెను. ప్రత్తి, జనుము మున్నగు పరిశ్రమ లనేకము లతిత్వరితముగ నభివృద్ధి పొందెను; కాని అనంతరము ౧౯-వ శతాబ్దమున బ్రిటనునం దవలంబింపబడిన విధానమువంటి పరిస్థితుల వలన కార్మికుల కత్యంతదురవస్థ ప్రాపించెను. కూలి మిక్కిలి తక్కువ. కార్మికులు (స్త్రీపురుషులు) అందరు వారు పనిచేయు కార్ఖానాలయందొక భాగముగ పరిగణింపబడిరి. కూలి కలసివచ్చునని పనివారిచే పని చేయింప దొడగిరి. పనివేళలు హెచ్చింపబడెను కాపురముండు కొంపలు సైతము మంచివి కావు. కర్మాలయముల శాసన మమలుపరుప బడెను. కాని యందు మానవశక్తి పరిగణింపబడినట్లగపడదు. ప్రాణ నష్టమును, అవయవాదినష్టములను వారించుటకే యది యుపయుక్తమగును. వేయేల, భారతకార్మికుల యవస్థ మొత్తముమీద మిక్కుట మయ్యెను.

ఇక రెండవదశ 1915 నుండి 1921 సంవత్సరము వర కుండె ననవచ్చును. యుద్ధ మారంభ మైనపుడు ఇండియాలో తయారైన వస్తువుల కనేక కారణములవలన మంచి వ్యాపార ముండెను. కావున దేశమునం దంతట కార్మికుల కెందరికైన పని యుండెడిది. ధరలు పెరిగిపోయినవి. పలువిధములగు పరిశ్రమలు తలయెత్తెను. పని వారికి కూలిసైతము సమ్మెకట్టు బెదరింపువలన చాల వరకు హెచ్చెను. నిశ్చయముగ భారత కార్మికమండలమున కవి మంచిరోజు లనవలయును. పరిశ్రమల నింకను అభివృద్ధిపరుప జాలక పోవుటయు, తగినంత కార్మిక-సిబ్బంది లభింప లేకపోవుటయు తప్ప, మొత్తముమీద కార్మికపరిస్థితు లెంతయు చిరకాలమువరకు నిక్షేపము వలె నుండెను.

కాని వార్సేల్సు సంధి జరిగినతరువాత దాని ప్రతిఫలములుమాత్రము కార్మికోద్దేశముచొప్పున మన దేశమునం దరిష్టదాయకము లయ్యెను. వ్యాపారము సన్నగిలెను. పరిశ్రమలు క్షీణించెను. కావున యజమానులు విధిలేక కూలిని తగ్గించవలసినవారైరి. అహమ్మదాబాదు నూలి మిల్లుల యజమానులు మొట్టమొదట నూటికి ౨౧ వంతులు కూలి తగ్గించునట్లుద్దేశించిరి. కాని, తత్క్షణము కార్మికు లందరు ౨ నెలల వరకు సమ్మెకట్టి యుండినందున తుదకు ౧౫% వంతులు మాత్రము తగ్గించిరి. ౧౯౨౫-వ సంవత్సరమున బొంబాయి మిల్లుయజమానుల సంఘమువారు కూలిని ౧౧½% వంతులు తగ్గించుటకు ప్రయత్నించిరి కాని కార్మికులను స్థిరముగ ౩ నెలలపర్యంతము మొక్కవోని సమ్మెకట్టియుండినందున వారి ప్రయత్నము కొనసాగదయ్యెను. సభాయుతుడగు రాజప్రతినిధి స్వదేశీసరకులపై విధింపబడుచుండిన ౩½% సుంకమును రద్దుపరచుట కొక ప్రత్యేకమగు నసాధారణశాసనము నమలుపరచిన పిమ్మట నాసంక్షోభము తొలగెను. ఇతర ప్రాంతములయందు

సైత మప్పు డనేకసమ్మెలు జరిగెను; కాని కార్మికుల యందు తగిన కట్టుదిట్టములు లేనందున నవి యంతగా విజయవంతములు కావయ్యెను. తరువాత కొంతకాలము వరకు యజమానులు కూలిని తగ్గించుటను మానుకొనిరి. అంతలో ధరలును చాలతగ్గిపోయినవి. అందువలన ౧౯౧౮ సంవత్సరమున తాము పొందుచుండినదానికన్న నిప్పుడు తమకు కూలి హెచ్చిరే యున్నట్లు కార్మికులు గ్రహించి తమ విరుద్ధవైఖరిని త్యజించుకొనిరి. ఇది భారతకార్మికోద్యమమునందు మూడవదశ. ఇది ౧౯౨౨ నుండి ౧౯౨౯ సంవత్సరమువర కుండెను. ఈకాలమునందు సమ్మెలనేకములు జరుపబడుటయే గాక కార్మిక సంబంధశాసనములు సైత మనేకము లమలుపరుపబడెను. ౧౯౨౧ సంవత్సరమున జెనీవాలో నొక యున్నతజాతీయ కార్మికశాఖాలయము స్థాపింపబడెను. వారు సిఫారసు చేసిన సంప్రదాయము నంగీకరించి భారతకేంద్రరాష్ట్రీయాది ప్రభుత్వము లమలుజరుప దొడంగినందున కార్మికుల కత్యంతసౌకర్యము లొనగూడెను. వారి పరిస్థితులు సైత మభివృద్ధి పొందెను. ౧౯౨౨ సంవత్సరమున కార్మికశాసనము సవరింపబడెను. గనులచట్టము సైత మత్యంతాభ్యుదయదాయకముగ సవరింపబడెను. కార్మికులకు పరిహార మొసంగు శాసనము గూడ నపుడే అమలులోనికి కొనిరాబడెను. ౧౯౨౬లో నొక కార్మికసంఘములశాసనము మంజూరు గావింపబడెను. కాని యా దశయొక్క యంత్యకాలమున వ్యాపారము క్షీణించినందున యజమానులు కూలిని తగ్గించక యితరవిధముల వ్యయకర్తన మొనరింప దొడగిరి. కార్మికులను సాధారణముగ పనివేళయందే యెక్కువపని చేయవలసినదిగా యజమాను లాదేశింప దొడగిరి. భారత కార్మికమండల చతుర్థదశాభాగ మిటువలె నీగందరగోళముతో నారంభమయ్యెను.

౧౯౨౯ సంవత్సరమునందు ఇండియన్ నేషనల్ కాంగ్రెసునందలి కార్మికసభ్యు లందుండి విడిపోయి కార్మిక రైతుజనసంఘమును వేరుగ నెలకొల్పిరి. కార్మిక సంఘముల నభివృద్ధియొనరించుటయు ఇతరుల యాజమాన్యమునుండి కార్మికులను తప్పించుటకు దోహద మొనరించుటయు వారి యుద్దేశము. రషియను కమ్యూనిస్టు రాయబారుల సహాయమున వా రా సంవత్సరము మే నెలలో "క్రాంతి" (అనగా విప్లవము) అను పేరిట నొక పత్రికను స్థాపించిరి. ౧౯౨౮ సంవత్సరపు వేసవిలో వితండవాదులయొక్కయు, కమ్యూనిస్టులయొక్కయు తీవ్రప్రయత్నములు విజయవంతము లయ్యెను. బొంబాయిలో తీవ్రమగు నొక సమ్మె యుదయించి ఆరు నెలల పర్యంత మది కొనసాగుచుండెను. ఆ తరుణముననే జంషెడుపూరులో లోహకార్మికులు సైతము సమ్మె కట్టిరి. ఖరగపుర కార్ఖానాయందు బంగాళా నాగపూర్ రైల్వేకార్మికులును, తిరుచినాపల్లియందు దక్షిణ ఇండియా రైల్వే కార్మికులును గూడ సమ్మెకట్టిరి. అంతియె కాక, దేశమునం దనేక ప్రాంతములలో మునిసిపాలిటీలు, పోర్టుట్రస్టులు మున్నగుసంస్థలయందును చిన్నచిన్న సమ్మెలు జరిగెను. ఇంతకు ఇండియాలో సముచిత విధమున వ్యవహారమును జరపి గొప్పసమ్మె నేర్పాటు చేయింపజాలనందున, మాస్కోలోని కమ్యూనిస్టులు త్రైణీకరింపబడియుండుటవలన సంక్షోభము నుదయింపజేయుటకు కారణభూతులు కమ్యూనిస్టులే యని విదితమగును.

౧౯౨౯ సంవత్సరమున బొంబాయి "గిర్నికాంగార్" సంఘమువారు మరియొకసమ్మెకట్టు నేర్పాటు చేయించిరి. ఈ సంఘమునందు వితండ వాదులకును, కమ్యూనిస్టులకు నెంతేని పలుకుబడి కలదు. ఈ సమ్మె ౧౯౨౯ ఏప్రెల్ ౨౬ తేదీ లగాయతు ఆసంవత్సరము సెప్టెంబరు ౧౫ తేదీ వరకు జరిగెను. అప్పుడు ప్రభుత్వమువా రొక విచారణసంఘము నేర్పరచి పరిస్థితులను చక్కగ గమనించి యాగందరగోళమున కంతకు 'గిర్నికాంగార్' సంఘమే కారణమని తీర్పుగావించిరి. కమ్యూనిస్టు లనేకు లాసందర్భమునందు అరెస్టుచేయబడిరి. వారి కేసు ఇంకను మీరటులో జరుగుచునే ఉన్నది. దానితో మనదేశమునందు కమ్యూనిస్టులకు వెన్నెముక విరిగిపోయి నట్లై యయ్యెను.

ఆ సంవత్సరము నాగపూరులో జరిగిన కార్మిక మహాసభ యెంతయు గమనార్హ మనదగును. పండిత

జవాహరలాలు నెహ్రూగారు దానికి గ్రాసనాధిపత్యమును వహించిరి. వితండవాదులును, కొందరు కమ్యూనిస్టులును సదరు మహాసభను తమ వశ మొనరించుకొనుటకు తలక్రిందులుపడిరి. కాని అనుకూలవాదులగు బి. శివరావు గారు మున్నగు ప్రముఖులవలన తుద కందు చీలిక యేర్పడనయ్యెను. వారు బహిరంగముగా ముమ్మరు కమ్యూనిస్టుల సూచనల కనుకూలముగ వోటుచేసి దోష మంతయు ప్రతిపక్షీయులదే యని లోకవిదిత మొనరించిరి. అందువలన జోషీగారివంటివా రాసభలో నుండుట కవకాశము లేకపోవుటచే వా రందుండి విడిపోయి కార్మికమండల సమాహారమును నెలకొల్పిరి.

కాని యిప్పటినుండియు కార్మికసంఘ మహామండలమును, కార్మికసంఘ సమాహారమును ఏకైకవర్గముగ సమన్వయ మొనరించుట కనేక ప్రయత్నములు గావింపబడుచున్నవి. అందు కడపటి ప్రయత్నమును గత జూలైలో సంఘీభావమహాసభవారు చెన్నపురముగనందు గావించి, యుభయవర్గముల కొక సామాన్య వేదికను సిఫారసుచేసిరి. సమాహారవర్గమువా రాసిఫారసును గమనించి మొత్తముమీద తమ యనుకూలాభిమానమును ప్రకటించిరి; కాని కాంగ్రెసువర్గమువారు సైత మట్లే యభిమానింతు రనుకొన్న, వా రేమారిపోయిరి. ఈవర్గము వారు సెప్టెంబరు ౧౦, ౧౧, ౧౨ తేదులయందు మద్రాసులో సమావేశమై బొంబాయి గిర్నీ కాంగార్ సంఘమువా రామోదించిన చర్యావిధానము ననుసరింప తీర్మానించిరి. కార్మికసంఘసమాహారవర్గమున కాచర్యావిధాన మేతీరున ననుకూలింపదు. కావున భారతకార్మికమండలమునందు ప్రస్తుతము ట్రేడు యూనియన్ కాంగ్రెస్ (కార్మికసంఘమహాసభ) యనియు, ట్రేడుయూనియను ఫెడరేషన్ (కార్మికసంఘ సమాహారము) అనియు నుభయ భిన్న వర్గము లేర్పడ వలసి వచ్చెను. ఇవియే గాక యావద్భారత రైల్వేకార్మికమండలసమాహార మను పేరున మరియొక ప్రత్యేకవర్గము కలదు. భారత కార్మికవర్గములయం దింత మంచి కట్టుదిట్టములు గల ప్రబలవర్గ మేదియును లేదు. ట్రేడుయూనియన్ కాంగ్రెసుతోడ గాని, ట్రేడుయూనియన్ ఫెడరేషనుతోడ గాని యీవర్గమున కెట్టిసంబంధము లేదు. అయినను మొత్తముమీద నీ వివిధవర్గముల పరస్పర విభేదములు కేవలము తాత్కాలికములు, సామాన్యములు కావున దేశమునందు కార్మికోద్యమ మభివృద్ధి నొందుకొలది నీ విభేదములు తమంత నంతరించు ననదగును.

---

## శ్రీమంతుడా!

సం. వేంకటశర్మగారు

ఓయి శ్రీమంత, మేలుకోవోయి యింక
కనులు తెరచి ప్రపంచము గనగదోయి
హీనుల దరిద్రదుఃఖముల్ వినగదోయి
కన్ను లున్నట్టి గ్రుడ్డివి గాకుమోయి
చెవులు గలిగిన బధిరుడ వవకుమోయి
తోడివారిపరిస్థితుల్ చూడవోయి
నీదు దేశీయసోదరుల్ నిలువ నీడ
కూడుగుడ్డలకును మాసి గోడు గుడువ
దివ్యభవనంబులం దుండి దినదినంబు
నవ్యషడ్రసాన్నములు మెక్కి భవ్యవస్త్ర
ధారివై నిత్యకేళీవిహారి వగుచు
మనుపు గడుపుటే పరమార్థ మగునె?
అన్నవస్త్రార్తు లగుచు నీయన్నదమ్ము
లింద రిన్నివిధంబుల నేడ్చుచుండ
నిండుగా నొక్క నీపొట్ట నింపుకొరకె
దండిగా నీవు దుస్తులు దాల్చుకొరకె
గొప్ప షోకులతో నీవు కులుకుకొరకె
భోగివై సౌఖ్యముల తులదూగుకొరకె

విమతివై గర్వమున విఱ్ఱవీగుకొఱకె
ధూర్తువై సాధుసరణికి దొలగుకొఱకె
నీచువై ధర్మమును గాల రాచుకొఱకె
పరచవై భగవంతుని మరచుకొఱకె
ద్రోహివై దుష్క్రియల కెల్ల దొడగుకొఱకె
ఇంత సిరి నీకు భగవంతు డిచ్చినాడె?
అతడు నీ కిచ్చినట్టి యనంతమైన
సంప దంతయు నీవు నీస్వంతమనుచు
నోడలు తెలియక దుర్వినియోగపరచి
వ్యర్థపరచెదవో లేక సార్థకముగ
సాధులకు బీదలకు సమారాధనలకు
త్యాగివై మించి సద్వినియోగపరచి
ధర్మకర్తృత్వమునకు నే దగుదు నింక
నెంత యైశ్వర్య మిచ్చిన నిమ్మటంచు
నీవు క్రియచేత నుత్తరం బిచ్చునట్టు
లుందువో లేదో యని చూచుచున్నవాడు.

నీకు కరణీయ మేదియో నిక్క మరసి
మెలగి దేవుని మెప్పింపవలయు నీవు.
ఎంత బాధ్యత నతడు నీ కిచ్చినాడో
ఎంతభారంబు నీతల నిపుడు గలదో
తెలిసి తగురీతి నీవు వర్తింప వయ్యా!
ఈశ్వరాదేశము నిరాకరింతువేని
ధర్మవాణిని పెడచెవి దార్తువేని
ప్రజలఘోష సహింప పాల్పడెద వేని
ప్రజల గోడును జూడ మున్పడెదవేని
ప్రజల నెదిరింపగా దలపడెద వేని
ప్రజల హింసింపగా సిద్ధపడెదవేని
ప్రజలసొమ్ముల్ల దిన నాశపడెదవేని
ప్రజలకొలువుల కుబలాటపడెదవేని
నీదుసంకల్పసిద్ధి కాబోదు వినుము
నీదుకోరిక చేకూరబోదు వినుము
నీదుయత్నంబు నెర వేరబోదు వినుము
నీదుపేరాస ఫలియింపబోదు వినుము.

నీవు దేవునియాజ్ఞ మన్నింతువేని
నీవు సన్మార్గమున గమనింతువేని
నీవు నెరదాతవై యీవి నెరపుదేని
నీవు నిరుపేదలను గరుణింతువేని
నీవు దీనులపాలింట నిలుతువేని
నీ వనాథలపై ప్రేమ నింతువేని
నెనరు చూపుల దేవుండు నిన్ను జూచు
నెమ్మి మీరంగ దేవుండు నిన్ను మెచ్చు
నిండులక్ష్మిని దేవుండు నీకు నిచ్చు
నిత్యసుఖములు దేవుండు నీకు నిచ్చు
సంఘమున నీకు మర్యాద సంఘటిల్లు
నందరికి ప్రేమ నీమీద నతిశయిల్లు
భాగ్యభోగ్యాలు నీయింట పరిఢవిల్లు
శాంతభావంబు నీయందు సంపతిల్లు
ఇంగితజ్ఞానసంపద యుచ్చరిల్లు
నీతివిస్ఫీతభావనుల్ నివ్వటిల్లు
భక్తివిజ్ఞానవైరాగ్యవల్లు లల్లు
ఒక్కటొక్కటిగ దుర్బుద్ధు లోసరిల్లు
మెల్లమెల్లగ నరివర్గమెల్ల జెల్లు
విస్మయంబుగ శీలంబు విస్తరిల్లు
సకలజనమును నిను జూచి సంతసిల్లు
సురలసంఘంబు నీమీద విరులు చల్లు
విబుధమేఘంబు కురియు దీవెనలజల్లు
తరతరము నీకు శ్రేయస్సు తారసిల్లు
త్రిభువనంబుల నీకీర్తి తేజరిల్లు.

---

# క్షయరోగము: సానటోరియం, మైసూరు

పెద్దాడి కామేశ్వరమ్మగారు, బి. ఏ

ఇంగ్లండు, అమెరికా మొదలగు దేశములలో క్షయ రోగము క్రమముగా తగ్గిపోవుచుండ, భారతదేశములో ఈ రోగము దినదినాభివృద్ధి పొందుచున్నది. ఇందుకు ముఖ్యకారణములు:—

౧. ప్రజలయొక్క బీదతనము: దారిద్ర్యమువల్ల బలమైన ఆహారము లేక పోవుచున్నారు.

౨. ఈ జబ్బునుగురించియు, ఆరోగ్యమార్గముల గూర్చియు ప్రజల అజ్ఞానము: ఇందువల్ల రోగకారణమైన క్రిములు విచ్చలవిడిగా ప్రజలలో పెరుగుచున్నవి.

౩. బాల్యవివాహములు, ఘోషా లోనగు దురాచారములు: చిన్నవాడే సంతానాధిక్యమువల్ల శరీరపటుత్వము తగ్గిపోయి రోగము నెదుర్కొనగల శక్తి లేక పోవుచున్నది.

## రోగమునకు కారణములు

౧. క్షయరోగమునకు ప్రధానకారణము సూక్ష్మజీవియగు క్షయరోగక్రిమి. ఇది ఎట్లు క్రొత్తవారిని ఆశ్రయించి క్షీణింపజేయునో ముందు తెలుపబడును.

౨. తలిదండ్రులకు క్షయరోగ ముండినయెడల ఆనీరసము పిల్లలకు వచ్చి, అందువల్ల వారు త్వరగా క్షయరోగక్రిమికి లొంగిపోవుదురు.

౩. ఇతర రోగములవల్ల లొంగిపోయినప్పుడు అంతవరకు అణగియున్న క్షయరోగము బయటపడి శరీరమును క్షీణింపజేయును.

౪. తగిన విశ్రాంతి లేకపోవుట; శారీరక మానసిక బాధలు; తాపత్రయములు; అత్యధికమైన పని; గాలి లేని అనారోగ్యమైన ప్రదేశములలో నివసించుట.

## క్షయరోగక్రిమి

క్షయరోగక్రిమిని గురించి కొద్దిగా తెలుసుకొనవలసి యున్నది. వేయిరెట్లు పెద్దదిగా చూపు మంచిరకం భూతదర్శనితో (Microscope) సరియైన రంగులు వేసి చూచినయెడల ఈక్రిమి కనిపించును దీనికి క్రొవ్వు సంబంధమైన కవచ మున్నది.

దీనికి శరీరములో స్థానము దొరకిన అనుకూలమైన ప్రదేశమున చేరి అనేకమై వృద్ధిపొంది సగ్గుబియ్యమువంటి కట్టడము ఏర్పాటుచేసుకొనును. ఇది క్రమంగా పెద్దదగును. కొన్నాళ్లకు ఇది చితికి, లోని క్రిమియుతమైన పదార్థమే చిక్కని శ్లేష్మంగా క్షయరోగులు ఉమ్మి వేయుదురు.

ఒక్కొకసారి ఉమ్మివేసిన శ్లేష్మంలో లక్షల కొలది క్రిము లుండును. అజ్ఞానముచే ఈరోగు లన్నిచోట్లను ఉమ్మివేసెదరు. అది ఎండి, గాలికి ఎగిరి, దుమ్ముతో సర్వత్ర వ్యాపించి, ఆదుమ్ము పీల్చినవారి గొంతులలోను, శరీరములోను స్థావర మేర్పరచుకొనును.

అయితే, అదృష్టవశాత్తు శరీరములో మనతరఫున ఈశత్రువుతో పోరాడెడి బలగము చాల ఉన్నది. అందువల్ల అనువు గానప్పుడు ఈక్రిములు అట్లే అణగియుండును. ఇందువల్లనే ప్రజలలో నూటికి 90 మంది ఈ క్రిములను శరీరములో కలిగియుండినను రోగగ్రస్తులు కారు. నూటికి పదిమందిమాత్రమే లొంగిపోవుచున్నారు.

ఎంగిలి తినుటవల్ల, రోగ మున్నవారు త్రాగిన కప్పులలోను, గ్లాసులలోను త్రాగుటవల్ల, రోగ మున్నవారు ముద్దుపెట్టుకొనుటవల్ల కూడ ఈ రోగము ఇతరులకు పట్టుకొనుచున్నది.

## క్షయరోగము రాకుండా ఏమి చేయాలి?

౧. బలమైన ఆహారము తినవలెను—పాలు, వెన్న, పెరుగు, పండ్లు, పచ్చికూరలు, మాంసాదులు తినెడివారు కోడిగ్రుడ్లు, మాంసము మొదలగువవి తినవలెను.

౨. పరిశుభ్రమైన గాలిలో ఉండవలెను. వసారాలో పరుండుట ఉత్తమం. లేదా, కిటికీ లన్నీ తెరచి యుంచవలెను.

౩. పిల్లలకు సాధ్యమైనంతవరకు దుస్తులు లేకుండా ఉంచి, ఎండ తగులనీయవలెను. సూర్యరశ్మివల్ల చాలా ప్రయోజన మున్నది.

౪. తగిన కసరత్తు ఉండవలెను.

౫. వేళకు భోజనము చేయుట, నిద్రపోవుట అలవాటు చేసుకొనవలెను. నాటకములు, సినీమాలు సాధ్యమైనంతవరకు తగ్గించుకొనవలెను.

౬. క్షయరోగసంపర్క మున్నవారి పిల్లలకు చేపనూనె (Cod-Liver Oil) ఈయవలెను.

౭. క్షయరోగులు ప్రతిచోట తమశ్లేష్మమును ఉమ్మకుండినయెడల సంఘమునకు మహోపకారము చేసినవా రగుదురు.

## వైద్యము

నేనుకూడా ఏస్వల్పమో క్షయరోగమువల్ల బాధపడి ఆరోగ్యాశ్రమములలో ఎనిమిదినెలలు పైగా నుండుటచే దీనిని గురించి కొంత తెలుసుకొంటిని. ఈవ్యాధి చికిత్సకు తోడ్పడు ముఖ్యవిషయములు:—

౧. సంపూర్ణమైన విశ్రాంతి.

౨. బలమైనట్టియు, విటమిన్లు (Vitamins) ఉన్నట్టియు మంచి ఆహారము.

౩. పరిశుభ్రమైన గాలి.

ఇవి కాక నిపుణులు ఇతర విధములైన వైద్యము చేసెదరు; ఔషధములు, ఇంజెక్షనులు, శస్త్రవైద్యము, కొన్నిబాపతులకు సూర్యరశ్మి, అల్ట్రావైలెట్ కిరణములు (Ultra-violet rays by arc lamp) లోనగునవి ప్రయోగింతురు.

మొదటి మూడు మార్గములే ప్రధానములు. ఇతరములు వానికి తోడు. ఇవన్నీ కూడా ప్రత్యేకం క్షయరోగమునకై నిర్మింపబడు ఆరోగ్యాశ్రమములలో జరిగినట్లు ఇతర చోట్ల జరుగవు. అందువల్ల ఈ జబ్బు చేసినవా రందరు ఆరోగ్యాశ్రమమునకు (Sanatorium) వెళ్లి వైద్యము చేయించుకొనవలెను.

## ఇందు గమనింపవలసిన విషయములు

౧. అనేకమందికి ఒకదురభిప్రాయం ఉన్నది. శానటోరియంలో ఇతరుల జబ్బు తమకు అంటుకొనునని భయపడి అచ్చటికి వెళ్లరు. ఇది చాలా పొరపాటు. ఇట్టి అన్యాయపు నమ్మకము కొందరు డాక్టర్లకు కూడా ఉండుట చాలా చోద్యము. అయితే, చాలామంది డాక్టర్లుకూడా శానటోరియం ఎన్నడూ చూచియుండకపోవచ్చును. అచ్చట నిపుణులైనవారు అపాయకరమైన శ్లేష్మముగూర్చియు, ఇతరవిషయములగూర్చియు చాలా జాగ్రత్తపడెదరు కాబట్టి రోగములు క్రొత్తగా ఇతరులకు అంటుకొనుటకు అవకాశములు లేవు.

౨. శానటోరియంలో చాలానెల లుండవలెను; తొందరపడకూడదు.

౩. తరువాతకూడా సాధ్యమైనంతవరకు ఆ శానటోరియం పద్ధతులపైననే నడచుకొని ఆరోగ్యము కాపాడుకొనవలెను.

మనదేశంలో ఈ శానటోరియములు చాలా తక్కువ. అందు నేను ఉండి ఆరోగ్యమును పొందిన దానిని గురించి వ్రాసిన కొందరికి ఉపయోగించవచ్చు.

## మైసూరు శానటోరియం

మైసూరుపట్టణమునకు రెండుమైళ్లదూరమున విశాలమైన బహిరంగస్థలములో శ్రీ మహారాజావారి రెండవ సోదరియగు శ్రీ॥ శ్రీ॥ రాజకుమారి కృష్ణజమ్మణ్ణిగారి పేర ఈ శానటోరియం కట్టబడెను. ఈమె క్షయరోగమువల్ల

న్నే జీవితమును కోల్పోయిరి. ఈశానటోరియము మొదట చిన్నదిగా ప్రారంభించేసిరి. పురవాసులు, ఇతరులు తిరువాత విపులమైన విరాళముల నొసంగి నూతన భవనముల నిర్మించిరి. ప్రస్తుతం 170,180 మందికి స్థాన మున్నది. ఇది మైసూరుప్రభుత్వమువారిచే నడుపబడుచున్నది.

ఆధునిక పద్ధతులపై వైద్యము చేయుచున్నారు. అన్నివిధములైన శస్త్ర చికిత్సలు, ఇతరమార్గములు ఉపయోగించి చాలా జయప్రదంగా నడుపుచున్నారు.

డాక్టరు బి. జయరామ్‌గారు, M. B. B. S., L. R. C. P., T. B. D., ఇచ్చట ప్రధానవైద్యులు. వీరు కడు నిపుణులు; అపార భూతదయాపరులు.



ఆఫీసు, శస్త్రశాల వగైరా



బన్నయ్యా వార్డు

ఇచ్చట ఖర్చులుకూడా చాలా తక్కువ. ఉచితముగా ఉంచి, వైద్యముచేసి, ఆహారమిచ్చెడి వార్డులుకూడా ఉన్నవి. కాని వాటిలో పైవారికి కాళీ యుండుట అరుదు.

౧. "బన్మయ్య వార్డు" ( Bunmiah Ward ) అని చెప్పబడుదానిలో రోజుకు ఒక్క రూపాయి. ఒక్కొక్కగదిలో ఇద్దరుంటారు. భోజనం, వైద్యం ఇందులోనే.

౨. ప్రత్యేకపువార్డు(Special Ward) రోజుకు రు. 2-8-0.



బన్మయ్య వార్డు—లోపలిభాగము



ప్రత్యేకపు వార్డు (Special Ward)

ఈ విషయములగూర్చి వివరములు కావలసిన వారు మెడికల్ ఆఫీసర్, శానటోరియం, మైసూరు (Medical Officer, Sanatorium, Mysore) అని వ్రాయవచ్చును. ముందు వారికి వ్రాసి, జవాబు పొంది కాని ఎవ్వరూ వెళ్లకూడదు.

మైసూరున కలదు. ఈస్థలము సుమారు 2,500 అడుగుల ఎత్తున ఉన్నది. వేసవిలో కూడ ఉష్ణము 90 డిగ్రీలు దాటదు. వర్షము సంవత్సరం మొత్తానికి 35 అంగుళములు (70 దుక్కులు) ఉండును.



వినోదములకు భవనము (Recreation Hall)

క్షయరోగనివారణమునకు కావలసిన సమశీతోష్ణస్థితి, ఎత్తయిన స్థలము, తక్కువ వర్షములు అన్నికూడా ఆంధ్రదేశమునుండి వెళ్లువారు ఉన్ని బట్టలు, కంబళ్లు తీసుకొని వెళ్లవలెను.

---

## నివేదన–౪

శ్రీమతి చావలి బంగారమ్మగారు

అమవాసమర్నాడు అంపితిని కబురు
సూర్యదేవుడు నిన్ను చూచి చెప్పేడ?
వింటివా నాకథను విపులమ్ముగాను?
వింటివా, నాతండ్రి, వివరమ్ముగాను?

కంటివా నారూపు కనులారగాను?
ఈరీతి నున్నాను: ఇనునిచే నేను
ఏసాయమును బొందజాలకను నిన్ను
ఎటులైన తోడితెమ్మని వేడినాను.

నిన్ననే విన్నావు నేడు వచ్చేవు;
నీవలెన మావాని తోడితెచ్చేవా?
అతిశీఘ్రముగ నీవు అతనికడ కేగి
మతి విరిచి స్థితి చెరిచి తీసికొని వచ్చి,
పతి గూర్చి ఈపుణ్యఫల మందు మయ్య!

నూరుకల్లలు పల్కి- ఒకయిల్లు నిల్ప
లోకోక్తి గలదయ్య! — నీ కేల చెప్ప?

---



## అస్పృశ్యత

ఇది ప్రారంభమై అనేకశతాబ్దములైనది; గాని ఫలముమాత్రము నేడు కలిగినది.

విజయగర్వమువలన మనపూర్వులొక తెగవారిని అస్పృశ్యులని యూరిబయటికి తఱిమివేయఁగా, దాస్య దైన్యమువలన తత్ఫలమును మన మిప్పుడు పూర్తిగా అనుభవించుచున్నాము.

బ్రాహ్మణమతము సజీవమై యున్నంతకాలము మనవారికి అస్పృశ్యులయెడల "అయ్యో! తోడి మానవులే. మనజాతివారే. వారు లేకున్న మనకు క్షణము గడువదే. ఈఘోరశిక్ష యేల?" అని కనికరము లేకపోయినది. అస్పృ డస్పృశ్యులు మన యౌద్ధత్యమున కోపఁజాలకపోవుటలో దమ మానవత్వమునే మఱచిపోయినారు.

మహామ్మదీయు లిట్టిభేదము లెఱుగనివారే; గాని వారు అస్పృశ్యులయెడల ప్రత్యేకశ్రద్ధ చూపలేదు. మనలో వీలైనంతమందిని తమలో కలుపుకొనుటకే వారు ప్రయత్నించినారు. వా రస్పృశ్యులకు మానవత్వమును బోధింపనూ లేదు. మనలో మనకు విభేదములను గలిగింపనూలేదు. వారికి ఆపని తోచకపోగా, ఈపని అవసరము లేకపోయినది. ఏమంటే? వారిక్కడ స్థిరపడిపోయినారు. ఇక్కడ డబ్బుకూడబెట్టి మఱియొకచోటికి కొనిపోవు పద్ధతి వారు పెట్టుకొనలేదు. ఇక్కడి మంచిచెడ్డలకు తమ జన్మదేశమువారికి జవాబు చెప్పవలసిన బాధ్యతగూడ వారు పెట్టుకొనలేదు. పైగా ప్రభుత్వము విషయమున వారు పూర్తిగా ఖడ్గమునే నమ్ముకొని యుండినారు.

కాగా మహమ్మదీయుల హయాములోగూడ అస్పృశ్యులకు వెలుగు కనబడలేదు. తురకమతమున కలిసినవారు కలిసిపోగా తక్కినవారు అస్పృశ్యులుగనే—అంధకారకూపమునందే యుండిపోయినారు.

ఆంగ్లేయుల ప్రభుత్వమున వారికేక బయలుపడిన దనుటకంటె మనమే కిన్నులుతెఱచినామనుట సొగసు. ఏమంటే? ఆంగ్లేయుల రాకవలన రాజకీయముగా మహమ్మదీయుల రాకవలన కలిగిన ఫలముకంటె విలక్షణమైన ఫలముకలిగినా సాంఘికముగా మనము బాగుపడినాము. ఆంగ్లభాషాపరిచితివలన, ఆంగ్లేయులతోడి సంపర్క సాహచర్యములవలన మన యసభ్యత, మన నైతికపతనము మనకు బోధపడినవి. మనుష్యులకు జన్మతః ఉత్తమాధమ భేదములను గల్పించు అధములు మనకంటె మఱియొకరు లేరని మనకు తెలిసివచ్చినది. నేటికిగూడ పూర్వాచారమే అంధవిశ్వాసమే చాలవఱకు రాజ్యముచేయుచుండినా వర్ణకల్పన, స్పృశ్యాస్పృశ్య విభేదము మానవులు చేయవలసినవికావనీ, వాని నమసరించుట యీశ్వర ద్రోహమనీ మనలో అనేకులకు బోధపడియే—హృదయములలో మథన గావించుచునే యున్నది.

ఇట్టి యావేదనవలననే రామమోహనుడు, దయానంద సరస్వతి మొదలగు తత్వవేత్తలు అస్పృశ్యులయెడల ప్రత్యేక శ్రద్ధ వహించి వర్ణకల్పనమును, తెగలభేదములను మొదలంట రూపుమాపుటకు పూనుకొనినారు.

మానవత్వమునకు సంబంధించిన యీ యావేదన యిట్లుండగా క్రైస్తవ మిషనరీలు నిమ్నజాతుల ననేకులను తమమతమున గలుపుకొనుచు, తన్మూలమున వారిని మనకు ప్రత్యర్థికోటిలో చేర్చుచుండుట మనలో విశాలహృద

యుల కన్నేసులకు జలవరింపు కలిగించినది. ఈ కారణము వలన మనలో ననేకు లస్పృశ్యతను రూపుమాపుటకు తీవ్రప్రయత్నములను ప్రారంభించిరి.

ఇది యిట్లుండగా అస్పృశ్యులకు రాజకీయముగా ప్రత్యేకత తటస్థించినది. దేశపరిపాలనమున సంబంధము క్రమక్రమముగా అధికారము,—మనకు స్వయంనిర్ణయ ధర్మము, స్వేచ్ఛ మనకు ప్రాప్యములైన కొలదిని దొర తనమువా రస్పృశ్యులను చేరదీయసాగిరి. ఈ విపత్తు గ్రహించి దీనికి ప్రతిక్రియ చేయబూనిన రాజ్యతంత్రజ్ఞులలో లోకమాన్యులు ప్రథములును, ప్రముఖులునై నిలిచినారు.

నేడు గాంధిగారు అస్పృశ్యుల విషయమున ప్రాయోపవేశము చేయుటకే సిద్ధపడినారు.

ఏమంచ : పరప్రత్యయనేయ బుద్ధులగు కొలది పాటి అస్పృశ్యనాయకుల శుకానువాదము ననుసరించి బ్రిటిషు ప్రధానమంత్రి రామ్సే మాక్డనాల్డుగారు నిమ్న జాతులకు ప్రత్యేకనియోజక వర్గములను తీర్మానించుట అస్పృశ్యులకు చాలమంచిదే యైనది. ఏమంటే? మాక్డనాల్డుమంత్రి అట్లు తీర్పుచేయకున్న గాంధిగారు ప్రాయోపవేశమునకు పూనుకొనియుండరు. గాంధిగారు ప్రాయోపవేశమునను పూనకుండిన దేశమున అస్పృశ్యులను గురించి యింత యలజడి, యింత తహతహ, యింత యావేశన పొడచూపియుండదు.

అయితే: ఈరాజకీయపు టెత్తువలన మాత్రమే అస్పృశ్యులకు పూర్తిగా విముక్తి కలుగదు. గాంధిగారి ప్రాయోపవేశ సంకల్పమువలన రాజకీయములయందలి నిమ్నజాతుల ప్రాతికూల్యము నేటితో నంతరించిపో వచ్చును; గాని దీనివలన అస్పృశ్యులకు సాంఘికముగా కలుగగల మేలు పరమాణుమాత్రమే.

మనలో సనాతన ధర్మ వాదులుగూడ అనేకు లున్నారు. సాధారణముగా గ్రామీణులందఱును గతానుగతికులు. సనాతనధర్మవాదమున ప్రీతిలేకపోయినా వారు సంస్కారవాదులుగారు. ఈ యుభయపక్షములవారు నస్పృశ్యులను దేవాలయములలోనికి రానిత్తురా? తాము వాడుకొను చెఱువులయందు, బావులయందు నీరు తీసి కొననిత్తురా? పాఠశాలలలో చేరనిత్తురా? తమ వసుమ సంచరించుటకును, నివసించుటకు నంగీకరింతురా? లేకున్న ఈయొడంబడికవలన అస్పృశ్యులకు కలుగు ప్రయోజన మేమి?

పోనీ : ఒక తెగవారిని అస్పృశ్యులుగానుంచుట వలన మనకేమైన ప్రయోజనమున్నదా? మతాంతరులను నిశ్శంకముగా తాకుచుండిన—ఇండ్లలోనికి రానిచ్చుచుండిన మన మస్పృశ్యులను తాకుట పతనహేతువగునా? ఈ యస్పృశ్యులే మతాంతరులై వచ్చిన మన మేమిచేయుచున్నాము? మన మతమునం దుండుటవలననే వా రస్పృశ్యులా?

వాస్తవముగా అస్పృశ్యతను గుఱించి మన మంధులమై యున్నాము. దానినిగుఱించి మనము వినినమాటలను నమ్ముచున్నామే గాని సొంతముగా నేమియు ఆలోచించుట లేదు.

నిమ్నజాతులు జన్మతః మనకంటె హీనులుకారు. అవకాశము లుండినచో వారు సకల విషయములయందును మనతో తులతూగగలరు.

ఇంతకీ: ఒక్క అంబేద్కరుగారు రఢ్డుకొనుటవలన మన రాజకీయరంగమంతయు క్షుభితమైపోయినది. 7 కోట్ల అస్పృశ్యులును మేలుకొని నిలిచిన మన సవర్ణత రూపే గాను, పేరు గూడ లేకుండబోవును.

శాస్త్రి.

---

## యుద్ధవిరామము

నేడు ఏఖండమున చూచినను, ఏదేశమున వినినను "యుద్ధము లంతరింపవలయు" నను ప్రజాఘోష చాల తీవ్రముగా నున్నది.

భౌతికమగు నాధిక్యమును, ఐహికములగు సౌఖ్యములను ఆశించి యొకదేశమువారు, అట్టియాశలతోడనే యుండిన మఱియొకదేశమువారిని, కండకండలుగా నఱి

కుట, దుమ్ముధూళిగా కాల్చుటయు సమానవకృత్యము లనక తీఱదు. ఇట్టి దౌర్జన్యము నికనైన విరమింపవలయు నని ప్రజలు భావించుట వాస్తవముగా మంచిదే.

“అయితే: యుద్ధము లంతరించుట యెట్లు?” ఇదీ యిప్పుడు హేమాహేమీ లందఱును చర్చించుచున్న విషయము.

“ఎవరిమట్టుకు వారు రాజ్యరక్షణమునకు చాలినన్ని ఆయుధములను మాత్ర ముంచుకొని తక్కినవాటిని రూపు మాపుటయే యిందుకు మార్గ” మని దీర్ఘాలోచనమీద వారు తేల్చుకొనినారు. ఈయూహతో వారు సభలు చేయుచున్నారు తీర్మానములను వ్రాయుచున్నారు. చర్చలు సాగించుచున్నారు. తుదకు లౌక్యమంతయు ప్రదర్శించుచున్నారు.

ఇంతేగాదు: పైకి యిట్లు చెప్పుచు ఎవరి మట్టుకు వారు రకరకపు యుద్ధనాకలను కట్టుచునే యున్నారు. శతఘ్న్యాది మారణయంత్రములను నిర్మించుచునే యున్నారు. విషవాయువులను తయారుచేయుచునే యున్నారు. పైగా తమతమ దేశీయులలో పరదేశీయులను గుఱించి విషభావములను వ్యాపింపజేయుచునే యున్నారు.

యుద్ధవిరామమును గుఱించి నేడు పాశ్చాత్య నాగరికులు నడపుచున్న తంతు ఇదీ.

ధిక్! ఏమి నాగరికత యిదీ? వాస్తవముగా నీ ప్రయత్నములు యుద్ధముల నంతరింపజేయుటకా, గిల్లి కజ్జా పెంచుటకా?

కారణములు బలపడుచునేయుండగా కార్యములు నిలిచిపోవలయు ననుట చాల సాహసమే. అయితే: పాశ్చాత్య లిప్పుడు మునిగి తేలుచున్న భోగలాలసత యింతకంటె మంచిమార్గమును గనపడనీయకుండుటలో నక్రమము లేదు. విజ్ఞానగర్వము గూడ వారికి పెడ బుద్ధులు పుట్టించుటలో వింత లేదు.

నిజముగా వారు యుద్ధము లంతరించుటకే ప్రయత్నించుచున్నారా? అయినచో నిదికాదు మార్గము. “యుద్ధము లంతరించుట యెట్లు?” అని కాదు ప్రశ్న. “యుద్ధము లేల జరుగుచున్నవీ?”

యుద్ధనాకలు, శతఘ్నులు, విషవాయువులు విమానములు, ఇత్యాదులు యుద్ధసాధనములు గాని యుద్ధ కారణములు గావు. ఇవి లేకున్న మఱియొకరకపు వస్తువులతో-తుదకు లాఠీకఱ్ఱలతో యుద్ధములు సాగింపవచ్చును; కావున మూలకారణముల నున్మూలించుకొనవలయును; గాని ఆయుధములను తగ్గించుటవలన ప్రయోజనము లేదు. ఇంతేగాక: కారణములు కారణములుగనే యుండగా ఆయుధములను తగ్గించుటగూడ పొసగని పని.

అయితే యుద్ధకారణము లేమి? ఆదికాలమున, మొన్నటివఱకును అసూయ, ఆక్రమణవాంఛ, సార్వభౌమపదవీవాంఛ—ఇట్టివి యుద్ధకారణములై యుండెడివి. ఇప్పుడుగూడ నివి సమూలముగా నంతరింపలేదు; గాని నేటి ప్రధానకారణము వాణిజ్యము.

నేడు ప్రతిదేశమునందును రాకాసులవలె లెక్కలేనన్ని ఫాక్టరీలు రాత్రింబగళ్లు పొగలు గ్రక్కుచు అపారములైన వస్తురాసులను సృష్టించుచున్నవి. వాటికి విడుదల కావలయును. ఇందులకై విదేశముల బజారులను స్వాధీనము చేసికొనవలయును.

నేడు స్వతంత్రదేశముల ప్రభుత్వములన్నియు తమ ప్రతిభను, చాతుర్యమును, శక్తిని ఇందుకే వినియోగించుచున్నవి. ఇందుకే ఒడంబడికలు. ఇందుకే ఒడంబడికల తిరస్కారములు. తుదకిందుకే యుద్ధములు. ఈ కారణమువలననే నోరుమాలిన కోట్లకొలది జనుల సంఘమరణములు.

మానవహస్తము అంతులేని చాతుర్యమును—కళనే ప్రదర్శించును; గాని ఇట్లు వస్తుపర్వతములను నిర్మించి ప్రభుత్వముల సవ్యబుద్ధిని భ్రష్టముచేయదు. దీనికిదోడు ప్రజలకు తృప్తి, ప్రభుత్వములకు నియామక శక్తియు నున్నచో ఈపోటీలకు, ఈ సంఘర్షణములకు, ఈ సర్వనాశనములకు నిక హేతువు లుండవు.

ఇందుకే గాంధిగారు యంత్రములను బహిష్కరింప వలయునని బోధించుచున్నారు.

అయితే: కేవలము చేతిపనులవలన నేటి యావశ్యకములు తీరునా? ప్రజల యభిరుచుల మాట యట్లుండ ప్రభుత్వములు పోనుబకైన నవకాశము కలదా?

నిజమే. యంత్రములవలననే కొనసాగు కొన్ని పనులున్నవి. వాటికి యంత్రములనే వాడవచ్చును; గాని ముందు తృప్తి యుండవలయును! స్వదేశమున అవసరమైనంతవఱకే వస్తునిర్మాణమనునిశ్చయము కలుగవలయును.

నేడు దేశములన్నియు దమకాళ్లమీదనే నిలుచుటకు గోరుచున్నవి. మనదేశమునందలి పల్లెటూళ్లన్నియు నీదృష్టితోడనే తీర్చి దిద్దబడినవి. కావున ప్రతిదేశము వారును ఎగుమతులను కట్టిపెట్టవలయును. నేడు యుద్ధము లంతరించుటకిదిగూడ నొక గొప్ప యుపాయము.

శాస్త్రి.

---

# మెఱుఁగు

కుందుర్తి నరసింహారావుగారు

మా దేవలోకాలు
పూఁదేనెపాకాలు
మీదాఁక రానీయరా?
పూదండ
చేఁదైన పోనీయరా?

మానిగ్గు తెరచాటు
మీదగ్గు పొరమాటు
పై కెగ్గు తోఁచిందిరా,
లోసిగ్గు
పై మొగ్గ పూచిందిరా!

మాకంటి నిప్పులో
మీపంట పప్పులో
లోకాలు జీవించురా:
రాకాసి
నీకాలు సేవించురా!

మా నేత మెఱుఁగెత్త,
మీ తాత పలుగెత్త,
ఏజాతి తలమెత్తురా?
నీరాత
యీరీతి వెలుఁగెత్తెరా!

మీ నేల పెదవిలో
మానోటిచదువులో
ప్రాణాలె పరుగెత్తురా,
ఈనాఁటి
కాణాచి నిలువెత్తురా!!

మాపల్లె గర్జింప
మీ రిల్లు వర్జింప
ఏతల్లి చూపోపురా?
వారెల్ల
మీతల్లి పైకాఁపురా!

కడుపులో నీరుండె,
తడపరా నీగుండె,
నడుము గట్టి బిగింపరా;
పిడుగైన
పడి జార, తలవంపురా!

పైనున్న మాకంట,
మీకన్న వారింట,
ఎన్నెన్ని నేరాలురా;
మీ తెన్ను
మున్నీట దూరాలిరా!

---







శ్రీ రాబీను ఛటర్జీ గారు, అలహాబాదు

ఇతడు ఘం. ౬౧, ని. ౪౫ కాలము నీటిలో ఈదుచునుండెను. ప్రపంచమున నింతకాలము నీటిలో నీదుచుండినవారు మరెవ్వరు లేరు. ఇతనికంటె కొంచెము తక్కువ కాలము, నీటిలో చాలసేపు ఈతయందు ఓర్పుచూపిన యతడు. ఘం. ౬౧, ని. ౨౨ కాలము ఈదుచుండగలిగెను.

---

## సహారా యెడారి క్రింద మహాజలరాశి

కొందఱు వైజ్ఞానికులు భూమియందలి ప్రతిరహస్య భాగమును బరిశోధించుటకు గడంగిరి. వారిలో ఫ్రాంసు దేశీయులు కొందఱు కొన్ని మాసములక్రిందట దుర్గమము నుదురవగాహమును నగు సహారా యెడారిని మోటారులపై దాటిరి. ఆ దాటినప్పుడు వారా మరుభూమియందలి యొక యద్భుత రహస్యాంశమును గనుగొనజాలిరి.

తీవ్రసూర్యాతపముచే బరితప్తమగు రజస్సముద్ర (Sand Sea) మనదగు నా యెడారిమధ్యమ ఇసుక తుపానులు లేచి ఆకాశమునకు స్తంభములగట్టు మహాగ్రీష్మ వేళ, కాళ్లు కాలుచుండ, తల మాడుచుండ, గొంతుక యెండి దప్పికచే పరితపించుచు నాయెడారిని బడి పోవు నేబాటసారితోగాని 'ఓయీ, నీపాదములక్రింద నతిశీతల జలసముద్ర మున్న'దని చెప్పిన విశ్వసింపగలడా? కాని ఆ వైజ్ఞానికు లీమరుభూమియొక్క యడుగుభాగమున దానిసమతలమునుండి ౨౦౦ లేక ౩౦౦ అడుగులలోతున నొక మహాజలరాశి యున్నదని విశ్వసించుచున్నారు. ఆ వైజ్ఞానికు లీయెడారిని దాటునపు డొకచోట రెండు కృతకకూపములను (Artesian Wells) చూచుట తటస్థించినది. అంత వా రాయెడారిక్రింద జల ముండితీరునని యూహించి యాస్థలమున జలయంత్రముల గొట్టములను (Boring Fumps) భూమిలోనికి దింపిరట. అట్లు ౩౦౦ అడుగుల లోతునకు దింపగా జలము లభించినదట. పైకి యంత్రములమున వచ్చిన జలముతోపాటు సముద్రజీవములును కొన్ని వచ్చియుండెను. చేపలు, నత్తలు, పీతలు సరిగ మనము బయట సంద్రములకడ జూచు నాకృతులే; ఎట్టి భేదమును లేదు.

ఈ జల మూట యనుకొంటున్న ఈ సముద్ర వరము లెందుండి వచ్చినవి?

సాధారణముగా మరుభూములయుత్పత్తి సముద్రములనుండియే యగును. ఎప్పుడో అంబుధియొక్క యొక కొంతభాగము చతుర్ముఖముల నుంచుకొని పోయి మధ్య భూప్రదేశమును వదలియుండును. ఆస్థానము సహారా యెడారి యైయుండును. ఇందుకు ప్రమాణముగా నీ యెడారిక్రిందనుండి లభ్యములైన యూమత్స్యములు దృష్టిశక్తివిహీనములై యుండెను. ఎన్నియో వేల వత్సరములు గాఢాంధకారమున బసియుండుట నీజాతికి దృష్టిశక్తి లోపించినది. కేవలము మనము వీక్షించుచుట్టి ఉదధి కాక పోయినను కటికచీకటులకు నెలవగు స్వతంత్రమైన యొక మహాజలరాశి యీయెడారిక్రింద నున్నదని రూఢియగుచున్నది. పరిశీలించినకొలది, జ్ఞాననేత్రము వికసించిన కొలది నీ మహాజగచ్చిత్రశాలయం దిట్టియపూర్వదృశ్యములు పొడగట్టునోగదా!

మరకాని పరాత్పరరావు.

---

### కరుణరసంలో ఆనందము :
### పొరుగుంటి జగడం విన వేడుక

కరుణరసంలో ఆనందం ఎక్కడిదని కొందరికి పోట్లాట. దీని కిహామిత పనికివస్తుం దనుకుంటా. అనుకార్యుడు ఏడుస్తుంటే చూచేవాండ్లకూ, ఆడేవాండ్లకూ, కావ్యాలలో, వినేవాళ్లకూ, ఏమికొంప మునిగింది. తమాషాగా వింటారు. వినే కనే వారిలో కదా రసం పుట్టడం. అయితే వీరికిన్ని ఏడుపేవస్తుంది కాని, పరాయి ఏడుపు కాన తమాషాగా వుంటుంది. ఇది మానవప్రకృతి. ఇట్లాకూడా కరుణరసానికి ఆనందరూపత్వము సమకూర్చుకోవచ్చు.

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి.

---

### కీ. శే. పండిత శ్యామసుందరచక్రవర్తి గారు

వీరు సుప్రసిద్ధ వంగీయబ్రాహ్మణ కుటుంబమున జన్మించినవారు, మంచి విద్యాధికులు, నిష్కళంక దేశభక్తియుతులు, విశ్వాసమునమసరించి తలపెట్టిన కార్యముల ఆచరించుటకు గడంగినవారు. గాంధీమహాత్ముని యుద్యమమువారు చేరిన శిష్యులలో అగ్రగణ్యులగు నొకరు. దేశసేవకై, కాంగ్రెస్ ప్రచారమునకై, ఉపయోగపడుటకు 1920 లోనే వీరాంగ్లమున 'సర్వెంట్' (సేవకుడు) అను పత్రికను స్థాపించి స్వీయ సంపాదక


ANDHRA PATRIKA

త్వమున చాలయేండ్లు అద్భుతముగ, నిర్భయముగ నడిపిరి. తర్వాత వంగభాషను 'బసుమతి' దినపత్రికకు సంపాదకులుగ నుండిరి. దారిద్ర్యముచే చాల బాధపడుచున్నను ధైర్యమును వీడక దృఢమగు ఈశ్వర విశ్వాసమును గలిగి యుండినవారు. డబ్బులేమిచేతనే ఆఖరుకు వీరిపత్రికలు ఆగిపోగా, దుర్బలమగు దేహస్థితితో కలకత్తానుండి వీరు పల్లెటూరి నివాసమునకు మరలిపోయిరి. త్రివిధబహిష్కారములను చివరవరకు నమ్మినవారు. దాసుగారి శాసనసభాప్రవేశము వీరి కిష్టము లేకుండెను. గాంధీగారు చివరకు దాసు, నెహ్రూలతో గావించినఒడంబడికను చక్రవర్తిగారు ఒడంబడజాలకుండిరి. కాని వీరియందలిఅపారగౌరవముచే చిత్తరంజనుడు వీరికి తన అంతమువరకు ధనసాహాయ్యము చేయుచుండెను. శ్యామసుందరుడు నిష్కళంక మగు నైతికప్రవర్తనము గలవాడనియు, పరిశుద్ధ ఆస్తికవాది యనియు బెంగాలులో చెప్పుకొందురు.

జ. బ్ర.

# గాంధిమహాత్ముని ప్రాయోపవేశము: ఉత్తర ప్రత్యుత్తరములు

౧

1932 మార్చి 11-వ తేదీని ఎరవాడ చెరసాలనుండి గాంధిమహాత్ముడు ఇండియామంత్రియగు హోరుగారికి వ్రాసిన లేఖ:—

“ రౌండుటేబిలు సభలో అల్పసంఖ్యాకుల హక్కులనుగూర్చి వారి ప్రతినిధులు మాటలాడినపుడు ఆవిషయమునుగూర్చి నేను నా అభిప్రాయమును తెలుపుచు చివరకు,

‘ నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గముల నేర్పరుపకుండ చేయుటకు నేను నా ప్రాణములను గూడ సర్పించెదను. ’

అని చెప్పియుంటిని. ఇది మీకు జ్ఞాపకముండ వచ్చును. తాత్కాలికోద్రేకమువలన గాని భావమును దృఢముగా తెలుపుటకు ఉత్కర్షగా గాని నేనటుల తెలిపియుండలేదు. నా ప్రాణముల నర్పించియైన దీనిని నిరోధింపక తప్పదను దృఢసంకల్పముతోనే నే నటుల తెలిపియుంటిని.

అందువలన నేను ఇండియాకు వచ్చినపిమ్మట ప్రత్యేకనియోజకవర్గములపట్ల ప్రజలకు ప్రతికూలభావమును కలుగజేయుటకు ప్రయత్నింపవలెనని ఉద్దేశించితిని. కనీసము అస్పృశ్యులకైన ప్రత్యేక నియోజకవర్గములను కోరకుండునట్లు ప్రచారము చేయదలచితినిగాని అది అటుల జరుగలేదు.

నాకు చెరసాలలో వార్తాపత్రికల నిచ్చుచుండుటవలన బ్రిటిషు దొరతనమువారేనిమిషమునందైన సాంఘికసమస్యను గూర్చిన పరిష్కారమును ప్రకటింపగలుగుదురని నేను పత్రికలద్వారా తెలిసికొంటిని. వారు అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గముల నేర్పరుచునెడల నేను చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుటకు తగినచర్యల నవుడవలంబింపవలెనని నేను మొదట తలచితినిగాని నా అభిప్రాయమును వ్యవధియుండగానే దొరతనమువారికి తెలుపకపోవుట న్యాయముకాదని నేను మరల తలచితిని. ఏలయన నా ప్రతిజ్ఞపట్ల నాకు గల దృఢాభిప్రాయము దొరతనము వారికి కలుగకుండుట సహజమే.

అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరుచుటకు నాకు గల ఆక్షేపణల నన్నిటిని నేను ఇదివరకే తెలిపియున్నాను కావున వాని నన్నిటిని నేను మరల నిచట వ్రాయుట అనవసరము.

నేను గూడ అస్పృశ్యుడననియే భావించుచున్నాను.

ఇతర సంఘములవారి విషయము వేరు, అస్పృశ్యుల విషయము వేరు. వారికి శాసనసభలలో ప్రాతినిధ్య ముండగూడదని నా అభిప్రాయము కాదు. వారిలో మైనారిటీ నదలినవారి కందరికిని స్త్రీలకును పురుషులకునుగూడ వోటింగుహక్కుల నియ్యవలెననియే నేను కోరెదను. ఇతరులకు వోటింగుహక్కుల నిచ్చుటకు విద్య,సొత్తు మున్నగు అర్హతలను కఠినముగా నమలుజరిపినను గూడ అస్పృశ్యులకు వయస్సు అర్హత తప్ప మరే అర్హతయు నుండగూడదు. రాజకీయ దృక్పథమునుండి చూచినచో ప్రత్యేక నియోజకవర్గము లెటులుండినను హిందూమతమునకును అస్పృశ్యులకును ఇది చాల హానికరము.

అస్పృశ్యులు సవర్ణ హిందువులలో నెటుల వ్యాపించియున్నదియును, సవర్ణులపైని వీరెట్లు ఆధారపడియున్నదియును గ్రహించిననే గాని ప్రత్యేక నియోజకవర్గములవలన అస్పృశ్యులకు కలుగునట్టి హానిని ఇతరులు సరిగా గ్రహింపజాలరు. ప్రత్యేక నియోజకవర్గములు హిందూసంఘములో చీలికలను కలిగించును.

అస్పృశ్యుల సమస్య ముఖ్యముగా మతమునకును నీతికిని సంబంధించినదనియే నేను నమ్ముచున్నాను. రాజకీయముగూడ ముఖ్యమేయైనను మతముతోను నీతి

తోను పోల్చినచో రాజకీయము ప్రాముఖ్యము నామమాత్రమే యగును.

నేను నా బాల్యమునుండియును నిమ్నజాతుల అభివృద్ధికొరకే పనిచేయుచుంటిని. చాలసారులు నా సర్వస్వమునుగూడ వారికొరకు వినియోగించితి నని మీరు తెలుసుకొనగలిగిన వీరి విషయమున నాకు గల గాఢతమమగు నభిమానమును మీరు గ్రహింపగలుగుదురు. నే నిది నా గొప్పకొరకు చెప్పుకొనుటలేదు. పెక్కు శతాబ్దముల నుండి సవర్ణులగు హిందువులు అస్పృశ్యులను అత్యంత దుస్సహమగు నీచస్థితికి పాలుపరచిరి. ఇందులకు వా రెంతటి ఘోరతపస్సు చేసినను గూడ వారి పాపమున కది సరియైన ప్రాయశ్చిత్తము కాజాలదు. అస్పృశ్యు లనుభవించుచున్న దారుణదుస్థితి ప్రత్యేక నియోజకవర్గముల వలన తొలగదు. ఇది సవర్ణులకు ప్రాయశ్చిత్తమును కాదు.

‘కావున బ్రిటీషు దొరతనమువారు అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరుచుటకే నిశ్చయించునెడల నేను నిరశన వ్రతమును బూని ఆరీతిగా నా ప్రాణములను త్యజించెదను.’

అని నేను సగౌరవముగా దొరతనమువారికి తెలియజేయుచున్నాను.

నేను ఖైదీనిగా నున్న సమయమున నే నిట్టుల చేయుటవలన దొరతనమునకు చాల ఇబ్బంది కలుగునని నే నెరుగుదును. నా స్థితిలోనున్న మనుష్యుడు రాజకీయములో నిట్టి పద్ధతులను ప్రవేశపెట్టుట చాల అక్రమమని పెక్కుమంది తలచెదరనిగూడ నే నెరుగుదును. నిరశన ప్రాయోపవేశ పద్ధతి భావోద్రేక సంజనితమగు దారుణ పద్ధతియని చాలమంది తలపవచ్చును. ఇది నేను కల్పించిన పద్ధతికాదు. ఇది నా ఆత్మతత్త్వములోనిదే గాని అన్యము కాదు. ఇది నా హృదయకమల నివాసి యగు నీశ్వరుని ప్రేరణ గాన దీనిని నేను తిరస్కరింపజాలను. నేనిట్టుల నిశ్చయించుటవలన నాకు మతిపోయినదని ప్రజలు తలంచినను తలంతురు గాక! నాకు గత్యంతరములేదు.

నన్ను చెరసాలనుండి వదలినను గూడ దీనిని సవరింపకపోయినచో నేను నాకు ప్రాణము లుండువరకును నిరశన ప్రాయోపవేశమును సలుపవలసియే యుండును.

కాని నే నీవిషయమున లేనిపోని సంశయములను కలుగజేసికొనుచున్నానే గాని నిజముగా బ్రిటిషు దొరతనమువారు అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గములను విధింపరనియే నే నాశించుచున్నాను.

## కఠిన విధానమును నిరసించుట

నేను మరియొక విషయమునగూడ స్వల్పకాలము నిరశనదీక్షను బూనవలసియున్నది. దొరతనమువా రవలంబించుచున్న కఠినవిధానమును గూర్చియే నేను ముచ్చటించుచున్నాను. దానివలన నే నే నిమిషమున నిరశన వ్రతమును బూనునట్లు నిశ్చయింపవలసివచ్చునో యిపుడు చెప్పజాలను. ఈ కఠినవిధానము హద్దుమీరుచున్నదనియే నేను తలచుచున్నాను. దొరతనమువారు దేశమునందంతటను ప్రజలను భయవిహ్వలులను గావించుచున్నారు. ఉద్యోగులగు ఆంగ్లేయులును భారతీయులును గూడ క్రూర మృగతుల్యులుగా చేయబడుచున్నారు. భారతీయులగు నుద్యోగులు తమ స్వదేశీయులపట్ల ద్రోహులుగా నుండుటవలనను వారిని అతిక్రూరముగా బాధించుటవలనను ఆ యుద్యోగులు ప్రభుత్వమువారి ప్రశంస కధికముగా పాత్రులగుచుండుటచే భారతీయులలో పెద్దయుద్యోగులును చిన్న నౌకరులునుగూడ నీతిబాహ్యు లగుచున్నారు. ప్రజలు గడగడలాడిపోవుచున్నారు. నిజాభిప్రాయమును ప్రజలు వెల్లడించుటకు వీలు లేకుండ చేయబడినది. లా-ఆర్డరుల పేరుతో దౌర్జన్యము జరుపబడుచున్నది. దేశసేవను సలుపబూనిన స్త్రీలు తమకు మానభంగ మగునేమోయని భయపడునట్టి స్థితికి వచ్చియున్నారు. కాంగ్రెసువారు ప్రకటించుచున్న జాతీయస్వాతంత్ర్యభావమును అణచివేయుటకే

యీ చర్య లన్నియును జరుపబడుచున్న వని నేను తలచుచున్నాను. శాసనోల్లంఘన మొనరించిన వారిని మాత్రమే శిక్షించుటలేదు. ప్రజలందరినిగూడ నవమాన పరుచుటకే క్రొత్తగా ఉత్తరువులు చేయబడినందున వాటిని భంగపరుపవలెనను నుద్రేకము ప్రజలలో కలుగుటకు కారణమగుచున్నది.

ఈ చర్యలలో ప్రజాసత్తాక మేమియును కనబడుటలేదు. యీ ప్రజాసత్తాకము సంకుచితమగు పాని మెరుగేగాని నిజమైనది గాదని నేనిటీవల ఇంగ్లాండుకు వెళ్లి వచ్చిన పిమ్మట బాగుగా గ్రహింపగలిగితిని. ఇంగ్లాండులో ముఖ్యతమములగు విషయములలో పార్లమెంటు వారికి తెలుపకుండనే నాయకులును సంఘములవారును నిర్ధారణ చేయుచుందురు. తా మేమి చేయుచున్నదియును సరిగా గ్రహింపకుండనే అటుపిమ్మట పార్లమెంటు సభలలో సభ్యులు వీటిని స్థిరపరుచుచుందురు. ఈజిప్టు విషయమున నిటులనే జరిగినది. 1914 లో యుద్ధము గూడ నిటులనే జరిగినది. ఇపుడు ఇండియా విషయమునగూడ నిటులనే జరుగుచున్నది.

ప్రజా సత్తాక మనబడు రాజ్యాంగ పద్ధతిలో నొక్కవ్యక్తి 33 కోట్ల మంది ప్రజలు గల అత్యంత ప్రాచీన నాగరకతానిలయమగు భారత దేశమునుగూర్చి నిరంకుశముగా నుత్తరువులు చేయుచుండుటయును వాటిని నెరవేర్చుటకు అతి దారుణములగు మారణశక్తులను ప్రయోగించుచుండుటయును తలచుకొనగా నా మనసు దందహ్యమానమగుచుండును. ఇది ఎంతమాత్రమును ప్రజాసత్తాకము కాజాలదు.

ఇదివరకే భారతీయులకును బ్రిటిషువారికిని ద్వేషభావము లేర్పడినవి. ఈ కఠినవిధానము నింకను కొనసాగించునెడల నీద్వేషభావములు మరింత ప్రబలము కాక మానవు.

ఈ విషయములో నేను చేయగలిగినదేమి? నేను శాసనోల్లంఘనమును నిలుపజాలను. నేను స్వభావము వలన ప్రజాసత్తాకవాదిని గాని సత్యాగ్రహము నాకు ముఖ్యధర్మము. ప్రజాసత్తాకమును కోరువారు తమ సంకల్పము నీడేర్చుకొనుటకు దౌర్జన్యపద్ధతిని అవలంబించుటకు అనగా పశుబలమును ప్రయోగించుటకు నేను సమ్మతింపజాలను. అపుడు సాత్వికనిరోధమే గత్యంతరమగుచున్నది. సత్యాగ్రహ మొనరించువాడు తాను కష్టముల పాలగుటకు సంసిద్ధుడుగా నుండవలెను. చివరకు నిరశన ప్రాయోపవేశముద్వారా ప్రాణముల నర్పించుటగూడ నతనికి కర్తవ్యమే యగును. అటుల ప్రాయోపవేశ మొనరింపవలె నను ప్రేరణ యిప్పటివరకును నాకు కలుగలేదు. కాని యిపుడు దేశమున జరుగుచున్న కార్యములు నా అంతరాత్మను చలింపజేయుచున్నవి. కావున అస్పృశ్యుల ప్రత్యేక నియోజకవర్గములనుగూర్చి నేను నిరశన ప్రాయోపవేశమును సలుపవలసియుండు నని మీకు తెలుపుటలో నిందులకు మరియొక కారణముగూడ కలదని తెలుపుట నాకు ముఖ్యకర్తవ్యమై యున్నది.

మీకును నాకును జరిగిన లేఖలనుగూర్చి నేనింతవరకును అతిరహస్యముగానే యుంచితిని. సర్దారు వల్లభభాయియును మహాదేవదేశాయియును నావద్ద నుండుటచే వారి కిద్దరికిని మాత్రము ఈ విషయములు తెలిసియున్నవి. ఈ లేఖను మీ యిష్టమువచ్చినరీతిని మీరు వినియోగింపవచ్చును.”

## సర్ సామ్యూలు హోరుగారి ప్రత్యుత్తరము

1932 మార్చి 11-వ తేదీని మహాత్ముడు వ్రాసిన లేఖకు ఏప్రిలు 13-వ తేదీని హోరుగారు ప్రత్యుత్తరమును వ్రాసిరి :—

“నిమ్నజాతులవారికి ప్రత్యేకనియోజకవర్గముల నేర్పరుచుటనుగూర్చి మీకు గల నిశ్చితాభిప్రాయమును నేను మీ లేఖవలన పూర్తిగా గ్రహింపగలిగితిని. ఈ అంశముయొక్క అర్హతనుబట్టి మాత్రమే మేము పరిష్కరించవలసి యుండును. లోథియను కమిటీవారి సంచారమింకను పూర్తికాలేదు. కాన వారి నివేదిక చేరుట కింకను కొన్ని వారములుపట్టును. అపుడు వారినివేదికలోని సూచన

లనుగూర్చి మేము చాల శ్రద్ధగా యోచింపవలసియుండును. అపుడు మీరును మీపక్షమువారును తెలిపిన అభిప్రాయములనుగూర్చిగూడ మేము యోచించెదము. మీరే మాస్థానములో నుండినయెడల మీరుగూడ మా పద్ధతినే అవలంబించి యుందురు. లోథియను కమిటీవారి నివేదిక మీకు చేరినపిమ్మట మీరు దానినిగూర్చి బాగుగా యోచింపవలెను. రెండుపక్షములవారును ఈ విషయమున తెలిపిన భావములనుగూడ మీరు శ్రద్ధగా గమనింపవలెను. ఇంతకంటె హెచ్చుగా నేనేమియును వ్రాయజాలను.

ఆర్డినెన్సులనుగూర్చి యిదివరకు బహిరంగముగాను, రహస్యముగాను మీతో చెప్పినదానికంటె హెచ్చుగా నేనిపుడేమియును చెప్పజాలను. ప్రజలుసక్రమ పరిపాలనయొక్క మూలాధారములనే భంగపరుపగోరినపుడు ఈ పద్ధతుల నవలంబించుట దొరతనమువారికి ముఖ్యకర్తవ్యమనియే నేను తలచెదను. ఇండియా దొరతనమునకును రాష్ట్రీయ-దొరతనములకును అత్యధికము లగు నధికారము లియ్యబడినను వారు వాటిని దుర్వినియోగము చేయుట లేదని నేను దృఢముగా చెప్పగలను. ఉద్యోగులు పగ సాధించు నుద్దేశముతో దారుణకృత్యముల నొనరింపకుండునట్లు దొరతనమువారు చాల శ్రద్ధగా గమనించుచునే యున్నారు. లా-ఆర్డరులను కాపాడుటకును, దౌర్జన్యపక్షమువారివలన మా ఉద్యోగుల ప్రాణములకును ఇతరప్రజల ప్రాణములకును భంగము కలుగకుండ కాపాడుటకును ఎంతకాలమువరకు ఈ ఆర్డినెన్సులను అమలులో నుంచవలసియుండునో అంతకాలమువరకు మాత్రమే యివి అమలులో నుంచబడును. ఈ అవసరము తీరినవెంటనే యివి రద్దుపరుపబడును."

## ౨

## మహాత్ముడు మెక్డానల్డుగారికి వ్రాసిన లేఖ

1932 అగష్టు 18-వ తేదీని మహాత్ముడు ప్రధానమంత్రి కీలేఖను వ్రాసెను:—

"నేను మార్చి 11-వ తేదీని హోరుగారి పేర వ్రాసినలేఖను ఆయన మీకును మంత్రివర్గము వారికిని చూపించియుండునని యే నేను తలచెదను. ఇప్పుడు నేను వ్రాయుచున్న విషయములు గూడ ఆ లేఖతోడి భాగములుగానే మీరు భావింపగోరెదను.

అల్పసంఖ్యాకుల శాసనసభ్యత్వనియోజనముపైని బ్రిటిషు దొరతనమువారి నిర్ణయమును నేను చదివితిని. 1931 నవంబరు 13-వ తేదీని లండనులో సెంటుజేమ్సు ప్యాలెసులో రౌండుటేబిలుసభ అల్పసంఖ్యాకులసంఘము వారి సభలో నేను చేసిన ప్రకటనను నేను 1932 మార్చి 11-వ తేదీని హోరుగారికి వ్రాసిన లేఖను అనుసరించి నేను మీనిర్ణయమును ప్రతిఘటించుటకు నాప్రాణముల నర్పించుటకే నిశ్చయించితిని.

నే నందులకు నిరశనవ్రతమును ప్రారంభించెదను. నీళ్లలో ఉప్పును సోడాను కలిపిగాని కలుపకుండగాని, నీళ్లను మాత్రమే త్రాగెదను. కాని మరే పదార్థమును తినను. మరి దేనిని గూడ త్రాగను. నా ప్రాణములు పోవువరకును నేనీరీతిగా నుపవాసములనుచేసెదను.

ఈ లోగా దొరతనమువారి స్వబుద్ధివలనగాని ప్రజల ఒత్తిడివలన గాని ప్రభుత్వమువారు తమ నిర్ణయమును మార్చుకొని నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గపు ఏర్పాటులను రద్దుపరచినచో అంతటినుండియు నేను నిరశనవ్రతమును విరమించెదను.

సామాన్యపు వోటింగు అధికారము ననుసరించి (వారి కా అధికార మెంత హెచ్చుగనున్ననుసరే, సమష్టి నియోజకవర్గములలోనే అస్పృశ్యుల ప్రతినిధులను శాసనసంఘములకు యెన్నుకొనవలెను.

ఈ సెప్టెంబరునెల 20 వ తేది మధ్యాహ్నము 12 గంటలనుండి నేను నిరశనవ్రతమును ప్రారంభింప దలచితిని.

ఈ లోగానే దొరతనమువారు దీనిని సవరించినచో నేను ఉపవాసమును ప్రారంభించవలసిన ఆవశ్యకతయే కలుగదు.

ఈలేఖ చాల వ్యవధియుండగానే మీకు చేరునట్లు దీనిని తంతివార్తమూలమున పంపవలెనని యిచటి ఉద్యోగులను నేను కోరితిని. వారటుల చేయకపోయినను యిది ఎంత ఆలస్యముగా మీకు చేరినను గూడ చాల వ్యవధి యుండకపోదు.

ఈ లేఖను, మార్చినెల 11-వ తేదీని నేను హోరు గారికి వ్రాసిన లేఖను, గూడ సాధ్యమైనంత త్వరలో నే ప్రకటింపవలె నని నేను మిమ్ములను గోరుచున్నాను. నేను జెయిలు నిబంధనలను సరిగా అనుసరించుచున్నాను. ఈలేఖలను గూర్చి వల్లభభాయికిని దేశాయికిని తప్ప మరెవ్వరికిని నేను తెలిపి యుండలేదు. కాని నా లేఖలను చదువుటవలన ప్రజల అభిప్రాయము మారగలదను నాశతో వీటిని త్వరగా ప్రకటింపవలె నని నేను మిమ్ములను కోరుచున్నాను.

నే నిటుల నిర్ణయింపవలసి వచ్చినందులకు చాల విచారించుచున్నాను. కాని నేను మతధర్మముల ననుసరించువాడనగుటచే నాకు గత్యంతరము లేదు. దొరతనమువారికి యిబ్బంది కలుగకుండుటకు వారు నన్ను విడుదల చేసినను గూడ అస్పృశ్యుల ఎన్నికసమస్య సవరింపబడనిచో నేను ఉపవాసమును చేయవలసియే యుండును. నేను మీనిర్ణయమును ప్రతిఘటించుటకు యిపుడు నాకు మరే సాధనమును లేదు. గౌరవ విరుద్ధము లగు సాధనములవలన విడుదలను బడయవలెనను నభిప్రాయము నా కింతమాత్రమును లేదు.

నేను పొరపాటుగానే నిశ్చయించి యుండవచ్చును. నేను భ్రాంతుడనయియుండవచ్చును. అపుడు అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గము లుండగూడదను నా వాదముగూడ పొరపాటే యగును. అది పొరపాటే యగునెడల తక్కిన నా సిద్ధాంతము లన్నియును గూడ తప్పుసిద్ధాంతము లేయగును. అపుడు నేను నిరశనప్రాయోపవేశమువలన ప్రాణములను వదలునెడల నది నేను తప్పు సిద్ధాంతములను బోధించినందులకు ప్రాయశ్చిత్తమగును. అటుల జరిగినచో నా మాటలను దైవవాక్కులుగా నమ్మి నెరవేర్చుచున్న వేలకొలది స్త్రీలకును పురుషులకును యిపు డేర్పడిన గొప్ప భార మంతయు తొలగిపోవును.

అటులగాక నా సిద్ధాంతమే సరియైనదిగా నుండునెడల—అది సరియైన దనియే నేను నిశ్చయముగా నమ్ముచున్నాను—నేను 25 యేండ్లనుండి అనుసరించుచున్నట్టియు చాలాసారులు విజయమును బడసినట్టియు పద్ధతి కిది తగిన పరిసమాప్తియే యగును."

## మెక్డానల్డుగారు మహాత్మునకు వ్రాసిన లేఖ

1932 సెప్టెంబరు 8-వ తేదీని మెక్డానల్డుగారు లండను డౌనింగుస్ట్రీటు నెం. 10 నుండి యీ లేఖను వ్రాసిరి:—

"మీ లేఖను చదువుటవలన నాకు చాల ఆశ్చర్యము కలుగుచున్నది. అస్పృశ్యులవిషయమున దొరతనమువారి పరిష్కారమును మీరు సరిగా గ్రహింపకుండ వ్రాసితిరని నేను తలంచితిని. అస్పృశ్యులను శాశ్వతముగ హిందూ సంఘమునుండి విడదీయుటకు మీరు చాల ప్రతికూలురుగ నున్నారను విషయము మేము మొదటినుండియు గ్రహించియే యున్నాము. రౌండుటేబిలుసభ అల్పసంఖ్యాకుల సమావేశమందు మీరు యీ విషయము స్పష్టపఱచియే యున్నారు. మార్చి 11-వ తేదీని మీరు హోరుగారికి వ్రాసినలేఖలో గూడ మీరు స్పష్టపఱచితిరి. ఈ విషయమున హిందువులలో మిక్కిలి యెక్కువమంది మీతో యేకీభవించి యున్నారని మేము యెఱుగుదుము. కావున అస్పృశ్యుల ప్రాతినిధ్యమును గూర్చి మేము జాగ్రత్తగనే ఆలోచించితిమి.

అస్పృశ్యుల సంఘములవారు చాలమంది మాకు వ్రాసియున్నారు. వారు సాంఘికముగా చాలదుస్థితియందున్నారని మీరు యెఱిగియేయున్నారు. కావున వారి ప్రతినిధులు శాసనసభలలో నుండుట అవసరము గాన అట్టియేర్పాటు చేయుట మా విధియని మేము గావించితిమి. కాని అస్పృశ్యులను హిందూసంఘమునుండి విడదీయకుండుట ముఖ్యతమమని మేము గ్రహించితిమి. అస్పృశ్యులకు శాసనసభలలో ప్రాతినిధ్య ముండుటకు

మీకు ఆక్షేపణ లేదని మార్చినెలలో మీరు వ్రాసిన లేఖలో గూడ తెలిపియే యున్నారు. కొరతవమువారి పరిష్కారముబట్టి అస్పృశ్యులు హిందూసంఘమునందొక భాగముగానే యుందురు. హిందూనియోజకులతో సమానముగ హక్కులను గలిగియుండి వోటుచేసెదరు. కాని మొదటి 20 యేండ్లవరకును హిందూనియోజక వర్గమునం దొక భాగముగానుండి కొన్ని ప్రత్యేక నియోజకవర్గములనుండి తమప్రతినిధులను యెన్నుకొనుట ప్రస్తుతపరిస్థితులలో వారికి అవసరమని మేము నిశ్చయించితిమి. సమష్టినియోజకవర్గములలోను తక్కినవారితోపాటు అస్పృశ్యులకు వోటింగు అధికార ముండును. దీనికి తోడు వారి ప్రత్యేక నియోజకవర్గములలోగూడ వోటుచేయుటకు హక్కుండును. ఇందువలన అస్పృశ్యులకు రెండేసి వోట్లు. అస్పృశ్యులను హిందూసంఘమునుండి విడదీయు నుద్దేశము మాకు లేశమును లేకపోవుటచేతనే మేము వారికి మీ రను కొన్నట్టి ప్రత్యేకనియోజకవర్గము యేర్పాటుచేయలేదు. అస్పృశ్యులను సమష్టినియోజకవర్గమునందు చేర్చుటవలన అగ్రవర్ణములవారు అస్పృశ్యులకు వోట్లనిచ్చుటయును, అస్పృశ్యులు అగ్రవర్ణములవారివోట్లను కోరుటయు తటస్థించును. ఇందుమూలమున సర్వవిధముల హిందూ వేకీభావము కాపాడబడినది.

బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పడిన క్రొత్తలో కొన్ని సంవత్సరముల వరకును రాష్ట్రీయ శాసనసభలలో అత్యధికసంఖ్యాకులుగానుండు పక్షమువారే ప్రభుత్వమును కొనసాగింపవలసి యుండును. కాన అస్పృశ్యులు తొమ్మిదింటిలో ఏడు రాష్ట్రీయశాసనసభలకు కొంత మంది తమ ప్రతినిధుల నెన్నుకొను టవసర మే యగును. అనేకశతాబ్దములనుండి హిందువులు అస్పృశ్యులను అతి నీచమగు స్థితికి పాలుచేసిరని మీ ఉత్తరములో ఠక్కరు గారికి మీరే వ్రాసియున్నారు గాన వారిప్రతినిధులు శాసనసభలో తమ కష్టనిష్ఠురములను తమ అభిప్రాయములను స్వయముగా తెలుపుట అవసర మే యగును. ఇది న్యాయమని అందరును ఒప్పుకొనవలసియే యుందురు. ప్రస్తుతస్థితిలో యేసంఘమునకైన ప్రత్యేక స్థానముల నేర్పాటుచేసినయెడల వారిని అగ్రవర్ణములవారే ఎన్నుకొనవలసియుండును. కావున ఆపద్ధతి యేర్పాటుచేయుటకు మేము అంగీకరింపలేదు.

మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గము యేర్పాటు చేసినట్లు అస్పృశ్యులకు యేర్పాటుచేసి యుండలేదు. వోటింగు అధికారముగల మహమ్మదీయుడు సమష్టి నియోజకమునందు యెన్నడును ఓటు నియ్యజాలడు. అతడు మహమ్మదీయ నియోజకవర్గమునందు మాత్రమే ఓటు నియ్యగలడు. అస్పృశ్యులస్థితి అట్లుకాదు. వారు సమష్టి నియోజకవర్గములందును తమ ప్రత్యేకనియోజకవర్గమునందు గూడ వోటు చేయగలరు. అభ్యర్థులుగా నిలువగలుగుదురు. అది అస్పృశ్యులకు మాత్రమే యియ్యబడినది.మరి యెవ్వరికిని లేదు. మహమ్మదీయులకు జనసంఖ్యనుబట్టి కొన్నిరాష్ట్రములలో మెజారిటీ యియ్యబడెను. ప్రత్యేకనియోజకవర్గములనుండి ఎన్నుకొనబడుసంఖ్య చాల స్వల్పము. అస్పృశ్యుల జనసంఖ్యను బట్టి యెన్నుకొనబడవలసినవారి నంబరిని ప్రత్యేక నియోజకవర్గమువారే యెన్నుకొనునట్లు యేర్పాటుచేసి యుండలేదు. అస్పృశ్యులలో అత్యధిక సంఖ్యాకుల విశ్వాసమునకు పాత్రులైనవారు ముఖ్యముగా ఎన్నుకొనబడుటకు వారికి ప్రత్యేక నియోజక వర్గమందు యేర్పాటుచేయబడును. ప్రతిరాష్ట్రమునందును వారి జనసంఖ్యనుబట్టి చూచినచో యీ స్థానములు చాల కొద్దిగానేయున్నవి. అస్పృశ్యుల ప్రతినిధులసంఖ్య జనసంఖ్యనుబట్టి న్యాయముగా వారికుండవలసిన సంఖ్య కన్న హెచ్చుగాలేదు.

మీ రిపుడు అతితీవ్రమగు నిరశనవ్రతమును బూని ఆకిరిగా ప్రాణపరిత్యాగమును చేయదలచుచున్నారు. అస్పృశ్యులు తమకు విశ్వాసపాత్రు లగు కొద్దిమందిని శాసనసభలకు ప్రత్యేకముగ ఎన్నుకొనకుండ చేయుటయే యీ దీక్ష ఫలిత మని తెలుచున్నది. సమష్టి నియోజక వర్గములలో వారి కిదివరకే వోటింగు హక్కు యియ్యబడినది. హిందూసంఘముయొక్క యేకీభావమునకు భంగము కలుగకుండునట్లుగూడ యేర్పాటు చేయబడినది. హిందూసంఘమున వారు చాల నీచస్థితి యందుండుటచే విశ్వసనీయులగు వారి ప్రతినిధులు శాసన

సభలలో పనిచేయుట అత్యవసరమై యున్నది. దొరతనమువారు బాగుగా నాలోచించియే యీ పరిష్కారమునకు సమ్మతించిరి. మీ రిట్లు నిశ్చయించుటవలన మీరు దొరతనమువారి పరిష్కారమును సరిగా గ్రహింపలేదని నేనూహింపవలసివచ్చుచున్నది.

సాంఘికసమస్య పరిష్కరించుట దొరతనమువారి కిష్టములేదు గాని భారతీయులు దీనిని పరిష్కరింపజాలకపోవుటచే భారతదేశమునుండి చాల విజ్ఞప్తులు పంపబడినందున వారీ పరిష్కారమును చేసియుండిరి. దొరతనమువారు స్పష్టపఱచిన పరిస్థితులలో తప్ప ప్రస్తుతము వారు వీటిని మార్పజాలరు. ఆయా సంఘములవారు సమాధానపడి అంగీకరించిననేగాని యీపరిష్కారములో దొరతనమువారు ఎట్టి మార్పును చేయజాలరు. అన్నిపక్షములవారి వాదనను దొరతనమువారు విని నిష్పక్షపాతబుద్ధితో యీ పరిష్కారమును చేసిరి.

ఈ ఉత్తరమును, మీరు హోరు గారి కేర వ్రాసిన ఉత్తరమును ప్రకటింపవలెనని మీరు కోరియున్నారు. మీరు నిర్బంధమున మున్నారను కారణమున మీ అభిప్రాయములను వెల్లడించకపోవుట న్యాయము కాదని తలచి నేనందులకు వెంటనే సమ్మతించితిని. వినను మరొకసారి దొరతనమువారి ప్రకటనను మీరు సాకల్యముగా పరిశీలింపగోరెదను. అప్పుడు మీరిట్టి దీక్షను బూనుట న్యాయమగునా కాదా అను విషయమును గూర్చి ఆత్మపరీక్షను చేసికొనగోరెదను"

## 3

## గాంధిమహాత్ముడు మెగ్డానల్డుగారికి వ్రాసిన రెండవ లేఖ

సెప్టెంబరునెల 9-వ తేదీని మహాత్ముడీ క్రిందివిధముగా వ్రాసెను :—

"మీరు నిష్కపటముగా వ్రాసినారు. దీర్ఘమగు తంతివార్త నేడు చేరినది. మీకు వందనములు. నేను అవలంబింపదలచిన నిరశనవ్రతమునుగూర్చి మీరు చేసిన ఆరోపణ యిదివర కెన్నడును నా మనస్సునకు తట్టియుండలేదు. నేనే అస్పృశ్యులకు ప్రతినిధినని చెప్పుకొనుచుండగా వారికి నష్టము కలిగించుటకు నేను నిరశనవ్రతము బూనితినని మీరు వ్యాఖ్యానము చేసితిరి. నేను మృతి నొందువరకును నిరశనవ్రతమును చేయదలచితినని తెలుపుటవలననే నాకట్టి స్వార్థపరత్వమును ఆరోపించుటకు వీలుండదని నే నూహించితిని. కావున దీనినిగూర్చి అధికముగా వ్రాయదలచుకొనలేదు. ఇది నాకు మతవిషయికమగు సమస్య. అస్పృశ్యులలో వోటింగు అధికారము గలవారికి రెండేసివోట్లు ఉండినమాత్రమున అది హిందూసంఘమునందు కలుగగల నష్టమును తొలగింపజాలదు. అస్పృశ్యులకుగూడ నష్టమును తొలగింపజాలదు. అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గమును యేర్పాటుచేయుట హిందూసంఘమునందు కాలకూట విషమును ప్రయోగించుటయే. ఆ విషము హిందూసంఘమును దగ్ధముచేయునేగాని అస్పృశ్యుల కెట్టి లాభమును కలుగజేయదు. ఈసమస్య హిందువులకును అస్పృశ్యులకును మతసంబంధమైన ముఖ్యమగు సమస్య యగుటచే మీ కెంత సానుభూతి యుండినను గూడ మీరు దీనిని పరిష్కరింపజాలరు. 'నిమ్నజాతులకు' ఉత్కృష్టస్థానము ఈయబడినను నా కభ్యంతరముండదు. వారు హిందూసంఘమునందు అనగా సమష్టి నియోజకవర్గమునందు ఉండగోరువరకును వారిని విడదీయుటకు అనగా వారికి ప్రత్యేకనియోజకవర్గములను యేర్పాటుచేయుటకుమాత్రమే నేను ప్రతికూలుడను.

హిందూ సంఘమునందలి సంస్కర్తలు అన్నిశాఖలలోను అస్పృశ్యులను వృద్ధినొందించుటకు పెక్కు సంవత్సరములనుండి చేయుచున్న కృషియంతయును ఈ పరిష్కారమువలన రూపుమాసిపోగలదని మీరు గ్రహించితిరా? నూతనరాజ్యాంగవిధానమునందు మీ పరిష్కారమే కొనసాగునెడల కలుగగల ఫలిత మిదియే. అస్పృశ్యుల నుద్ధరించుటకు తమ జీవితములను అర్పించియున్న సంస్కర్తల కృషియంతయు వ్యర్థమగును.

కావున నేనిదివరకు మీకు తెలిపిన నిరశనవ్రతమునే పూనుటకు నిశ్చయించితిని.



అంగ సుఘీన బజావత బీన మయూర నచే జిహి ఆగే సదా హీ
పియకీ సురతి ధ్యావతి చిత్తమే సంగ సఖీ ఏక బేఠీ సుహాఈ
పాఛే ఖరీ ఏక చౌర దురావత ఆప సింహాసన ఉపర భాఈ

# ఖాదీపరిశ్రమ : పరిశోధనావశ్యకత

మిస్. మెల్లీ సోలింగర్ (స్విట్జర్ లాండు) వుప్పల లక్ష్మణరావుగారు (బరంపురం)

✗

వెనుకటి నాల్గువ్యాసములందును ప్రత్తి పరిశోధన గూర్చియు, ఖాదీపరిశ్రమయందు వాడుకచేయబడుచున్న పరికరములయందును, రాట్నమునందును చేయవలసిన మార్పులను గురించియు, నూలుపరీక్ష, నూలుపరిశోధనగురించియు చర్చింపబడియుండెను. ఉత్పత్తిని అభివృద్ధి చేయుటకు ఎట్టివిధానముల నవలంబింపవలసినదియు, నూలుయొక్క గుణములును, వాటి నేవిధముగా పరీక్షింపవలసినదియు, ప్రస్తుతము ఉత్పత్తికేంద్రములందు నూలు ఎన్నిక ఏవిధముగా జరుగుచున్నదియు, అట్టి ఎన్నిక ఎట్టిపద్ధతులపై నాధారపడియుండవలసినదియు సరియైన పద్ధతులను, ప్రమాణములను స్థిరపరచుటకు ఏయే పరిశోధనలు చేయవలసినదియు, ప్రత్తి సమస్య యొక్క ప్రాముఖ్యము, ముఖ్యముగా పట్టుశాలి, వెలమ నూలు ఉత్పత్తియందలి ప్రత్యేకపుసమస్యలు—ఇత్యాదులు క్లుప్తముగా వివరింపబడినవి.

ఖాదీపరిశ్రమాభివృద్ధికై మనము చేయవలసిన పరిశోధనలు ఇంతటితో పూర్తియగుటలేదు. పైన పేర్కొనబడిన విభాగములకు చెందని ప్రశ్నలును, సమస్యలును ఇంకెన్నియో కలవు. ప్రత్తిగింజలను సేకరించి, వాటిని నాటి, పంటను ప్రోగుచేసి సరియైనదర వచ్చిన తరువాత అమ్ముట; ప్రత్తిని కొని, శుభ్రపరచి, గింజతీసి, ఏకి, ఏకులు తయారుచేసి, వాటినుండి నూలువడికి, కూలిని సంపాదించుట; ఆనూలును సరిగా ముడుకు సన్నములప్రకారము ఎంచి నేతగానికిచ్చి, నేయించి, బట్ట నుత్పత్తిచేయించుట — ఉత్పత్తియందలి అన్ని ప్రకరణములయందును ఎన్నెన్నియో విషమపరిస్థితులను, కష్టతమములగు సమస్యలను దినదినమును మన మెదుర్కొనవలసియేయుండును. ఏరునుదాటి ఒడ్డెక్కుటకు తాత్కాలికముగా ఎట్టిఉపాయములను పన్నినను, శాశ్వతమైనమార్గమును కనుగొనిననేగాని మన కష్టము లంతరింపవు. అభివృద్ధికి అడ్డుత్రోవలు లేవు. పరిశ్రమలు బాగుపడి ముందరకు రావలెనన్న పరిశోధన యొక్కటియే సూటియైన త్రోవ.

## పలువిధములగు సమస్యలు

నేడు ఖాదీఉత్పత్తియం దవలంబింపబడుచున్న విధానములన్నింటిని—సనాతనమునుండి ఆచరింపబడుచుండుటచే పవిత్రములని పాటింపక—విమర్శనదృష్టితో వాటివిలువనుపరిశీలించి సరియైనవాటి నేఅవలంబించియు, సంస్కరింపవలసినవానిని సంస్కరించియు, విలువలేని వానిని విసర్జించునటులను చేయవలసియున్నది. ఇట్టికార్య విధానము, ఖాదీఉత్పత్తి నెరింగినటువంటియు, భౌతిక శాస్త్రము నభ్యసించినటువంటియు పరిశోధకులచే కొనసాగింపబడవలసియున్నది. మాచేపరిశీలింపబడిన కొన్ని సమస్యలను, ఆయాఉత్పత్తివిధానములను విమర్శించుటకు మాచే అవలంబింపబడిన పరిశోధన ప్రయోగములు ఈవ్యాసమందు సంగ్రహముగా పేర్కొనబడును.

## నూలును నీటిలో తడుపుట

శ్రీయుత మగన్ లాల్ గారు తమపుస్తకమందు, నూలును ఆసుపైనుండి తీసినతరువాత చక్కగా నీటితో తడుపవలయుననియు, అట్లు తడిపినయెడల, నూలు గట్టిపడుననియు వ్రాసియున్నారు. ఈ సిద్ధాంతము ననుసరించియే అఖిలభారతచరఖాసంఘమువారు తమ చందాదారులందరకును, నూలునుపంపించుటకు పూర్వము తడుపవలసినదని సలహా నిచ్చుచున్నారు. అయితే, ఇట్లు నీటిలో తడిపినయెడల నూలు తప్పక గట్టిపడుననిగాని, ఎన్నిగంటలు, ఎన్నిదినములు ఇట్లు తడుపవలసినదిగాని, బలమునం దెంతవరకు అభివృద్ధికలుగునో ఆ

లెక్కగాని దేనిని స్పష్టపరచియుండలేదు. ఇందువలన, కొందరు చందాదారులు నూలు తడుపవలయునన్న నియామకము పట్టి ఛాందసముక్రింద కట్టివేసి పాటింప కుండుటయు, కొందరు నామకార్థము తడిపియు, కొందరు తమకు తోచినంత కాలము నీటనుంచియు, తరువాత నీటి నుండి తీసివేసి ఆరబెట్టుటయు, ఇట్లు పలువురు పలువిధ ముల నాచరించుచున్నారు. ఎవరికి తోచినట్లు వారు కాక అందరును యేదైన నొకపద్ధతికి వచ్చునట్లు చేయ వలెనన్న, విషయమునంతయు సమగ్రముగ పరిశీలించ వలసియున్నది.

## నూలును తడుపుట : బలము హెచ్చగుట

ఈ విషయమై మాచే చేయబడిన ప్రయోగము లను రెండుభాగముల క్రింద విభజింపవచ్చును. నూలు నమూనాలను సంపాదించిన తరువాత, నూలుయొక్క నంబరు బలము, బలముయొక్క పాళ్ళ, కౌంటుయొక్క పాళ్ళ, ఉత్పత్తికేంద్రము, వాడుక చేయబడిన ప్రత్తిరకము మొద లగు వివరములన్నియు నిర్ణయింపబడెను. తరువాత నూలును, అనేక భాగములుగా విడదీసి, ఒక భాగమును ౧ గంటకాలము నీటియందును, వేరొక భాగమును నీటి యందు ౩ గంటలకాలమును, మరియొక భాగమును నీటి యందు ౬ గంటలకాలమును ఈవిధముగా ఒక్కొక్క భాగమును ౧, ౩, ౬, ౯, ౧౨, ౧౮, ౨౪, ౩౬, ౪౮, ౬౦ గంటలకాలమువరకును నీటియం దుంచితిమి. నియమిత కాలము నీటియందున్న తరువాత, నూలును నీటినుండి తీసి వేసి నీడయందు దారవేసితిమి. పూర్తిగా ఆరినతరువాత, ఈ నూలునం దేదైన మార్పులు సంభవించెనేమో తెలిసి కొనుటకు, తిరిగి నూలునమూనాయొక్క కౌంటు, కౌంటుపాళ్ళ బలము, బలముపాళ్ళ మొదలగు గుణములు ప్రయోగములవలన నిర్ణయింపబడెను. ఇది పరిశోధన యొక్క మొదటిభాగము.

ఈభాగమునందు, పట్టుసాలీనూలులో అన్ని సన్నములును (౧౦ రకములు), పలమనూలులో అన్ని సన్నములును (౮ రకములును), ముదుకునూలులో ముఖ్య ము సన్నములును (౭ రకములును), మొత్తము ౨౫ నమూనాలనూలు పరిశోధింపబడెను. ఇందుకుగాను సుమారు ౮,౦౦౦ నూలుపరీక్షాప్రయోగములు ఏడాది న్నర కాలములో చేయబడెను. ఈపరిశోధనల ఫలితము లను క్లుప్తముగా నీక్రింద పొందుపరచుచున్నాము:—

౧. నీటియం దుంచుటవలన నూలుయొక్క బలము హెచ్చగుచున్నది.

౨. నీటియం దుంచబడినకాలము హెచ్చగు చున్నకొలది బలముకూడా హెచ్చగుచున్నది.

౩. ఈ అభివృద్ధి స్థిరముగా నుండక, హెచ్చు తగ్గులుకలదిగా నున్నప్పటికిని, మొత్తముపైన, నీటియం దుంచకపూర్వ ముండుబలముకంటె హెచ్చుగనే యున్నది.

౪. కాలమును, బలమును అన్వయించుట కొక రేఖను గీసినయెడల, ఆరేఖ సమరేఖగా నుండక రంపపు పండ్ల ఆకారము (Zig - Zag) గలిగియుండును. (రేఖా పటమునందు, అన్నిటికంటె పైనున్న రేఖ పట్టుశాలి సెం. ౨౧ చూచునది.

౫. నూలును నీటియం దుంచుట వలన లాభమే కాని ఎట్టినష్టమును లేదు.

## నూలుబలము - నీటియం దుంచుకాలము

మా పరిశోధనలయొక్క మొదటిభాగమువలన, నూలును నీటితో తడుపుటవలన లాభమున్న దనువిష యము నిర్ధారణమైనతరువాత, ఈ సందర్భమున నేత గాండ్రచే అవలంబింపబడుచున్న విధానము ననుసరించి, పరిశోధనప్రయోగములను మార్చుట కవసర మేర్పడెను. ఇది పరిశోధనయొక్క రెండవభాగము.

నూలును పనిచేయుటకుపూర్వము, నేతగాండ్రు నూలును, చెరువులోగాని, గోలెములో నీరుంచి ఆనీటిలో గాని, ఆయాగ్రామపుసంప్రదాయముల ప్రకారము నాన బెట్టు నాచారముగలదు. మాకు తెలిసినంతవరకు పట్టు శాలి పలమనూలు నేతగాండ్రు నూలును ఒకరాత్రి యంతయు (అనగా ౧౨ గంటలకాలము) నానబెట్టె దరు. గంజాంజిల్లాలో సన్ననూలు నేత జరుగుచున్న

బరంపురం, కుక్కుడాఖండీ మున్నగు గ్రామములందు, ఒకదినమంతయు నీటియం దుంచుట వాడుకయని ఆ ప్రాంతముల నేతగాడొకడు మాతో చెప్పెను. ఆంధ్ర దేశమందలి గుంటూరు ప్రాంతములందు, నూలును ౨ దినములవరకు నానబెట్టెదరని శ్రీయుత వేమూరి నారాయణమూర్తిగారు మాతో చెప్పియుండిరి.

ఇట్లు ఈ ఆచారము ఒక్కొక్కచోట ఒక్కొక్కవిధముగా నుండుటచే, దీనినిగురించి పూర్తిగా తెలుసుకొనుట కవసర మేర్పడెను. రెండుదినములకాలము నీటియం దుంచుటవలన లాభమేకాని నష్టములేదని వెనుకటిప్రయోగములవలన తేలెను. రెండుదినములకంటె ఎక్కుడుదీర్ఘకాలము నీనూలును నానబెట్టినయెడల లాభముగా నుండునో, లేక నష్టముగా నుండునో నిర్ణయించుటకుగాను, నూలునమూనాలను ౧ మొదలు ౫ దినములవరకును నీటియం దుంచి, అందువలన నూలుయొక్క గుణములయందు కలుగు మార్పులను పరిశీలించితిమి. శ్రీనారాయణమూర్తిగారిసలహాప్రకారము ఈ పరిశోధనలు, సాధారణముగా సన్నని నూలు నేత కుపయోగింపబడు 'కాంట్లపైననే' జరుపబడెను. (పట్టుశాలి. నెం. ౪౩, ౨౯; వెలమ నెం. ౨౯, ౮౦). తైపారవేసి చూచుటకుగాను, ఉదాహరణముకొరకు ముదుకు నూలు నమూనాయొకటికూడ తీసుకొనబడెను. (కైలాసపట్నం, నెం. ౧౨).

పరిశోధనయొక్క రెండవభాగమునందు లభించినఫలితముల నీక్రింద పట్టిక ౧ పొందుపరచుచున్నాము:

పట్టిక ౧

| వరుస నెంబరు | నూలు | అసలు బలము % | నీటియందు ౧ దినము | నీటియందు ౨ దినములు | నీటియందు ౩ దినములు | నీటియందు ౪ దినములు | నీటియందు ౫ దినములు |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | పట్టుశాలి నెం. ౪౩ | ౪౦ | ౫౨ | ౫౯ | ౬౦ | ౬౯ | ౬౭ |
| ౨ | ,, ,, ౨౯ | ౬౩ | ౬౫ | ౬౫ | ౮౬ | ౮౪ | ౬౮ |
| ౩ | వెలమ ,, ౮౦ | ౦ | ౨౨ | ౨౧ | ౧౯ | ౩౪ | ౩౦ |
| ౪ | ,, ,, ౨౯ | ౪౬ | ౬౧ | ౬౩ | ౫౬ | ౬౮ | ౬౨ |
| ౫ | కైలాసపట్నం ,, ౧౨ | ౨౮ | ౩౪ | ౪౫ | ౩౮ | ౪౨ | ౪౨ |

మొదటిభాగమువలన స్థిరపరచబడిన ఫలితములన్నియు పైపట్టికయందు వివరింపబడినఫలితములకు కూడా వర్తించునని ఇందువల్ల తెలియుచున్నది. అయితే, నాల్గుదినములతరువాత బలమునకును, ౫ వ దినముతరువాత బలమునకున్ను కొంతతగ్గుదల యున్నట్టు సూచనలు పైఫలితములవలన విశదమగుచున్నవి. మొదటినమూనాయందు ౬౯% నుండి ౬౭% వరకు తగ్గుదలయు, ౨ వ నమూనాయందు ౮౪% నుండి ౬౮ వరకు అనగా సుమారు ౧/౧౩ వ వంతు తగ్గుదలయు, ౩ వ నమూనాయందు నాలుగవరోజుతరువాత ౩౪% నుండి ఐదవ దినము తరువాత ౩౦% వరకు—అనగా ౧/౯ వ వంతు తగ్గుదలయు, ౪ వ నమూనాయందు నాల్గవదినము ఆఖరున ౬౮% నుండి ఐదవదినముఆఖరుకు ౬౨% వరకు— అనగా ౧/౧౧ తగ్గుదలయు, ౫ వ నమూనాయందు నాల్గవ దినము ఆఖరున ౪౨% న్ను, ఐదవదినము ఆఖరునకూడా మార్పులేక ౪౨%—మార్పులు కనబడుచున్నవి. మాపరిశోధనలవలన, ౪ దినములుకంటె నీటియందు హెచ్చు కాలముంచిన బలమునందు కొంత నష్టమున్నట్టు కనబడుచున్నను నీటియందుండుకాలము ౧౦ దినములవరకు పరిశోధనను పొడిగించిచూచిననే కాని సరిగా చెప్పుటకు వీలులేదు.

నేతగాండ్రములవాటును పైఫలితముల ననుసరించి నీటిలో నుంచుకాలమును 3, ౪ దినములవరకును పొడిగించినయెడల నూలు బాగుపడి వారు లాభమును పొందగల్గుదురు. పైప్రయోగముల కనుగుణముగా, శ్రీ నారాయణమూర్తిగారి సలహాప్రకారము, ౧–౫ దినములవరకు నీటియందుంచిననూలుతో బట్టలను నేయించి (test pieces) ఆబట్టలయొక్క గట్టితనమును, సాపును, మన్నికయు కనిపెట్టినయెడల మాప్రయోగములవలన ఫలితములను వాడుకలోనికి తీసికొనివచ్చుట కవకాశ ముండును.

ప్రాముఖ్యమును గురించియు, కొండపత్తియొక్క నాణ్యము క్షీణించినయెడల, పట్టుకాలి పరిశ్రమకు గొప్ప యాపద సంభవించుననియు, ఇట్టి యాపద త్వరలోనే వచ్చునేమో యన్నభయము కలదనియు, అట్టి విపత్తు సంభవించుటకు పూర్వమే, ఖాదీ అభిమానులు మేల్కాంచి తగిన కట్టుదిట్టములు చేయవలసియుండుననియు సూచింపబడియుండెను.

పట్టుకాలిపత్తియొక్క ఉత్పత్తి తక్కువ యగుటచే ఈసుమిడివస్తువునందు ఎప్పుడు క్షామము సంభవించునోయని ఉత్పత్తిదారులు భయపడుచునే యుందురు.



నూలు నీటిలో ఎన్ని దినములు నానినది

ఫలితములలో కొన్నింటిని పైరేఖాపటమునందు చిత్రించియున్నాము.

కొండపత్తికి బదులు ?

ఈవ్యాసముల వరుసలో, మొదటి వ్యాసమందు పత్తిపరిశోధనగురించియు, అందు కొండపత్తియొక్క

ఇంతటిత్వరలో క్షామము సంభవింపకపోయినను, పట్టుకాలి ఉత్పత్తియందు, కొండపత్తిబదులు మరి యేపత్తినైనను వాడుటకు వీలగునేమో కనుగొనుట యుచితము. ఈ సమస్యనుగురించి మేము సవిస్తరముగా పరిశోధనలను జరుపకపోయినప్పటికిని, ఏవిధానముల ననుసరించి ఇక

ముందు పరిశోధన జరుగవలసియుండునదియు నీక్రింద సూచించుచున్నాము.

పత్తిని చేపదాడతో బాగుచేయుట

మనదేశపు పత్తిజాతు లన్నింటి రేసులలోను కొండ పత్తియొక్క రేసులే మిక్కిలిపొడవు గలవి. తక్కిన పత్తి జాతులు, పొడుగురేసులను కలిగియుండకపోవుటచేతనే అవి పట్టుశాలి, వెలమ పరిశ్రమకు పనికివచ్చుటలేదు. ఏ ఉపాయముచేతనైనను యీ పొట్టిరేసులపత్తిని పొడుగురేసులగలపత్తిగ మార్చగల్గితిమేని, కొంతవరకైనను వీనిని సన్ననూలు పరిశ్రమయం దుపయోగింపవచ్చును. ఇది యేలాగునచేయుట యనున దొక ముఖ్యమగుసమస్య. మన మేదైన ఒకపత్తిబోగను పరీక్షించినయెడల అం దుండు రేసులన్నియు ఒకేపొడవును గలిగియుండక కొన్ని పొడుగురేసులు, కొన్ని పొట్టిరేసులు, కొన్ని నడు తరపు రేసులు-మిశ్రమములై యున్నట్లు మనకు తెలియ గలదు. ఈరేసుల నన్నింటిని పొడుగుప్రకారము లెక్కిం చితిమేని, అతిపొట్టిరేసులు అతి పొడుగురేసులు అన్నిటి కంటె తక్కువసంఖ్యయు, సామాన్యపు పొడుగురేసుల సంఖ్య హెచ్చుగను ఉండును. ఏదైన పత్తినమూనా యొక్క రేసులకొలత యింతయని చెప్పినప్పుడు, ఆవిలువ పత్తిబోగయం దుండు అన్ని రేసులయొక్క కొల్తలను లెక్కించగా సగటునవచ్చిన విలువయని మనము గ్రహిం పవలసియున్నది. ఏనమూనాయందైనను, పొట్టిరేసులు తప్పకయుండునుగాన, ఈపొట్టిరేసులను తీసివేయగల్గితి మేని, సగటునవచ్చు రేసులకొల్త మొదటికంటె హెచ్చు అగును.

బట్టలమిల్లులలోకూడా కొద్దిసంవత్సరములక్రిందట ఇదియే ప్రధానసమస్యగా నుండెను. సన్ననూలు అనగా ౬౦-౧౨౦ నెంబర్లు—వడుకుటకు మంచిరకపు గరిష్ఠపు పొడుగు రేసులుగల ఇజిప్టు నుపత్తిని వాడుచున్నారు. ఇంతకంటె సన్నవంబర్లను—౨౮౦ నెం. మొదలగునవి వడుకుటకు తగినపొడవు రేసులు గల పత్తి దొరకదుగాన మిల్లువారు అనేక పరిశోధనలను చేసి ఒక యంత్రమును కనిపెట్టిరి. యీయంత్రము పత్తిని "దువ్వి" పొట్టిరేసు లను తీసివేయును. ఇందుచే పొడుగు రేసులుమాత్రమే మిగిలి పత్తియొక్క రేసులకొలత హెచ్చగును. యీ యంత్రమునకు 'Comber' అని పేరు.

పట్టుశాలి, వెలమవారుకూడా పత్తిని చేపదవ డతో దువ్వి బాగుచేయునప్పుడు ఈ ఉపాయమునే వా డుకచేయుచున్నారు. ఇందువలన పత్తియొక్క రేసుల కొలత ఎట్లు అధికమగుచున్నదో యీక్రిందిప్రయోగపు ఫలితములు తెలుపుదు చేయుచున్నవి:—

పట్టిక : ౨

| నూలు రకము | బాగుచేయు టకు ముందు (అంగుళము) | బాగుచేసిన తర్వాత (అంగుళము) |
|---|---|---|
| ౧. పెద్దఖిమిడి, కొండపత్తి | ౦.౪౪ | ౦.౫౫ |
| ౨. పారువాకోట ,, | ౦.౫౬ | ౦.౫౪ |
| ౩. దేవకప్పాస్ (౧౫౩౨) | ౦.౫౧ | ౦.౫౭ |
| ౪. రోజియా, వార్ధా | ౦.౫౩ | ౧ |

పట్టుశాలిపరిశ్రమయందు కొండపత్తికి బదులు వీపత్తిని వాడుకచేయుటకు వీలున్నదియు తెలిసికొను టకు, మనమును ఈపద్ధతినే అవలంబింపవలెను. పై పట్టికయం దుదాహరింపబడిన "రోజియా" అనుపత్తి వార్ధా (మధ్యపరగణాలు) ప్రాంతములయందు మిల్లుల యందును, ఖాదీయందును విరివిగా వాడబడుచున్నది. ఈపత్తి సాధారణముగా ౪,౭ అంగుళముల గరిష్ఠపు కొలత గలిగియుండును. ఈపత్తిని సన్ననూలుకొరకు వాడుటకు వీలులేదు. అయితే దీనినే చేపదవడతో బాగుచేసితిమేని పొట్టిరేసులు పోవుటచే, రేసులకొల్త ఒక అంగుళమువరకు పెరిగినది. ఇప్పుడు—బాగుచేసిన తరువాత ఈపత్తితో ౮౦-౬౦ నెం. వరకు సన్న నూలును వడుకుటకు వీలుండును. ఈవిధముగా పొట్టి రేసులు గలవైనను మంచిరకపు పత్తిజాతులను తెచ్చి,

చేపదవడతో బాగుచేసినయెడల వాటికేనులకొత్త పొడుగై, సన్ననూలు పరిశ్రమకు ఉపయోగపడగలవు. అప్పుడు కొండపత్తిని ౪౦-౫౦ నెం. సన్నమువరకు ఉపయోగించి, నెం. ౪౦ కు దిగువ సన్నముకు ఈ తక్కువరకముపత్తిని కొండపత్తికి ప్రత్యామ్నాయములు (Substitutes) వాడుకొనుటకు వీలుండును.

నూలుపరీక్ష-నూలుధర

పైని వివరించినప్రకారము సన్ననూలుపరిశ్రమయందు కొండపత్తికి బదులు ఏరకపుపత్తిని వాడుకచేయుటకు వీలున్నదియు తెలుసుకొనినతరువాత, ఈ క్రొత్తపత్తిని ఉపయోగించి నూలును వడికించవలెను. ఈనూలునమూనాల నన్నింటిని, పరీక్షచేసి, పట్టుశాలి నూలుయొక్క గుణములతో నెట్లు సరిపోలునో చూడవలెను. పట్టుశాలినూలుకు సామాన్యముగా నుండు బలము సాపు ఈనూలున కుండినయెడల నేతకు వాడుకచేయవచ్చును. అయితే, యీక్రొత్తరకపుపత్తిని ముడివస్తువుగా వాడి నూలును వడుకునప్పుడు, నూలు అమ్మిన యెడల వచ్చినకూలి కిట్టుబడిగా నుండునో లేదో చూడవలెను. ఏల అనగా తక్కువరకపుపత్తిని చౌకగా కొన్నప్పటికి, చేపదవడచే బాగుచేయునప్పుడు రద్దు విస్తారము గావచ్చును. మరియు వడుకుటకుముందు చేయు కార్యములకై (Preparatory Processes) బహుశః ఎక్కువకాలము వినియోగింపవలసివచ్చును. ఈకారణములచే, నూలు అమ్మినందువలన వచ్చినకూలి కిట్టునో లేదో చూచుకొనవలసియుండును. ఇవియన్నియు సరిపడినప్పుడే, ఆపత్తిని కొండపత్తికి బదులుగ వాడుటకు వీలుండును. పైపరిశోధనయందు మా కనూల్య మగుసహాయ మొనర్చిన శ్రీయుత మల్లెమడుగుల కోదండరామస్వామి (అ. భా. చ. సంఘము సన్ననూలుకేంద్రము, శ్రీకాకుళం మేనేజరు) గారికి మే మెంతయు కృతజ్ఞులము.

వడిదారము - మన్నిక

రాట్నము నుపయోగించినవా రందరును వడిదారము తరుచు తెగిపోవుచుండుటచే కలుగు చికాకును, విసుగును అనుభవించియేయుందురు. వృత్తిగ జీవనోపాధికై వడుకువా రేమి, సరదాకొరకు వడుకుచుండు ఖాదీఅభిమాను లేమి - అందరకును వడిదారమును పేను కొనుట యనిన చీదరయే. కష్టపడి వడికినదారము నిందుకొరకై వినియోగింపవలసివచ్చుటయేకాక, వడుక గలుగు సమయమును ఈపనికై ఖర్చుపెట్టవలసివచ్చుటయు తాము చేయుచున్న పనికి అంతరాయము కలుగుటయు, వడిదారమును పేనినంత మాత్రముననే తీరక, రాటమును కదురును సర్దుకొని, వడిదారము ముడివేసుకొని మళ్ళీ నాల్గుసార్లు చక్రమును త్రిప్పి, వడిదారము క్రొత్తదగుటచే సాగిపోవును గాన దానిని తిరిగి బిగించుటయు విస్తారము కాలయాపనమునకు కారణ మగుచున్నది.

సాధారణముగా పట్టుశాలీ వడుకువారు వారి వడుకునుబట్టి, ఎండకాలములో ౪ దినముల కొకసారి యున్ను చలికాలములో ౨ దినముల కొకసారియున్ను వడిదారమును మార్చవలసి వచ్చుచుండును. నూలు ధరలు బాగుగ నుండునపుడు రాత్రిపూటకూడ వడుకుటచేత ఆదినములందు మామూలుకంటె త్వరగానే వడిదారము తెగిపోవుచుండును. సగటున 3 దినముల కొకసారి వడిదారమును మార్చుచుందు రని మన మూహించవచ్చును. పట్టుశాలీ స్త్రీలు సామాన్యముగా దినమునకు ఒక తులమునూలు వడికెదరు. నెం. ౪౦ నూలును ఉదాహరణముగా తీసుకొనిన పట్టుశాలీవా రుపయోగించు వడిదారము తెగిపోకుండా, సుమారు ౨౪౦౦ గజముల నూలును వడుకు వరకు మన్నును. ముదుకు నూలు వడుకు కుపయోగించు వడిదారము కొంచెము హెచ్చు మోటుగా నుండును గాన సుమారు ౪౦౦౦ గజములు తీయువరకు మన్నును. వడిదారపు చీకాకులను తగ్గించవలె ననిన, వడిదారముయొక్క మన్నికను హెచ్చించుటకు మార్గమును కనిపెట్టుటయే. ఇది చాలా ముఖ్యమైనవిషయము గావున దీనినిగూర్చి కొంతవరకు చెప్పవలసియున్నది.

వడిదారము - పురి

నూలు పరిశోధనలనుగురించి వ్రాసినవ్యాసమందు, నూలుయొక్క బలమునకును, నూలును వడుకునప్పుడు మన మిచ్చు పురికిని గలసంబంధమునుగూర్చి విపులముగా చెప్పబడియుండెను. ఏకౌంటు నూలునకుగాని గరిష్ఠపుబల ముండవలెనన్న ఒకఅంగుళములో ఆకౌంటుయొక్క వర్గమూలమును K అనునొక ప్రమాణము (Constant) చే గుణించుచోట వచ్చు తిరుగుడులసంఖ్య యుండవలె నని చెప్పబడెను. వడిదారములోకూడా, ఈవిధముగానే అంగుళమున కుండవలసిన తిరుగుడులసంఖ్యను నిర్ణయించుట కొక సమీకరణము గలదు. ఈసమీకరణమువలన సూచింపబడిన తిరుగుడులసంఖ్యకంటె హెచ్చుపురి ఇచ్చినను తక్కువపురి యిచ్చినను, దారముయొక్క బలము గరిష్ఠబలముకంటె తక్కువగనే యుండును.

వడిదారమును తయారుచేయునపుడు దానికి పురి ఇచ్చి కొన్నిపోగులు పోసి, దారముగా పేనెదరు. ఈ పేనినదారముయొక్క రెండుకొనలను కలిపి, దారమును జంటగా చేసి తిరిగి పురియిచ్చి, ఒక్కటేదారముగా చేసెదరు. (ఆంధ్రదేశమందు స్త్రీలు తమనగలను హారములను ధరించుట కీవిధముగానే దారములను పేనెదరు.) ఇట్లు రెండుపర్యాయములు పురి యిచ్చునపుడు ఒక్కొక్కసారి అంగుళమున కెంతపురి ఇవ్వవలసినదియు మనము కనిపెట్టవలసియున్నది.

మాచే చేయబడిన పరిశోధనలయందు మొదటిసారి పురి యిచ్చునపుడు, K = ౪.౫ అను విలువ ప్రకారము, తిరుగుడులసంఖ్య నిర్ణయించబడెను.*

దారమును జంటగా జేసి, పేనునపుడు (doubling) ఎంతపురి నివ్వవలెనో (doubling twist) ప్రయోగములవలననే తెలుసుకొనవలెను. వడిదారముయొక్క మన్నిక చాలావరకు వడిదారముయొక్క బలముపైననే ఆధారపడియుండును. కాన, ఒక్కొక్క దారమునకు ఒక్కొక్కవిధముగా పురి నిచ్చి, అనేకములగు నమూనాలను తయారుచేసి, వాటిబలమును—అనగా ఒక్కొక్కదారము ఎంతెంతబరువును మోసినయెడల తెగిపోవునో—కనిపెట్టినయెడల, గరిష్ఠబల ముండుటకు ఎంతపురియుండవలెనో తెలుసుకొనగల్గుదుము. ఇందుకొరకు యీక్రింద వివరింపబడినటులు, వివిధములగు తిరుగుడుసంఖ్యల గలిగి, ఒకేకౌంటును గల వడిదారములయొక్క (ఒక్కొక్క నమూనాలయొక్కపొడవు ౧౦ అంగుళములు) "త్రెంపుటకు బలము" (breaking strain) కనిపెట్టబడెను.

పట్టిక : 3

వడిదారపు సన్నము=౦.౯ మిల్లీమీటర్లు.
ఉపయోగింపబడిన నూలురకము నెం. ౪౦=వెలమ.
మొత్తము పోగులు=౩౨.
ఎన్ని పేటలు=౨.

| అంగుళమునకు తిరుగుడులు | త్రెంచుటకు బరువు (తులములు) | అంగుళమునకు తిరుగుడులు | త్రెంచుటకు బరువు (తులములు) |
|---|---|---|---|
| ౧ | ౨౭౫ | ౭ | ౩౫౭ |
| ౨ | ౩౧౦ | ౮ | ౩౫౫ |
| ౩ | ౩౩౬ | ౯ | ౩౪౭ |
| ౪ | ౩౫౦ | ౧౦ | ౩౫౦ |
| ౫ | ౩౫౫ | ౧౧ | ౩౩౦ |
| ౬ | ౩౬౫ | ౧౨ | ౩౧౫ |

* ఇది నిర్ణయించుటకుగాను మిల్లులెక్కలలో వాడబడు ఈక్రింద సమీకరణము నుపయోగించియున్నాము.

$$\text{Forces in a balanced thread} = -2\left[\left(t_1 - t_2\right)\left(\frac{1}{\sqrt{c_1}}\right)^3\right] = \left(\frac{1}{\sqrt{c_2}}\right)^3 t_2,$$

Where $c_1$ = Count of the single yarn ; $t_1$ = twist in the single yarn.
" $c_2$ = " " folded Yarn ; $t_2$ = twist required in the folded yarn.

ఈ ఫలితములనుండి (పట్టిక ౩) ఈ క్రింది వక్రరేఖ గీయబడినది.

ఈ రేఖవలన అంగుళమునకు ౬ తిరుగుడుల కంటె హెచ్చుపురి యిచ్చినయెడల బలము తగ్గుననియు, తిరుగుడులు ౧-౬ నుండి హెచ్చుచున్నప్పుడు బలము కూడ ౨౪౫ నుండి ౩౬౫ తులములవరకు హెచ్చుచున్నట్లును, తిరుగుడులు ౬ ఉన్నప్పుడు గరిష్ఠబలము కలిగియున్నట్లును, ౬ నుండి ౧౨ హెచ్చించునప్పుడుబలము ౩౬౫ నుండి ౩౧౫ వరకు క్రమేణ తగ్గుచున్నటులను తెలియుచున్నది. తిరుగుడులసంఖ్య ఇంకను హెచ్చుచేసి పురి యిచ్చినయెడల బలము క్షీణించునో, లేక బలము హెచ్చునో చూడవలసియున్నది. బలము హెచ్చయిన యెడల మన్నికకూడ హెచ్చునుగాన, పై పరిశోధనను ఇంకను గావించినయెడల ఈవిషయమునుగూర్చి సంపూర్ణముగా తెలియగలదు.




వడిదారము: అంగుళమునకు తిరుగుడులు.

## పట్టుశాలి వడిదారములు

పట్టుశాలివారు వడిదారములను సామాన్యముగా ౮-౧౦ పోగులతో తయారుచేయుదురు. కొంతమంది తాము వడికినదారమునే ఉపయోగించెదరు. కొంతమంది మిల్లునూలు వాడెదరు. పట్టుశాలివా రుపయోగించు వడిదారములను మాచే తయారుచేయబడిన వడిదారములను పరిపోల్చిచూచిన ఈక్రిందవిధముగా నుండును.

పట్టిక ౪.

| వడిదారము రకము | బలము (తులములు) |
|---|---|
| పట్టుశాలి (మిల్లునూలు. ఒకదారము) | ౧౪౦ |
| ,, (పట్టుశాలి ,, ,, ,, ) | ౧౪౦ |
| పరిశోధనదారము (వెలమనూలు ,, ,, ) | ౧౮౫ |
| పట్టుశాలి (మిల్లు. జంట పురి లేదు) | ౨౪౦ |
| ,, (పట్టుశాలి ,, ,, ) | ౨౯౦ |
| పరిశోధనదారము (వెలమ. ,, ) | ౨౬౦ |
| పట్టుశాలి (మిల్లు. జంట. ౬ తిరుగుడులు) | ౨౫౦ |
| ,, (పట్టుశాలి ,, ,, ,, ) | ౩౧౦ |
| పరిశోధనదారము వెలమ ,, ,, ) | ౩౬౫ |

## సబర్మతీ విధానము

పై పట్టికవలన పరిశోధనదారము పట్టుశాలీవారు వాడు దారములకంటె బలముగలదని తెలియుచున్నది. వాడుకలో నెటులున్నదో చూతము. సబర్మతీ ఆశ్రమమునందు వడిదారమును తయారు చేయుటయందు మిగుల శ్రద్ధనుజూపెదరు. పురివిషయమై పరిశోధన లచ్చట జరుపబడకున్నను, దారము తయారుచేయు విధానమునుగురించి మిగుల శ్రద్ధను చూపుచున్నారు.

రాట్నముతోకంటె తక్లితో పురి ఇచ్చుట మంచిదిఅనియు, నూలును రాత్రియంతయు నీటియం దుంచిన దారము గట్టిపడుననియు, పురియివ్వకముందును, ఇచ్చినతరువాతను, మైనము పూసినయెడల హెచ్చుకాలము మన్నుననియు వారు స్థిరపరచియున్నారు.

సబర్మతీవిధానము ననుసరించి, పరిశోధనల ఫలితముల ప్రకారము ఇవ్వవలసిన తిరుగుడుల నిచ్చి తయారుచేయబడిన వడిదారములు మిక్కిలి తృప్తికరముగా మన్ని

నవి. ఇట్టిదారము లెన్నియో పరిశోధనలకొరకు మాచే తయారుచేయబడి స్నేహితుల కీయబడినవి. వారిలో ననేకులు ఈపడిదారములు ఒక్కొక్కటి ౧౨,౦౦౦ గజములు తెగకుండ వడుకువరకు నున్నవనియు, కొన్ని ౧౫,౦౦౦ గజములవరకు నున్నవనియు మాకు భోట్టాలను పంపియుండిరి. పట్టుశాలివా రుపయోగించు పడిదారములకంటెనివి అధమము ౬ ఇంతలు హెచ్చుమన్నికను గలిగియున్నటుల మనము లెక్కవేయవచ్చును. ఇట్టిపడిదారముల నుపయోగించుటవలన, వడుకువారికి ఖర్చు తగ్గుటయేకాక, కాలమెంతో కూడివచ్చును. ఈ విషయమై పరిశోధనల నింకను పొడిగించినయెడల ఇంక నెక్కుడు మన్నిక గల పడిదారములను తయారుచేయువిధానమును కనిపెట్టుటకు వీలగునని చెప్పవచ్చును.

ఇట్టి సమస్య లింకె న్నియో కలవు. వాటి నన్నిటిని పరిశీలించినయెడల మంచి అలవాటులను అభివృద్ధిపరచి, నష్టదాయకము లగు అలవాటులను సంస్కరణములను చేయుటకు వీలగును. చిరకాలమునుండి వచ్చు సంప్రదాయములయందు మంచిచెడ్డలు మిళితములై యుండును. మంచిని గ్రహించి చెడ్డను విసర్జించుటకుగాను పరిశోధన లవసరము.



ప్రకృతి చిత్రము

[చిత్రకారుడు: కె. వెంకటరమణరావుగారు.

# ప్రాకృత గాథలు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

(పూర్వసంచికానువృత్తము)

బిగికౌఁగిలికై వలపుల
మగఁడు తమిని గేలుసాఁప మానిని మదిలోఁ
బాఁగసిన యలుక వడిం బా
యఁగఁదొలఁగె, నలంగిపోదు ననుభీతిబలెన్.
(కావ్యప్రదీపము, పు ౧౦౬)

కవివదనాంబురుహమ్ముల
నివసించుచు, ముసలిమగని నేర్పుల నవ్వన్
దివిరిబలెఁ, గ్రొత్తతెఱఁగుల
భువనంబులఁ జూపు పలుకుపొలఁతికి జే జే!
(అదే—పు. ౧౦౬)

అలుక వచ్చినప్పుడంతగా నను వీఁపు
దట్టి రేఁపినట్టి దిట్టతనము,
వానిఁ జూచి బేలువడిన యప్పుడు, చూడు,
చెలియ, మఱఁగువడియెఁ జెప్పకుండ! ౧౧
(అదే—పు. ౧౦౯)

కడవ చంకలోన నిడుకొని, చెలి, మోము
ద్రిప్పి దారి వెంటఁ దేరి కనుచు,
చూడకుండ నిల్లుచొరఁబోయి 'అయ్యయో!
పగిలిపోయె' ననుచుఁ బాఁగులనేల? ౧౨
(అదే—పు. ౧౧౯)

కనులచూపు చెదరి కలఁగెడు నినుఁ జూచి,
సకియ, బరువు మోయఁ జాలవనుచు,
నిజము, తలుపుదాఁకు నెపమునఁ దనుఁదానె
కోరి పగులఁ గొట్టుకొనియెఁ గడవ! ౧౩
(అదే—పు. ౧౧౯)

పల్లెఁ బుట్టినాను; పల్లెలో నున్నాను;
నిజము, పట్టణాల నేర్పు నెఱుఁగ!
పట్టణాలవారి పతులు నాపాలు; నే
నెట్టిదాననైన నేమి? పోవె! ౧౪
(అదే—పు. ౧౨౪)

ఆ మెప్పుల కాయొప్పుల
కామాటలతీయములకు నాయూశల కా
ప్రేమఃకులకుఁ బరిణామం
బేమందును సొగసుకాఁడ, యిట్లాఘటిల్లెన్!
(అదే—పు. ౧౨౫)

విందు గుడువంగ వచ్చిన వెలఁది నిప్పు
డేమి యన్నదో నీదు పెండ్లాము కాని,
చూడు మేడ్చెడిఁ బెరటిముంజూరు క్రింద;
దాని నూరార్పు మేగి యందాలమఱఁది!
(అదే—పు. ౧౨౧)

పక్షిగణము లెగిరి ప్రబ్బలి పొదలలో
నలబలంబు సేయ నాలకించి
ఇంటిపనులఁ దెఱపి వెఱఁగసి కోడలి
కంగమెల్లఁ గ్రుంగినట్టు లయ్యె. ౧౭
(అదే—పు. ౧౪౪)

(సశేషము.)

# అభినవాంధ్రకవితాపితామహుని కవితావినోదములు

మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు

౧

బ్రహ్మశ్రీ పార్వతీశ్వరకవిగారి జీవితమున ప్రధానవిషయములు:—

30-6-1833 జననము.

1833-1866 పాలతేరిలో నివాసము.

1867- శ్రీవిజయనగర మహారాజసన్నిధిలో కవిత్వగౌరవలాభము.

1868-1875 బొబ్బిలీపుర నివాసము. (ఈ కాలమున రాజసభాప్రవేశము లేదు. రాజదర్శనము మాత్ర మప్పుడప్పుడు కలుగుచుండెను.)

1876-1897 శ్రీ బొబ్బిలి సంస్థానాస్థానకవీశ్వరత్వము. ఇదియే శ్రీపార్వతీశ్వరకవిగారి యుచ్చదశ.

28-6-1897 మరణము.

౨

రక్తాక్షి సంవత్సరము

(1864)

‘రక్తాక్షి సంవత్సరమ్మునఁ గారణాం
తరమున బొబ్బిలి కరిగియుండ,
రావు జనార్దన రంగరాడ్విభుని కా
లంబునఁ గొంద “ఆలంబ్య” యనెడు
శ్లోకంబుఁ దెలిఁగించిరే కాని, శుద్ధాంధ్ర
మయముగాఁ దెలిఁగింపరయిరి మున్ను
తెనిఁగింపు మిపు డట్లు నిను మెచ్చెద నటంచు
హితుఁడు దేవులపల్లి కృష్ణశాస్త్రి
శ్లోకము లిఖించి యొసఁగఁగాఁ శుద్ధవికృతి
పదములఁ దదల్పవృత్తి మేకొదువ లేని
యట్ల చెప్పించి, మెప్పించి తౌర నన్ను
హరి హరేశ్వర దేవ, మహానుభావ.’

అని పార్వతీశ్వరులు స్వీయ చరిత్రమున వ్రాసికొనియున్నారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కోరఁగా, నానాలోక యసాధ్యశ్లోకమునకు శుద్ధాంధ్రీకరణమును పార్వతీశ్వరకవిగారు చేసియున్నారని దీనిభావము.

ఇచ్చిన శ్లోకము:

“ఆలంబ్యాగ్రాంశుయష్టిం, హరిహ రితి
ధృతాం కేంద్ర నీలోపహార
ప్రోద్యచ్ఛీతాంశుహైమచ్ఛదపుటికధరాం
భోధికాం, రాత్రిసంజ్ఞాం
పృచ్ఛంత్యాం భార్గితారాభరణముష మధః
పార్శ్వభాజః ప్రదోషో
దృష్ట్వాతాం జ్ఞాతాపరాధా స్స్వపితు రనువనం
లిల్లిరే ద్రాక్తమిస్రాః.”

చెప్పిన యచ్చతెనుఁగుపద్యము :

"తొలుడాల్కట్టియఁబట్టి, తూర్పుచెలి, కం
దున్నల్లరాకాన్కగా,
నెలపాౙ్రేకుల జట్టిగాఁ గొనిన పె
న్రేచెంచితన్ మింటియం
దలి ప్రొద్దుందొడవ్రాడ్చు చొప్పడుగఁ
జెంతం దఱ్ఱిడినేరం బెటిం
గి, లలిం జీకటి సంజకుట్టగమి డాఁ
గం గానలం దెల్లెడన్."

## 3

(క్రోధనసంవత్సరము)

1865

'సుతనిరామయతకై సూర్యనారాయణ
స్వామిని గని హర్షవల్లినుండి
వావిలవలసకు వచ్చి యున్నంటి సీ
తారామవిభుఁ గాంచి, తత్ప్రతిజ్ఞ
నణఁచి, "యాతన్వంగి" యనెడు వసుచరిత్ర
లోనిపద్యమునకు శ్లోకరచన,
ప్రతిన నిన్నూటయేఁబది యాఱుపద్యముల్
గలుగు షోడశవిధ కందరచన
తత్కవులకన్న నెక్కుడు ధార గలిగి
వింతయగునట్టి యాశుకవిత్వరచన
నాకుఁ గలిగించి, చెలఁగించినాఁడ వౌర,
హరిహరేశ్వర దేవ, మహానుభావ.'

అని పార్వతీశ్వరకవిగారు స్వీయచరిత్రమున వ్రాసికొన్నారు.

పిమ్మట ప్రభువులు ఇన్నూటయేఁబది యాఱువిధములుగాఁ జదువఁదగిన షోడశవిధ కందమును రచింపుఁడని కోరఁగా శ్రీశాస్త్రులుగా రాశువుగానే యీక్రింది కందమును రచించిరఁట.

'శ్రీ[1]వామ। దేవ[2]॥ పావన[3]।
భావా[4]॥ భావంగ[5]॥ మాౙ్య[6]। పండిత[7]। భావా[8]॥
శ్రీ[9]వాసు। దేవ[10]॥ బహ్వాను[11]।
భావా[12]॥ భావ[13]। భవజనక[14]॥ పాలిత[15]॥ భావా[16]॥'

'ఏకమతిన్ భేకగతిన్
సాకల్యమునం గనుండు షట్పంచాశ
చ్ఛోకోత్తర ద్విశత సం
ఖ్యాకములై యంద మొందు కందము లిందున్.'

ఆశువుగా రచించిన యీషోడశవిధ కందమును విని రాజును బండితులునాశ్చర్యపడిరఁట. పిమ్మట శ్రీశాస్త్రులవారి యాశుధారను బరీక్షింపఁగా, ప్రభువువారి యాస్థానవిద్వత్కవుల కన్న నెక్కుడుధారతో పార్వతీశ్వరకవిగారు తమయాశుకవితాప్రభావమును వెల్లడించిరఁట. ఇట్టి యాశుధార మున్నెన్నఁడును జూడలేదని యందరును సంతసించిరఁట. ఆనాఁటి సభలో శ్రీ శాస్త్రులవారు రచించిన యాశుకవిత మన కిప్పుడు లభ్యముకాలేదు గాని, మఱి కొన్ని చోట్ల శ్రీశాస్త్రులుగా రాశువుగా రచించిన పద్యములు లభ్యములైయున్నవి గాన నవి మున్ముందుఁ బ్రకటింతుము.

---

# పసుపు

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

మబ్బుమెట్లపయి
మణిమయభూషలు
రాలనేగు నీ
రాతిరిఁ గనుఁగొను!

వెన్నెలతెర కొన
వ్రేలఁ జించికొని
వడివడిఁబోవు ప్ర
భాతముఁ గనుఁగొను!

కలపినలత్తుక
కాళ్ళఁ దన్నికొని
చయ్యనఁ జను నీ
సంజఁ గనుంగొను!

సకియా, యెక్కడి
శాంతము బ్రతుకే
తెల్లవార నదె!
తెల్లవారెఁ గదె!

పికము లుమియు నీ
విసముఁ ద్రావుదును!
వెన్నెలరేకలఁ
బన్నికొందు నురి!

చుక్కరవను జిఱు
ముక్క మ్రింగుదును!
గాలిచిచ్చులోఁ
గడఁక దూఁకుదును!
కదలుము గడు వర
గడియ నెచ్చెలీ!

పెన్నెరిక్రొమ్ముడి
విరియఁబోసికొని
దండఁ ద్రెంచి ము
త్యాలు చల్లికొని
ఎడనెడ నూర్పులఁ
గడలుకొల్పికొని
నిశలో నిశనై
నిలిచిపోయెదను!
కదలుము గడు వర
గడియ నెచ్చెలీ!

నాహృదయమే కలఁచి
నాళాలఁ ద్రెంచికొని
తేఁటి తనతంబురకుఁ
దీవియలు గట్టికొను!

నామేన చీల్చి క్రొ
న్ననఁ జర్మ మొలిచికొని
చందురుఁడు పాదర
క్షల జోడు కుట్టికొను!

నాకురులె కొనగోళ్లు
నాటికొన గుబ్బెళ్లఁ
గోకిలము పెకలించి
కొని గూడు కట్టికొను!

ఆలకింపవె నెచ్చెలీ!
అరనిముస
మాలసింపకె నెచ్చెలీ!

ఈమెయిసోకే
నామనోహరుని
యడుగుఁదమ్ములకు
మడుఁగు లొత్తవ!

ఈహృదయమె గొని
నాహృదయేశున
కాదటఁ గ్రపపు
టార తీయవే!

నెలఁతా, యీపె
న్నెరులతోడ నా
ప్రాణవిభునిమృదు
పదము లొత్తవే!

అన్నెము పున్నెము
నన్నియు నీవే
సుదతీ! యపుడేఁ
జూడ వత్తునట!

పూల నా కడయూరు
పులు మారు మ్రోఁగవే?
తరులలో నాజీవి
తపు సంజ కదలదే!

చివురులో నాయడుగు
చిన్నియలు తోఁపవే!
గాలిలోఁ గన్నీటి
కడచెమ్మ మిగులదే!

కలయకుండిన పోయెనే,
విభుఁడవే
కలయఁజూచినఁ జాలునే!

వేలు దండములు
మేలు మరువనే!
నీముంగిలి పె
న్నెరులఁ దుడుతునే

ముందుపుట్టు నీ
బుడుత నౌదునే
చందురుఁడే మన
సాక్షి-కదలవే!

కదలుము గడు వర
గడియ నెచ్చెలీ!




తే. మాతకును వేదమునకు ధర్మంబులకును
బరము లగు గురు శాస్త్ర లాభములు లేవు
తపము లే దుపవాసవ్రతంబుకంటె
నధిక మైనది యంద్రు మహాత్ము లనఘ.

—భార. అను. చతు.

### గాంధిమహాత్ముని - ప్రాయోపవేశము

గాంధిమహాత్ముని ప్రాయోపవేశ సంకల్పము ప్రపంచమునం దంతటను ధర్మమహా సంచలనమును గలుగజేసినది. ప్రపంచేతిహాసములందు ధర్మపరివర్తనఘట్టము లపూర్వములు. దిగంతవ్యాప్తములైన బాహుబల విజయము లనంతములుగ గనుపడుచున్నను ధర్మవిజయఘట్టము లతిస్వల్పములుగ నున్నవి. సత్యవ్రతపాలనమునకై హరిశ్చంద్రుడు సర్వస్వమును ధారవోసిన యితిహాస మాశ్చర్యజనకముగ నుండును. సత్యసంరక్షణార్థము విషపాన మానందముతో జేసిన సోక్రటీసుకథ విస్మయమును గలుగజేయును. ఆత్మోపలబ్ధికై రాజ్యసంసారపరిత్యాగము చేసిన గౌతమ బుద్ధుని యుదంతము సంభ్రమమును గలుగజేయును. ఆత్మప్రతిష్ఠాపనమునకు సిలువ నాలింగనము చేసిన ఏసుని గాథ యద్భుతకార్యముగ నుండును. ప్రపంచమునందు సత్యపరిపాలనార్థము పరమప్రియమైన ప్రాణము నర్పించిన యుదంతము లపూర్వములు. ప్రాణత్యాగమునందును నితరప్రమేయము లేక కేవలము లోకసంగ్రహణార్థము ప్రాయోపవేశదీక్షను బూనుట పరమాశ్చర్యవిషయము. పరపీడనపరాయణం బైన ప్రపంచమునం దాత్మత్యాగప్రభావము దుర్గ్రాహ్యముగ నుండును. విషయాసక్తమైన వర్తమానసమయమునందు ప్రాయోపవేశసంకల్పము పరిహాసపాత్రముగ నున్నది. గాంధిమహాత్మునిసంకల్పమును కొసరియాడెడివారివలెనె నిందించెడి వారును గలరు. నిందాస్తోత్రములసంగతి యెటులున్నను ప్రాయోపవేశము పండితపామరులకు జిజ్ఞాసకు గారణం బైనది. మానవదృష్టియందు జీవితమునకును ధర్మమునకును గల పరస్పరసంబంధమును విమర్శించుట కవకాశములు కలిగినవి.

* * *

### జీవితము - ధర్మము

జీవయాత్రయందు జీవితమునకును ధర్మమునకును గల పరస్పర సంబంధము పండితులకును దురవగాహముగ నున్నది. ప్రపంచమునందు "బ్రతికియుండిన శుభములబడయవచ్చు"

గలుగజేయుచున్నను అనధికారమయమైన విషయప్రపంచమునం దపశ్రుతిమూలమైన యధర్మనాదము వినబడుచున్నది. సత్యశ్రుతి విశ్వమునంతయును సంచలింపజేయగల విధమును దివ్యమైన యరవడాక్షేత్రోదంతము లోకమునకు ప్రత్యక్షము చేసినది. శ్రీ కృష్ణ పరమాత్ము డర్జునునకు విషాదావస్థయం దుపదేశించిన యాత్మధర్మావతరణమును గాంధి మహాత్ముని ప్రాయోపవేశ సంకల్పము ప్రత్యక్షము చేసినది.

శ్లో. యదా యదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య
తదాఽఽత్మానం సృజా మ్యహమ్.

—భ. గీ. అ. ౪-౭.

గాంధిమహాత్ముని ధర్మసంకల్పము అస్పృశ్యులను స్పృశ్యులను జేసినది; అపవిత్రులను పవిత్రులను జేసినది; చెరసాలను పుణ్యక్షేత్రము చేసినది; నిస్తేజమును తేజోవంతము చేసినది; జడహృదయమునకు స్పందనమును గలుగజేసినది; నిద్రావస్థకు ప్రబోధావస్థను గల్పించినది. ఒక శ్రేష్ఠపురుషుని ధర్మసంకల్పము విశ్వధర్మద్వారమును మానవకోటికి తెరచినది. నిత్యమైనను అంతర్ధానమైన ధర్మద్వారము తెరువబడిన పర్వకాలమునందు ధర్మక్షేత్రప్రవేశము సామాన్యులకును సులభముగ నున్నది. ఈ పర్వసమయమునందు హిందువులును, మహమ్మదీయులును, క్రైస్తవులును, ప్రాచ్యులును, పాశ్చాత్యులును, ఉన్నతజాతులును, నిమ్నజాతులును, స్త్రీలును, పురుషులును, అధికారులును, అనధికారులును, ప్రభుత్వమును, ప్రజలును మమకారాహంకార సంజాతములైన, స్వార్థపరములైన భేదావరణములను పరిత్యజించి, పరార్థపరమైన ధర్మావరణమునందు ప్రవేశించుటకు యత్నించి విశ్వమానవధర్మావరణమును సార్థకము చేయుట ధర్మము, వివేకము. సంకల్పము కార్యరూపమును బడయుటయే ధర్మారాధనము.

శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః.

—గీతా. ౪-౧౧.

గాంధిమహాత్ముడు లోకోద్ధరణార్థము పూనిన నిరశనసాధ్యమైన ప్రాయోపవేశ సంకల్పము, శ్రీ గాంధిజయంతి కపూర్వమైన ప్రతిష్ఠను గల్పించినది. గాంధిమహాత్ముని ఆత్మకథ యంతయును కన్నుల కగపడినది; చెవులకు వినపడినది; ముక్కునకు ఘుమాళించినది; త్వక్కునకు సోకినది; జిహ్వకు రుచించినది; చిత్తమున కానందమును గలుగజేసినది. మానవులకు, వారి సంకల్పమున కనురూపముగ గోచరంబగుచు వ్యక్తులకును, జాతులకును సంకల్పప్రభవమైన కామరూపములను విశ్వము సాక్షాత్కరించుచున్నది. విశ్వమాత ధనారాధకులకు ధనమును, కామారాధకులకు కామమును, క్రోధారాధకులకు క్రోధమును, ద్వేషారాధకు

లకు ద్వేషమును, ప్రేమారాధకులకు ప్రేమను, ధర్మారాధకులకు ధర్మమును ప్రసాదించుచున్నది. ధర్మశ్రుతిస్వరూపిణియైన విశ్వమాత ధర్మనాదానురూపముగ నానందతాండవమును జేయుచు విశ్వకల్యాణమహోత్సవమును సర్వత్ర ప్రత్యక్షము చేయుచున్నవి. ధర్మశ్రుతికి రాగద్వేషారాధకులు గల్పించెడి అపధర్మశ్రుతులు ఆనందతాండవమున కాటంకములను గలుగజేయుచు విశ్వకల్యాణమహోత్సవము నంతర్ధానము చేయుచున్నవి. విశ్వరంగమునందు సాత్త్వికధర్మప్రవృత్తికిని, రాజస తామస ధర్మప్రవృత్తులకును నిరంతరము సంప్రాప్త మగుచున్న మహాసంరంభమున కపధర్మశ్రుతులు మూలములు. గాంధిమహాత్ము డుపదేశించెడి సాత్త్వికనిరోధమార్గము రాజస తామస గుణావృత మైన వర్తమానయుగమునందు పరిహాసనిరసనములకు, రాగద్వేషములకు, దురభిమాన దురహంకారములకు పాత్రమగుట సహజము. ప్రభుత్వము నిరంకుశాధికారాస్త్రములను సృష్టించి సాత్త్వికనిరోధోద్యమమును నిర్మూలము చేయుటకు చేయుచున్న ప్రయత్నములు నిరర్థకములు. అమృతప్రాయమైన సాత్త్వికనిరోధాస్త్రమును మృతప్రాయములైన రాజసాస్త్రములు నిర్జింపజాలవు. ధర్మము నధర్మమును, సత్యము ననత్యమును, శాంతిని సంరంభమును, సుఖమును దుఃఖమును నిర్జించుట ప్రకృతిధర్మమునకు ప్రతికూలము. కాలాంతరమునందైనను గాంధిమహాత్ముని శాంతిధర్మ సందేశము విజయమును బడయుట తథ్యము. ప్రపంచమునకు స్వయంకృతాపరాధఫల మవశ్య మనుభవనీయము. సంగ్రామ విషబీజములను, రాగద్వేషబీజములను నాటిన ప్రపంచము సంగ్రామవిష రాగద్వేషసస్యఫలము ననుభవించుచున్నది. గొప్పతపస్సును, మహాప్రాయశ్చిత్తమును లేమి హిందూస్థానమునకును, ప్రపంచమునకును ఆసన్నమైయున్న దుఃఖానుభవ మావశ్యకముగ నున్నది. గాంధిమహాత్ము డుపవాసరూపమైన తపస్సును, ప్రాయోపవేశ సంకల్పపూర్వకమైన ప్రాయశ్చిత్తమును చేసి దేశకల్యాణమునకును లోకకల్యాణమునకును, ప్రజలకును ప్రభుత్వములకును, జాతులకును మతములకును, శాస్త్రములకును సాహిత్యములకును, నిత్యమైన ధర్మనిర్వహణోపాయమును బోధించుచున్నాడు. ఆ బోధ తమసావృతమైన ప్రపంచమునకు బధిరశంఖారావముగ నున్నది. గాంధిమహాత్ముని ఉపవాసము,ప్రాయోపవేశసంకల్పము,జయంతి ప్రపంచదృష్టిని - ముఖ్యముగ హిందూస్థాన ప్రజాలక్ష్యమును-సత్యాగ్రహధర్మ సందేశమునందు లగ్నము చేసినవి.

క. కావున నుపవాసవ్రత
సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
బావన మైహికమహిమయు
దేవనిలయసుఖము నిర్వ్యధిఁ సమకూరున్.

—భార. అను. చతు.

* * * *

ప్రజల కర్తవ్యము

మహాత్ముని ప్రాయోపవేశసంకల్పమువలన హిందూసంఘమునందలి నిమ్నోన్నతజాతుల నాయకులమధ్య సాంఘికనిర్ణయము కుదిరినది. అంబేద్కరు, గాంధిగారల సాంఘికనిర్ణయము హిందూస్థానచరిత్రమునందు నూతన శకారంభమును జేయుచున్నది. ఈ యొడంబడిక నిమ్నజాతుల హక్కులను అంగీకరించుచున్నది. ఈక్రింది యొడంబడికలోని విషయముల విమర్శన ముభయపక్షములును నిష్పక్షపాతబుద్ధితో జేసిన న్యాయనిర్ణయమును విశదము చేయుచు హరిజనులు మహాజనులును పశుధర్మారాధకులు మానవధర్మారాధకులును గావలసిన యవసరమును పరిస్ఫుటము చేయుచున్నది.

ఒడంబడిక

“1. సమష్టినియోజకవర్గములవలన ఎన్నుకోబడవలసిన స్థానములలో యీ దిగువ వివరింపబడిన రాష్ట్రీయ శాసనసభలలో ‘అస్పృశ్యుల’ కిట్టుల స్థానములు ప్రత్యేకింపబడవలెను.

| | |
|---|---|
| మదరాసు | 30 |
| బొంబాయి-సింధు | 15 |
| పంజాబు | 8 |
| బీహారు-ఒరిస్సా | 18 |
| మధ్యరాష్ట్రములు | 20 |
| ఆసాము | 7 |
| బెంగాలు | 30 |
| సంయుక్తరాష్ట్రములు | 20 |
| మొత్తము | 148 |

ప్రధానమంత్రి ప్రకటనలో వివరింపబడిన శాసనసంఘసభ్యుల మొత్తముసంఖ్యనుబట్టి యీ అంకెలు స్థిరపరుపబడెను.

2. సమష్టి నియోజక వర్గమునకు సంబంధించిన వోటరుల పట్టికలో వోటరులుగా నంగీకరింపబడిన ‘అస్పృశ్యు’లందరును ప్రథమనియోజకవర్గముగా నేర్పడి అస్పృశ్యుల కేర్పరుపబడిన ప్రత్యేకస్థానములలో స్థానమునకు నలుగురు అస్పృశ్యులను ఎన్నుకొనవలెను. వీరు సింగిలువోటు పద్ధతినే యెన్నుకొనవలెను. ఈ రీతిగా జరిగిన యెన్నికలలో మిక్కిలి హెచ్చువోట్లు వచ్చినవారు స్థానమునకు నలుగురిచొప్పున సమష్టి నియోజకవర్గములచే ఎన్నుకొనబడుటకు నిలువవలెను. రెండవ యెన్నిక సమష్టినియోజకవర్గముల వలననే జరుగును.

3. భారత శాసనసభలందు గూడ అస్పృశ్యులకు ప్రత్యేకస్థానము లుండును. ఆ స్థానములకుగూడ పైని తెలుపబడిన రీతినే మొదట అస్పృశ్యులును, పిమ్మట సమష్టి నియోజకవర్గమువారును ఎన్నుకొనవలెను.

4. బ్రిటిషు ఇండియాలోని సమష్టి నియోజకవర్గమువారిచే భారత శాసనసభలకు ఎన్నుకొనబడుటకు నిర్ణయింపబడిన స్థానములలో 100 కి 18 చొప్పున అస్పృశ్యులకు ప్రత్యేకింపవలెను.

5. మొదటి పదియేండ్లవరకు మాత్రమే యీ రీతిగా ప్రతిస్థానమునకును రెండుసారులు ఎన్నికలుజరుగవలెను. అటుపిమ్మట సమష్టి నియోజకవర్గమువలన మాత్రమే యెన్నికలుజరుగవలెను. రెండు పార్టీలవారును ఇష్టపడినచో ఈలోగానే దీనిని రద్దుపరచవచ్చును

6. అన్ని శాసనసభలలోను అస్పృశ్యులకు ప్రత్యేకస్థానముల నేర్పరుచుట అనవసరమని రెండు పార్టీలవారును కలిసి నిశ్చయించువరకును ఈపద్ధతియే అమలులో నుండును.

7. భారతశాసనసభలకును రాష్ట్రీయశాసనసభలకును అస్పృశ్యులలో వోటరుల అర్హతలు లోథియను కమిటీవారి నివేదికలో సూచింపబడినట్లు లుండవలెను.

8. స్థానికసంఘముల పదవులను ప్రభుత్వోద్యోగములను బడయుటకు ఒక వ్యక్తికి అస్పృశ్యతయే కారణమున నెట్టి అనర్హతయును కలుగగూడదు. ఉద్యోగములనొసగుటకు నిర్ణయింపబడిన విద్యావిషయకములగు నర్హతలను కలిగియున్నయెడల అట్టి విద్యాధికులకు అస్పృశ్యులకు న్యాయ్యముగా రావలసినన్ని పదవులను వారు పడయగలుగుటకు సకల ప్రయత్నములును చేయబడును.

9. ప్రతి రాష్ట్రములోను విద్యాశాఖావ్యయములకు ప్రత్యేకింపబడిన మొత్తములో అస్పృశ్యుల విద్యాభివృద్ధికి చాలినంతధనము ప్రత్యేకింపబడవలెను."

అను షరతులు ఒడంబడికలో గలవు.

పూనాలోనున్న పండిత మదనమోహన మాలవ్యా, సర్ తేజబహాదరుసప్రూ, ఎం.ఆర్.జయకరు, జి.డి.బిర్లా, రావు బహాదరు ఎం. సి. రాజా, డాక్టరు అంబేద్కరు, డా॥ సోలంకా, రా॥బ॥ శ్రీనివాసను, పి. బాలూ, రాజభోజ్, శివరాజు, సి. రాజగోపాలాచారి, ఎం. పిళ్లె, సర్ సి. బి. మెహతా, గవాయి, దేవధరు, కప్రోల్కరు ఎ. వి. ఠక్కరు, బఖాలే, రాజేంద్రప్రసాదు గార్లు మున్నగు నాయకు లందరును ఒడంబడికపైన సంతకములను చేసిరి.

ఈ యొడంబడిక హిందూసంఘమున కమూల్యమైన ప్రయోజనమును సమకూర్చుటకు ప్రజానాయకుల భారమును దుర్భరము చేయుచున్నది. చిరకాలానుగతమైన అస్పృశ్యతను నిర్మూలించుట, అస్పృశ్యులకు దేవాలయప్రవేశము, వాపీకూపతటాకాద్యుపయోగములు కర్మయోగాభ్యాసములేని హిందువులకు సులభసాధ్యములు గావు. గాంధీవిజయఘోషలు, గాంధిసంకీర్తనములు, గాంధిసంభాషణములు, దానాదులువలె కార్యాచరణము సుకరముగాదు. హిందువులు చిరకాలానుగతంబైన యాచారపాశబంధములను తెగగొట్టవలసిన శుభసమయము తటస్థించినది. ఈ సుముహూర్త మిపుడు పోయిన తిరిగి సంప్రాప్త మగుటకు చిరకాలము పట్టుట సహజము. హిందూసంఘ సంయోగమును, మహాత్ముని తపఃప్రభావమును మహమ్మదీయ క్రైస్తవ సంఘములందును సంచలనమును గలుగజేసినవి. ప్రచండ సాంఘికవాదియైన మౌలానా షౌకతాలిగారికిని చిత్తవృత్తి మారినది. అన్సారి షౌకతాలిపక్షములకును, హిందూ మహమ్మదీయ పక్షములకును సంప్రతింపులు జరుగుచున్నవి. హిందూసంఘ నాయకులు, మదనమోహన మాలవ్యా, మూంజి, సప్రు, జయకరుగారులు షౌకతాలి, శాశిం మిత్ర, అబ్దులుమజీదు, అబ్దులుకలము ఆజాదుగారు మొదలగువారల యభీష్టములను పూర్తిగను సఫలముచేసి హిందూస్థానసంయోగబలమును నిరంకుశాధికారప్రభుత్వమునకు ప్రత్యక్షము చేయుదురుగాత! నవంబరుమాసాంతమునందు లండనునగరమునందు మూడవ రౌండుటేబిలు సమావేశము గూడనున్నది. అక్టోబరు మాసాంతములోపల నన్ని పక్షములవారును బొంబయియందు గూడి సాంఘికసమస్యను హిందూ సమస్యవలె నిష్పాక్షికముగ నిర్ణయించి స్వరాజ్యసాధనిర్మాణమునకు ధర్మప్రతిష్ఠాపనమును జేసి హిందూస్థానసంయోగమును సుస్థిరముచేయుట యవసరము. బ్రిటీషు ప్రభుత్వమువారు శాంతిదూతయైన గాంధిమహాత్ముని ఈసంవత్సరారంభమునందు నిర్బం

ధించి హిందూస్థానక్షేమమునకును, ప్రపంచ శాంతికిని చేసిన మహాపరాధము నిప్పుడైనను సవరించుకొనుట ధర్మము. హిందూస్థానము నందు గాంధిమహాత్మునకు గల నిరుపమానమైన గౌరవప్రతిష్ఠలను హిందూసాంఘిక సమస్యానిర్ణయము విశదముచేసినది. నిష్కామయోగియును,సిద్ధసంకల్పుడును, శాంతిప్రియుడును నైన గాంధిమహాత్ముని నిర్బంధమును తొలగించి మహాత్ముని మహిమను సాంఘికనిర్ణయమునకును, రాజ్యాంగనిర్ణయమునకును, ప్రపంచశాంతికిని వినియోగించుటకు పరమేశ్వరుడు ప్రభుత్వమునకు జ్ఞానోదయము ననుగ్రహించుగాత! షౌకతాలిగారి ప్రార్థననైనను చెవిని జెట్టి గాంధిమహాత్ముని విడుదలచేయుట ప్రభుత్వమున కలంఘనీయమైన ధర్మము.

---